—: శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః :—

శ్రీ

# ★ రామ రాజ్యము. ★

## (మహా ప్రబంధము.)


గ్రంథకర్త,

సాహిత్య శిరోమణి & ఉభయభాషా ప్రవీణ,

వైద్య

కొండూరు నరసింహాచార్యులు,

ప్రధానాంధ్ర పండితులు,

ఓ. ఆర్. బోర్డు హైస్కూల్, జమ్మలమడుగు.




వెల. 3—0—0

# విషయ సూచిక.



| విషయము. | పుటము. |
|---|---|

# పరిచయము.

మహాశయులారా! తన యమోఘమైన కావ్యశిల్పముచే ఖండ ఖండాంతరములఁ బేరెన్నికఁగన్న మహాకవి కాళిదాసు నంతటివాఁడు.

శ్లో॥ “మందఃకవియశఃప్రార్థీ గమిష్యామ్యుపహాస్యతామ్,
ప్రాంశులభ్యే ఫలేలోభా దుద్బాహురివవామనః”

క॥ మందుఁడఁ గవియశమును నే
నందఁగ బరిహాసమునకు నాశ్రయమగుదున్
పొందుగఁ బొడగరి చేతికి
నందెడు ఫలమున్ ప్రొట్టిఁ దాకించుక్రియన్”

అని వాకొనిన నేనెంతవాఁడను, అయినను బ్రాచీనులు సంఘమునకు శాస్త్రమునకు దాసోహమ్మనువారు. ఎంతటిపాండిత్య ప్రకర్షయున్నను దమకంటెఁ బెద్దలుందురన్న వినయప్రకటనమే వారిసంప్రదాయము. స్వేచ్ఛా ప్రగల్భములు వారికి నచ్చవు. అర్వాచీన కావ్యయుగమునఁ బెద్దలసంప్రదాయమునకుఁ దావుండదేమో?

కట్టా! ఈప్రాచీనులకును, నవీనులకును నడుమఁజిక్కి యాంధ్ర సాహిత్య సరస్వతి యూపిరాడక యిప్పుడు నలఁగి పోవుచున్నట్లు తోఁచు చున్నది. ఈ ప్రాచీన నవీనముల యందుఁగల గ్రాహ్యత యెంతమాత్రమో వివరింప విజ్ఞులకే విదితము.

“విశ్వశ్రేయఃకావ్య”మ్మన్న నుడికి గుఱియైనంతవఱకది ప్రాచీనపద్ధతిగాని, నవీనపద్ధతిగాని సకలమానవ సంసేవ్యమగుననుట నిర్వివాదాంశము. లేనిచోఁ దాఁదలఁచినదెల్లఁ గావ్యమును, దావలచునదెల్ల రంభయగునా?

కావ్య ప్రపంచమున నవీనములని నడచుమార్గము లన్నియుఁ బ్రాచీనులు త్రొక్కి విడిచినవే. "బాణోచ్ఛిష్టం జగత్సర్వమ్" అను నుడికేమిబదులు? వారు నడిచిన మార్గములు విశాలములు, రాచ బాటలు, త్రొట్రుపాటులేకుండ గమ్యస్థానమును జేర్చునవి. ఏ హేతువు చేతఁగాని నిగూఢభావముల యల్లికచే సహృదయ హృదయములను జీఁకాకు పఱుచుచు సాలెపురుగులు గూడు లల్లుకొనునట్టి పద్ధతి వారికి నచ్చినది గాదు. పై పై తళుకు బెళుకులకుఁ దావిచ్చుట వారి సంప్రదాయము గాదు.

జాతీయతాభివృద్ధియే కావ్య నిర్మాణమునకుఁ బరమ ప్రయోజన మగునేని అట్టి ప్రయత్నమేగదా రసిక జనహృదయంగమ మగుచున్నది? ఇందు కితివృత్తము ప్రాచీనమైననేమి? నవీనమైననేమి? ప్రసిద్ధమైననేమి? కల్పితమైననేమి? ఆయాకాలములయందలి సాంఘిక పరిణామములే రసికజన మనోనురంజకముగఁ గవి భావవిలసితములై కావ్యము లనిపించుకొనుట జగమెఱిఁగిన విషయము ఏదిగాని యొక నియమమునకు లోఁబడియుండు నంతవఱకే దానిసొంపు. "సాంఘిక పరిణామములు తాత్కాలికములు, అశాశ్వతములు, ప్రాపంచిక శ్రేయస్సాధనమున కవి చిరస్థాయి కాఁజాలవు కనుక కావ్యవస్తువుగాఁ బరిగ్రహింప ననర్హములు"నుట యెంతవఱకు యుక్తిసహమో విజ్ఞులూహించెదరు గాక. నేఁడు సాంఘికముగానున్న సంస్కరణములు, వాని పరిణామములే రేఁపు చారిత్రికము లగుచుండుట చూచుచున్నాము. అవి లేనిచో కావ్య నిర్మాణ మెక్కడ?.

ఇతివృత్త మేదియైనను కావ్యశిల్పము మాత్రము కవ్యుద్దేశము ననుసరించియే నడచుచుండును. అది తాత్కాలిక జాతీయపరిణామ

ములు దృష్టియందుంచుకొని లోకమున కొక యుత్తమ సందేశమును జాటుటకు సంకల్పించుకొనియుండును. మనదేశమున రామాయణ మును వ్రాయని కవి యుండఁడుగదా? ఎందఱు వ్రాసినను విసుఁగుఁ గలిగింపని లోకోత్తర గుణ విశేషములును, నెవ్వరేమార్గమున నడి పించినను విసుఁగుఁజెందక వెంబడించు లోకోత్తర ధీరోదాత్త నాయ కుఁడు నందుండుట గారణము.

"ఈ, యుర్విఁబయోనిధింబరగు నుజ్జ్వల రత్నచయంబు నిత్యమున్,
సర్వముఁగొన్న నాపయినసంఖ్యమణుల్మఱి యుద్ధరింపరే"?.

అను నుడికి రామాయణము ప్రబల నిదర్శనమనుట పొల్లుగాదు. లోకోత్తరనాయక చరితములట్టివయగు. నారచనమునకు దాని నాశ్ర యించుటలోఁ బరమ రహస్యమిదియ.

మన స్వతంత్ర భారతమును క్రీ॥ శ॥ 1947 ఆగస్టు 15వ తేదీ నుండి రామ రాజ్యముగ భావించుకొనుచున్నాము. ఇందుఁగల స త్య మెంతమాత్రము? రాముని యవతారము, అతఁడెదుర్కొనిన కష్ట పరంపరలు, అతఁడు సాధించిన ఘనకార్యములు. అతని పరిపాలనా పద్ధతి, మొదలగు నంశములను గ్రహించి యప్రమత్తులమై యావిధ ముగ నడుచుకొనిననేగదా మనమందు కృతార్థులమగుట. మనము స్వతం త్రులమైన వెంటనే మన నాయకులనిర్వచనీయమైన సంఘటనల నెన్నింటినో యెదుర్కొనవలసి వచ్చినమాట మఱువరానిది. ఇంకను మన మనేక విషయములను సాధించి సంపూర్ణ స్వాతంత్ర్యమును ని లువఁబెట్టుకొనవలసియున్నది. ఆనాఁడు మన భారత రాజ్యాంగలక్ష్మి నిర్విచార. ఆనాఁడు నిజముగ మనరాజ్యము రామరాజ్యమే. ఇవ్విష యమును, సులభముగ, సంగ్రహముగ, లోకమునకు వెల్లడించుటయు

నా పరమోద్దేశ్యము. కేవల కథారచనమున విసుఁగు గలుగకుండు టకై యనుచితముగాని మార్గమునఁ బ్రబంధపద్ధతి నాశ్రయించితిని. నాకృతిని గుఱించి యింతకంటె నెక్కువ వ్రాయ నాకధికారములేదు. ప్రబంధమును ముందుంచితిని, గుణదోషముల నిరూపించు నధికార ము విజ్ఞులగు పెద్దలది. తప్పులున్న క్షమింతురుగాక.

ఈ ప్రబంధ ప్రచురణమునకుఁ గావలసిన ద్రవ్యసహాయ మొ నర్చి నా ప్రయత్నమునకుఁ బ్రోత్సాహ మొసంగిన కడపజిల్లాలోని పౌరవరులకును, ముఖ్యముగా నా శిష్యవర్గమునకు, నేనెంతయుఁ గృతజ్ఞుఁడను.

నాఛాయా చిత్ర ప్రతిమను సిద్ధముచేయించి యిచ్చి ప్రోత్స హించు, నాశిష్యుఁడు విద్వాన్, ఆర్. నారాయణరెడ్డిగారి యాదా ర్యము, గురుభక్తి, మరువరానిది.

పుస్తకము చౌకమార్గమున నచ్చొత్తించి, సమయమున కందఁ జేసి, ప్రోత్సహించు జమ్మలమడుగు జ్యోతి ముద్రణాలయ యజ మానులును, అందలి సిబ్బందియు, ప్రశంసార్హము.

సర్వేజనా స్సుఖినోభవంతు.

జమ్మలమడుగు, (కడప జిల్లా.) 9-11-52.

ఇట్లు,
బుధజన విధేయుఁడు,
కాండూరు నరసింహాచార్యులు.



శ్రీ

# ★ రామ రాజ్యము. ★

## (ప్రథమాశ్వాసము.)

—: మంగళాచరణము. :—

శా॥ శ్రీరంజిల్ల విదేహరాజసుతకై సేయంగ భద్రాకృతిన్
సారంబౌ సురభూజమూల విలసత్సౌవర్ణ శ్రీమంటప
శ్రీరాజిల్లు మణీమయాసన లసచ్ఛ్రీరామచంద్రుండు, లో
కారాధ్యుండు మునీంద్ర వంద్యుఁడెలమింగల్గించు భద్ర
మ్ములన్. 1

చ॥ చెలువుగ రాము సన్నిధి విశిష్ట దయారస పూరమొప్పఁగం
జెలిమి యెసంగ వల్లభ! యశేష ప్రపంచ విధాత! ప్రోవఁగం
దెలియుదె భుక్తి ముక్తులమదిందలపోసి భజించుభక్తులన్
వలవదుపేక్షసేయనను వత్సల భూసుత సీతఁగొల్చెదన్. 2

చ॥ వెలయుజగమ్మున న్విభవ వృద్ధికి మూలము ధర్మవృద్ధి, యా
యలఘు విశుద్ధ ధర్మమున కాశ్రయమెక్కుడు సజ్జనాళి, యిం

పాలయఁగ ధర్మ కర్మములకున్నతిపాత్రిపు కవీంద్రు పల్కులేఁ
దలఁచెదనట్టి ధర్మనిరతార్యకవీంద్రులఁగార్యసిద్ధికై. 3

ఉ॥ తేనియలొల్కు పల్కుజిగిఁదీరిచి కబ్బములల్లు నేర్పు, సం
ధాన పటుత్వముల్, సరసతా ప్రతిపాదకశక్తి, రక్తి, యిం
పూను కథాచమత్కృతియు నొప్పుకవీంద్రుల సన్నుతింతు, నా
పూనిక పూర్తి సేఁతకయి పొందిక నన్నయ తిక్కనాదులన్. 4

వ॥ అని యివ్విధంబున నిష్ట దేవతాభివాదన పురస్సరంబుగ నొక్క
మహాప్రబంధంబు రచియింపంబూని యందుకుఁదగు నుత్తమ
మహానాయకుండెవండో యని నెమకునవసరంబున. 5

ఉ॥ శ్రీమహితంబనంతగుణ సీమము, ధామము సత్ప్రవృత్తి, కా
రామము యోగి మానస విలాస విహారములుల్లసిల్లఁగన్
సేమము శ్రేయముందవిలిచేయఁగఁజాలు పవిత్రమాపరం
ధామము రామనామము సతంబని యాత్మకుఁదోఁచెనంతటన్. 6

ఉ॥ చర్విత చర్వణంబనెడు చాయలు బుద్ధికిఁ దోఁప, నంతలోఁ
బర్విన వేడ్కలింపెసఁగ బాలిశ! నీకిదియేమిచింత, యీ
యుర్విఁబయోనిధింబరగు నుజ్జ్వల రత్నచయంబు నిత్యముల్
సర్వముఁగొన్న నాపయినసంఖ్యమణుల్మతి యుద్ధరింపరే? 7

చ॥ అని యుపదేశ మిచ్చినటు లచ్చపు బుద్ధి తలంపురాగ, న
న్ననఘుఁడు రామచంద్రుఁడనయంబు కడుంగడుఁ బ్రోత్సహింప,
నే, ననితర ప్రాప్యనాయకతనంచితుఁడౌ రఘురాము ప్రాభవం
బును దెలుపంబ్రమోదమునఁ బూనితిఁ వ్రాయఁగ రామరాజ్యమున్

ఉ॥ విందుము రామరాజ్యమని వేడుక నంతటఁ జాటుచుండ నా

నందముఁ గొందుమంతియ వినన్ రఘురాము చరిత్రమందు నే
యందమెలర్చు నయ్యదియు నారయనొప్పదె పూజ్యమౌచుఁ,గా
నందగునంచు నెమ్మనమునం దలపోసి రచింపఁబోలదే? 9

ఉ॥ లేదు విశిష్టపాండితియు, లేవు కవీంద్రులు మెచ్చుపోకడల్
లేదవధానతాగరిమ, లేమనవీనత, లేకయుండినం
గాదనఁ జాలువాఁడెవఁడు కమ్మని రామచరిత్రమౌట, నా
మీఁద సహింపకున్న ధరమెచ్చినరాము సహింపకుందురే? 10

కథా ప్రారంభము.



చ॥ కలదు పురంబయోధ్య, బహుకాంచనగోపుర హర్మ్యహృద్య ని
ర్మల సుజనానవద్య బుధమాన్యసువిద్య, యమోఘరత్న స
ల్లలిత నిషద్య, యచ్ఛవిధి రంజిత పద్య, యరాతిశాసనో
జ్జ్వలసుభటాలిచోద్యశ్రుతిసంగతవాద్యయుఁ గోసలంబునన్. 11

తే॥ నిర్జితామర వైరియై నిఖిలజగము
తన్నుఁ బొగడంగ సౌఖ్యము లనరుచుండ
సంపదలెసంగ నద్దాని నింపుగనవ
లీల దశరథరాజు పాలించుచుండె. 12

ఉ॥ పాలిత సజ్జనుండు పరిభావిత దుర్జనుఁడా ధరావరుం
డేలఁగ ధాత్రి సౌఖ్యములు హెచ్చ సుపర్వులు మెచ్చ, సద్బుధుల్
లాలితులై చెలంగఁ, గవిరాజులు, గాయకులుల్లసిల్లగన్
మేలగు కీర్తిచంద్రికల మించివెలింగె దిగంత సీమలన్. 13

చ॥ సురలసురుల్తలం పడఁగఁ జూర్ణిత నిర్జరవైరియౌచుఁ దా

సురపతి దత్తపీఠమున సూనసువాసిత దివ్యమూర్తియై
వరలుచు సజ్జనుల్పొగడ వాసిగధారుణి నేలుచుండెఁ బం
క్తిరథుఁడఖండతేజముడికింపనరాతి కిరాతకోటులన్. 14

చ॥ అతఁడనపత్యుఁడై విధివిహారములెన్నుచుఁ జింతిలంగ నా
యత శుభతంత్రమంత్ర సమయజ్ఞుఁడు మంత్రి సుమంత్రుఁడెర్గి, భా
విత శుభపద్ధతిం దెలుప, విజ్ఞపురోహిత బుద్ధిఁబూని, స
ద్వ్రతుఁడయి యిష్టిసేయఁ బిలువం దగఁబంచెను ఋష్య
శృంగునిన్. 15

తే॥ నరగ శాంతాప్రియుండు తా నరుగుదెంచి
సమ్మతింపఁగ సరయూతటమ్మునందు
నశ్వమేధంబు జరిపించి యవలఁ బ్రీతిఁ
బుత్రకామేష్టి సలుపఁగాఁ బూనెనతఁడు. 16

వ॥ అయ్యవసరంబున. 17

ఉ॥ యాగపువేఁడుకం దవిలి హవ్యములాను తలంపు పెంపుమై
నాగమనంబు సల్పి నమరాధిప ముఖ్యులు నిర్జరుల్ భువిన్
స్వాగతము ల్పొసంగునని సంతసమందఁగ దుష్టరావణోద్యో
గపు గ్రీష్మతాపములు దుస్సహమై యెరియించుచుండగన్. 18

ఉ॥ తాళఁగలేక, సాధుజన తాపముఁ జూడఁగ లేక, యట్లు భూ
గోళము తాఱుమాఱగుటకున్నది నొచ్చి సహింపలేక, దం
భోళిసహాయుఁ డయ్యమరపుంజము తెల్పినఁ బద్మసంభవుం డా
లము సేయనొప్పదని యంబుజ నాభునిఁ జూడనెంచుచున్. 19

ఆ॥ వే॥ పాలకడలిఁజేరి ఫణిపతి పాన్పుపైఁ

బవ్వడించి యున్న పరమ పురుషు
యోగనిద్రజగము యోజించు వైకుంఠుఁ
గాంచి ప్రస్తుతింపఁ గడఁగిరిట్లు. 20

—: బ్రహ్మాది దేవతలు నారాయణునిఁ బొగడుట :—

చ॥ పరమదయానిధీ! పతితపావన! పూర్ణమనోరథా! ప్రభూ!
నిరతము నీవిభూతుల మునీంద్రులు సైతమెఱుంగలేక త
త్పరమతులై వివిక్తతఁ దపఃపరిశోషిత గాత్రులౌచు ని
స్సరయఁగఁ గోరుచుండ్రి పరమాత్మ గ్రహింపుము మా
నమస్కృతుల్. 21

శా॥ నీలీలల్ పరికింప సాధ్యమగునే నీరేజపత్రేక్షణా!
యీలీలందగునయ్య! పోవిడిచి నీవిందుండి నిద్రింపఁగన్
బోలన్ యోగసమాధిఁ బూనితి జగంబుంబ్రోవఁ జింతింప వీ
వేలా యిట్టియుపేక్షఁ గైకొనుట లక్ష్మీశా! నమస్తే నమః. 22

శా॥ నానీ భేదము నీ యెడంగలుగ దన్యాయంబులుంజెల్లవ
త్యానందాత్మక! నిర్వికల్పక! బుధారాధ్యా! జగద్బాంధవా!
ధ్యానారాధన తత్పరాత్ములకె నీతత్త్వంబు బోధ్యంబు గీ
ర్వాణుల్వచ్చిరి కొల్వుసేయనిటకున్ స్వామీ! నమస్తే నమః. 23

మ॥ అనుచున్వేల్పులు నల్వయున్నిలిచి కొండాడంగ వెన్నుండదే
మనుచున్మేల్కొనునట్లు కన్దెఱచి, యాహా! వేల్పులా! సేమమే
యని యెంతే మదిహర్షముం దెలిపి, యయ్యా! నల్వ! రమిందుమీ
పనులందెయ్యెడఁ గుందులేదుగద మీ పన్నుల్దగంజెల్లునా? 24

తే॥ అనుచు నను నయమే పారనడుగునంత

వేల్పు లందరుపల్కిరి "వినుమునాథ!
కరుణ తలకొన్న సేమంబు గలుగునేమొ
బ్రతికి యుంటిమి జీవచ్ఛవంబులట్లు. 25

ఉ॥ దాఁపఁగనేల పాపహర! దైత్యులు పెల్లుగరేఁగి సాదులం
బాఁపలఁ బువ్వుఁ బోఁడులఁ దపంబుల భంగము సేయఁబూనిపె
క్కాపదలుప్ప తిల్లఁగఁగకావికలై పఱవంగఁదోలి కన్
పాపలఁదీసి దుష్కృతుల పాలొనరింతురు చెప్పశక్యమే?. 26

మ॥ తగునే యొప్పరికింపఁ దండ్రి! సుతులందైత్యాధముల్నొంప, వే
పగులంగొట్టఁగఁ గొంపగోడులను బాపాత్ముల్మహా ఘాతుకుల్
పగ సాధింపఁగ రాదుగాని పరికింపంబూజ్యులే పాపులే
పగిదింబ్రోతువొనాథ! మమ్ము బ్రదికింపన్నిదె భారఁబుగా. 27

ఉ॥ లంకకురాజు రావణుఁడలంఘ్య విఘాతక శాసనుండు ని
శ్శంకత నిర్జరుల్గొలువ శంకరునేనియు హుంకరించు, నా
తంకములేద, బ్రహ్మ వరదాన మహత్త్వము యింతసేసె, మే
మింక సహింపలేమభవ! యీతని దౌష్ట్యము లెట్లడంగునో. 28

చ॥ జగముడికించు తీక్ష్ణకరు శంకయదేమనిచెప్ప, లంక జి
హ్మగుఁడగు పంక్తి కంధరుఁడహస్సుననంతి పురంపుటింటి లో
ప్పఁగఁ దనుఁగొల్వనింపఁడరు బోడిమిఁగృత్రిమ పర్వతంబునం
దగ విహరించుచుండఁగ సుధాంశుఁడు బోలె నుపాచరించెడున్.

ఉ॥ ఇంద్రుఁడుదొట్టి వేల్పులు వసింపఁగ ముంగిట సందువోక, దై
త్యేంద్రుఁడు వేఁట మైనలసి యింతులుగొల్వ జలంబులాడ, ని
స్తంద్రత వేచి సందుకొని స్నానగృహంబున సేఁదదీర్చుచీ

చంద్రుఁడు చంద్రకాంత విలసజ్జలధారలవానిఁ దన్పెడున్. 30

చ॥ అరయఁగ వేల్పుటింతులట నంతి పురంబున నూడిగంబులం
జరుపుచు నెల్ల వేళలఁ బసందుగఁ జిత్తము చిత్తమంచు బ
త్తెఱఁగుల వానికింపొసఁగు లీలల మెల్గఁగ నొప్పఁగాని, యే
వెరవున నైనఁ దప్పకొని, విచ్చి, మెలంగి, మనంగ సాధ్యమే?.

ఉ॥ మాటలు వేయునేల యిఁక మాధవ! మాగతియిట్టులుండఁగ
న్మాటలకున్నె చోటు ధర మానవులం దెడు గోడుఁ దెల్ప, స
య్యాటలనాడ రావణుఁడ హంకృతి, దిక్కఱి సాధుమానవుల్
చేటు దొఱంగఁగన్వెరవు చిక్కక యుక్కిరి బిక్కిరై రహో. 32

చ॥ నిలువఁగ నీడలేదు ధరణిం గుడువంగను గూడులేదు సా
ధులకరయంగ నోయధిప! దుర్జనదైత్యుల తాండవంబు మెం
డలముకొనంగ మాకగునె? యంబుజనాభ! భరింప, నీపదం
బులఁబడి ప్రొద్దుపుత్తుమిఁక ముజ్జగమీవ భరించి కావుమా! 33

చ॥ అనుటయు విశ్వమూర్తి యదియారసి పల్కె "నమర్త్యులార? మీ
కనుచిత భీతియేల? విధికందఱు బద్ధులుకాక తప్పునే?
యనయము సంభ్రమింపఁదగ దార్య పథమ్మును గాదయద్ది, నే
ననువుఁ దలంచి కార్యగతి నచ్చుపుఁ బద్ధతిఁ దీర్తు నమ్ముఁడీ. 34

చ॥ సమయము మంచిదయ్యె భువిసమ్మతిఁ బంక్తి రథుండు సల్పును
త్తమముగఁ బుత్రకామము, ముదంబున నాతనియిచ్చఁ దీర్పనీ
మమున సుతుండనై యుచితమార్గము నారసి దుష్టదైత్యదు,
ష్క్రమములడంతు సాధులు సురల్ముదమంది సుఖింత్రునమ్ముఁడీ"

తే॥ అనుచు నంతర్హితుండయ్యె నతఁడు, సురలు

నలువపలుకులు తలమోసి నలుపఁదలఁచి
ముదమెలర్పఁగ నరిగిరి సదనములకు
నుత్తములసేవ యెందేని రిత్తచనునె? 36

—: దశరథుఁడు పుత్రకామేష్టిసేసి పుత్రులంబడయుట. :—

తే॥ ఇష్టి సలుపంగ దశరథుండిష్టముమెయి
హృష్టుఁడయి యజ్ఞ పురుషుండు దృష్టినిలిచి
యమృత పాయస పాత్రంబునధిపుకరము
నందునిడి యేగె సంతుష్టి నందుమనుచు. 37

ఉ॥ పాయస పాత్రమందుకొని ప్రీతిన వేడుకఁ జేఁడు తృప్తలం
జేయఁగఁ బత్నులం బిలిచి చెన్నుగఁగోసలరాజు పుత్రిఁ, గై
కేయి, సుమిత్రఁ, బేర్కొని "మృగీదృశలార! గ్రహింపుఁడం"చునా
పేయము నర్ధమర్ధముగ వేఱుగ మువ్వుర కిచ్చెఁద్రావఁగన్. 38

తే॥ అవభృథాంతంబునందున నవనివిభుఁడు
వేఁడుకలుసేసి యందఱ వీఁడుకొలిపి
తాను నిజపురమునుజేరి తనరుచుండె
నమరపురమున నమరేంద్రుఁడలరునట్లు. 39

సీ॥ బంగారు పసమించు రంగారుమైదీవ
మిసమిసల్నానాఁటి కెసఁగుచుండ
నందంపు రవణంపుఁబొందు క్రిందుగఁదోఁచి
డెందంబునకు నీసడింపుఁగొలుప
నూగారుల పసందు లేఁగొనులలరింప
నమములు జిగిబిగి యడరుచుండ

రాయంచ నడకల రాణించు రమణులు
విహరింప నడుగిడ వ్రేఁగుదోఁప

తే॥ పులుపు రుచియింప మన్నులింపులు పొనర్పఁ
దలఁపులుదయింపఁ దాలుములత్తఱింప
గర్భలక్షణ లక్షిత గాత్రలగుచు
రాణులొప్పిరి దశరథరాజు మెచ్చ. 40

తే॥ కోసలాత్మజ నడుముదృగ్గోచరత్వ
ముడిగి, మున్ విష్ణు పదమయి యడరుచుండె
నిపుడు దృగ్గోచరంబౌచు నెసక మెసఁగి
విష్ణుపదమౌచు విలసిల్లె వింతతోఁప. 41

మ॥ పరగంబద్మ భవాండ భాండములు గర్భంబందునందాల్చి, భా
సురలీలన్వట పత్రశాయి యగుచున్ శోభిల్లు నీశుండు, తా
సురసాధుప్రకరంబుఁ బ్రోచుటకునై సొచ్చెంగదా గర్భము
ద్దిర! కౌసల్యది భాగ్యమిట్టిదనుచుం దెల్పన్ భువిన్ శక్యమే?.

చ॥ సవతులమోఘ తేజమున సంతస మొప్పఁగఁబొల్చుచుండ, నా
యువని విభుండు పంక్తి రథుఁడద్భుత మోద ప్రవర్త్యమాన స
త్ప్రవిమల ధర్మ కర్మ నిరతార్యజనస్తుత శోభనక్రియా
నవరత దీక్షితుండయి మనంబునఁ జింత దొఱంగి భాసిలెన్. 43

చ॥ సురగురుఁడొప్ప సేందుఁడయి సూర్యముఖ గ్రహపంచకంబుభా
సురముగ నుచ్చరాసులను శోభిలఁ గర్కటలగ్నమందు భా
స్కరుఁడలరంగ మేషగుఁడై, సంగఁబునర్వసు, తొమ్మిదౌతిథిం
బరమమొకండు తేజము శుభంకరమై యుదయించె రాముఁడై.

ఉ॥ వేలుపులుల్లసిల్లి కడువేడుకఁ బువ్వులవానరాల్పఁగం
దాలిమిహోమకుండములు తద్ద వెలుంగఁ బ్రదక్షిణంబుగన్
మేలుగదిక్తటంబులెలమిన్విలసిల్లఁగ నిర్మలంబుగన్
జాలఁగ రామచంద్రుజననంబు వెలింగె శుభోదయంబుగన్. 45

ఉ॥ ప్రేమమయంపుగానములు విందగు వాద్యవిశేష నాదముల్
రామలనాట్యముల్మనసురంజిల దీర్ఘికలందుఁగ్రీడలా
రామములందువేడుకలు రాజిల సాధుజనుల్నుతింప శ్రీ
రాముని జన్మకాలమది రంజిలెఁ బృథ్వి శుభోదయంబుగన్. 46

క॥ చల్లని మెల్లని గాడ్పుల
నుల్లములన్ సుజనకోటి యుల్లసిలంగాఁ
బెల్లుగ దుర్జనులడలఁగఁ
జల్లని శ్రీరామచంద్రు జననము వెలసెన్. 47

క॥ ఆతని కనుజులు మువ్వురు
ఖ్యాతిగఁ ద్రేతాగ్నులట్లు గలిగిరి గుణాగ
ణ్యాతత విశుద్ధ యశులయి
బ్రీతిగఁ దన్ననుకరించు ప్రజ్ఞలడరఁగన్. 48

తే॥ రాముఁగని కోసలాత్మజ[illegible]జిలంగ
భరతుఁగని కేకయాత్మజ[illegible]శ్రీ మెరయ
తనియ లక్ష్మణ శత్రుఘ్నులను సుమిత్ర
నలువురను గన్నయవ నీశుఁదెలుపవశమె?. 49

సీ॥ మొలచిఱుగజ్జెలమోఁత చిందులుత్రొక్కఁ
గాఁక పుష్కంబులు కదలియాడ

బిరుదుసూపెడు వేడ్క పేరెముల్వారంగ
మోముఁదమ్ముల సొంపు ముద్దుగులుక
బిరుదుమాటల తీరు గరువంబు తొలఁకింప
మురిసియాడెడు ఠీవి యరుదుఁగొలుప
విలునమ్ములనుబూని విడుపుపట్టులఁజూపు
తెఱఁగుప్రోడతనంబులెఱుకపఱుప.

తే॥ రాచపట్టుల కుఱవగు లక్కనంబు
లనుదినంబును వెగ్గలంబగుచుఁదనరఁ
జిఱుత తనముల బుడుతలు చెలువొసంగ
రాణివాసంబు దశరథరాజునలరె. 50

ఉ॥ విద్దెలయందునేర్పు, విలువిద్దెల యందునఁదీర్పు లొప్పఁదా
ముద్దిగఁగూడి సద్గుణములుల్లసిలంగ నెసంగుచుండఁగన్
ముద్దుగ నల్వురాత్మజులు ముచ్చటఁగూర్పఁగఁజేఁడు చిత్తమం
దద్దిర! నాదుభాగ్యమిదియంచు ముదంబుధిఁదేలియాడఁగన్. 51

విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులంగొనిపోయి యాగంబు గాచికొనుట.

వ॥ ఒక్కనాఁడు దశరథుండమాత్య పురోహిత పౌరవర్గపరివృతుండై
పేరోలగంబున నానావిధానంబుల బరికించునవసరంబున. 52

చ॥ పగతు వసిష్ఠుపైనలుకఁ బంతముఁబూని తపింప, దేవత
ల్పగఁగొని భంగముల్సలుపఁబాఁచి, త్రిశంకునిఁజేర్చి స్వర్గముం
దగులముపీడఁ దత్పరత ధైర్య సమార్జిత బ్రహ్మతేజుఁడై
తెగువరి గాధిసూనుఁడరుదెంచె నటంచొక సేవకుండనెన్. 53

శా॥ ఏమీ! కౌశికుఁడేగుదెంచెనె. యహో యేమో విశేషంబు, రా

రే మీఱందఱు తోడి తెత్తమితనిన్ రండంచుఁదానేగి, యో
స్వామీ! స్వాగతమే మహాత్ములకు? మీసాన్నిధ్యమేపార నీ
భూమీశాద్భుత పుణ్యగౌరవముఁదెల్పుంగాదె పూజ్యోత్తమా.

కll అని గౌరవంబు తనరఁగ
మునిపతిఁగడు వేడ్కఁదెచ్చి పూజ్యపదమునం
దునిచిన నాతఁడు వలికెను
"జనవర! పనివడియె రాఁగఁజనునె తెలుపఁగన్."

చll అనుటయు ఱేఁడు వల్కెనిటు "లార్య! వచింపఁగ సంశయంబె, నీ
మనమునఁగల్గు భావమును మానక తెల్పుము తీర్చువాఁడ న
న్నినకుల సార్వభౌముఁడని యెంచుము వీడుముసంశయంబికన్
బనిగొని చేయుమన్నపని బాయక చేయుట నేఁటిధర్మమే. 56

ఉll తప్పఁగరాదు మాట యనఁదప్పుట మానులవృత్తి గాదటం
చొప్పుగ రాజు వల్కముని యుత్సుకుఁడై వచియించెనిట్లు "మీ
యొప్పులకుప్ప రామతనయున్ సహలక్ష్మణు ధన్వివేగ, మే
మిప్పుడొనర్చు యాగమును నిమ్ముగఁగావఁగఁబంపు" నావుడున్

ఆll వెll కొండవిఱిగి మీఁదఁగూలిన యట్లైన
దశరథుండు వేఁగ దపసిఁగాంచి
యార్య! విడువఁగలనె, యర్భకురాముని
విడిచి బ్రదుకఁగలనె, వినుము పూజ్య! 58

ఉll రాముఁడు చిన్నవాఁడు పటురాక్షసకోటినెదిర్చలేఁడు, సు
త్రాముని దాఁకు వారలకు రాముఁడులెక్కయె యాజియందు, గా
రామునఁ బాలబుగ్గ పసలారని బాలురు నిల్వనేర్తురే

యోమునిచంద్ర! నేను బటుయోధగణంబులఁ జేర్చివచ్చెదన్.

వ॥ అని దశరథుండు తనయభిప్రాయంబు నెఱింగించుటయు. 60

శా॥ మాటన్నీఱునటంచుఁ బల్కితివహంభావంబుఁ జాటించి, యీ
యోటం దెల్పుట నీక చెల్లునేఁకనయ్యో! మోసమయ్యెంగదే
మాటల్నేర్వనివాఁడె రాముఁడు దగంభావించి పల్కందగుం
బాటింపందగవేనిఁబోయెద జగన్మాన్యుండ! దీర్ఘాయువై. 61

మ॥ అనుచుందుర్భర కోపపూరిత మహాహంకార ముప్పొంగఁగం
గనులం డ్రిప్పుచు గిఱ్ఱుమంచు సభలో గర్జిల్లుచుం బోవవే
గను, నంతంబృథివీశు చిత్తమున శెక్కుందత్ప్రికారంబు స
న్మని వర్యుండు వసిష్ఠుఁడుం దెలుప సమ్మోదంబుతోఁ గౌశికున్

క॥ కొని తెచ్చి యుచితపూజలు
పొనరిచి శాంతాత్ముఁ జేసి పుత్రులనొసఁగన్
ఘనుఁడవ్విశ్వామిత్రుఁడు
కనికర మెసఁగంగ వారిఁగని, కొనిచనియెన్. 63

ఆ॥ వె॥ తాతముందు రాజతనయులు వెనువెంట
నడచుచుండ నలపు పొడమకుండఁ
గతలుసెప్పెఁ దాతకమనీయ ఫణితుల
నద్భుతంబులగుచు హర్ష మొసఁగ. 64

తే॥ అధిక తపమునఁ బడసిన యట్టివిద్య
లడరు నాయెడ శ్రీరామ! యందుకొనుమ!
బలయు, నతిబలయనఁగను బరగువాని
నంది సుఖయింత్రు, పుడమినేయడలులేక. 65

తే॥ అనుచు నుపదేశమిచ్చి తానంచితముగ
రామ సౌమిత్రులను గూడి క్రమముగాను
సవన నిర్వాహ ప్రోత్సాహ చతురుఁడగుచుఁ
బలుకఁ దొడఁగెను గథలనెపంబుగులుక. 66

మ॥ అదిగోఁ చూడుఁడ యంగదేశమది, యత్యాహ్లాద సంధాయి, యం
దొదవెన్ శంకర ఫాలభాగనయనోద్భూతాగ్ని సందాహము
ద్యద హంకార వికార కారికతులోద్యన్మోహ సంధాయికి
న్మదనాసాధు విధాయికందువలనన్ భాషింతురంగంబుగాన్.

చ॥ అరయుదె రామభద్ర! యొక యక్షుఁడు మున్ను సుకేతనామకుం
డిరవుగ బ్రహ్మ మెప్పుమెయి నింపుగఁదాటకఁ బుత్త్రిఁగాంచె, న
య్యురుకుచఁ బెండ్లియాడె మనసొప్పఁగ సుందుఁడు, వారికిందగం
ధరకుభరంబుగాఁ గొడుకు దాంభికుఁడొక్కఁడు పుట్టెనీచుఁడై.

ఉ॥ ఏచిన దుర్గుణంబుల డరింపఁగఁదల్లికిఁ దోడుసూపి మా
రీచుఁడు రాక్షసుండగుచు రేఁగి, పురంబులుదోఁచి, కాల్చు, నా
నీచయుఁబూరుషాదిని వినిందిత తాటక వృద్ధసత్త్వయై
చూచు జగంబులంజెఱుపఁ, జూడుము దాని వధింపరాఘవా!

వ॥ అనుటయు శ్రీరామచంద్రుండు స్త్రీవధమహాపాతకంబని చింతింప విశ్వామిత్రుండు "పాపాచరణ పరాయణలగు స్త్రీలను వధియించుట పాపంబుగాదని పురందరనిహతయైన వసుంధరా పరాధ ధురంధరయగు వైరోచనీ మంథరా వృత్తాంతంబును, జనార్దన విదారితయగుభార్గవ జననీవృత్తాంతంబును దృష్టాంతంబుగా నిరూపించి మహాపాతకియగు తాటకను సంహారింప నియ్యు

కొలిపె నయ్యవసరంబున. 70

మ॥ కనియెన్ ఘాతుక వన్యసత్త్వదళన క్రవ్యాంత్ర భృద్బాహుకన్
ఘన పాదోద్ధతఘాతనిర్మథిత నానా భూత సంఘాతకన్
వినయాపేత విరుద్ధహాసరచనా విజ్ఞాతదుర్జాతకన్
జన హృద్భీకర సత్త్వధావన ప్రదృశ్యన్నాటకం దాటకన్. 71

ఉ॥ చూపులుగాధి సూనుపయిఁజొప్పడ సింహియుఁబోలెగర్జిలం
దాఁపునఁజేరి బెగ్గిలుచు దాశరథింగని ప్రోత్సహింప, నా
భూపకుమారుఁడుగ్రుఁడయి పూన్కిశరాసన మెక్కుడించి, యా
పాపపురక్కసింబెలుచఁ బ్రాణములూడఁగఁగూలనేసినన్. 72

చ॥ మునిపతి సంతసించి తనముచ్చటఁదెల్పఁగ హెచ్చువేఁడుకం
గనుఁగొని రామచంద్ర! ననుఁగాచిన ధన్యుఁడవయ్య! నీవు నీ
కనితరసాధ్య జృంభక ముఖాస్త్రములిత్తు భృశాశ్వదత్తముల్
కనుమని యింద్రునానతినిఁగానుపదేశమునిచ్చి యంతటన్. 73

వ॥ ముందునకుఁ బయనంబు సాగించుచు, శాంతసత్త్వ శరణ్యంబును, బ్రహ్మ తేజోవిలసితంబును, బ్రహ్మలోకమోాయన నొప్పుదాని నొక్కయాశ్రమారణ్య ప్రదేశంబుంజూపి విశ్వామిత్రుండు దాశరథుల కిట్లనియె. 74

చ॥ పరగఁ బ్రసన్నమూర్తులు తపః పరతంత్రులు బ్రహ్మవిద్యోఁడం
బరగుదు, రిందు వామనుఁడు పాధియుతుండు తపంబుసేసె, నీ
తరుని కరంబు నీలమయి తద్దయు నాశ్రమసీమఁబోల్చి, యం
బర తలచుంబి శాఖమయి భాసిలులోకముఁగొల్చుకై వడిన్.

చ॥ అని రసపూరముద్గారలు నద్భుతగాథలఁదన్పుమాని, కా

ననగమన శ్రమంబులు మనంబునఁ దోఁచకపోఁగ, రామల
క్ష్మణులు ముదంబునన్నడువఁ గౌశికుఁడుందన యాశ్రమంబుఁ జే
రెను సవనంబుఁ దీర్చుటఁగుఱించి ప్రయత్నము సేయువేఁడుకన్

చ॥ కృతసవన ప్రయత్నుఁడవిగీతుఁడు గాధిసుతుండువేల్వ, దు
ష్టత, రుధిర ప్రపూరిత ఘటంబుల నెత్తినఁగుమ్మరించి, ప
ర్వత శిఖరంబులంబఱిచి, ఫక్కున నవ్వుచు గేలిసేయుచున్
గృతకర తాడనుల్కరము కీడొనరింపఁ దలంప రాక్షసుల్. 77

చ॥ బిరబిర సంభ్రమించుచటవిస్థలి మోగఁగఁగ శిష్యసంఘముల్
పరుగులు వాఱి రామునకుఁ బాపినిశాచర క్రూరకార్యముల్
మఱిమఱిఁదెల్పి పార్థివకుమారక! బ్రోవవె యంచువేఁడినం
దిరముగ రామలక్ష్మణులధిజ్యశరాసనులైరి కావఁగన్. 78

ఉ॥ ద్వారములందునిల్చి, తఱివేచి, పథంబులుగాచి రక్కసుల్
బీరములెల్లఁగోల్పడుచువేగమ దిక్కులుపట్టి పాఱఁగం
గ్రూర శరంబులందొడిగి కూల్చి సుబాహుని నాహవోద్ధతున్
వారిధిముంచె బాణమున వంచకునొక్కటఁ దాటకాసుతున్.

స్వయంవర వృత్తాంతమును విని విశ్వామిత్రుఁడు రామ లక్ష్మణులతో
మిథిలకుఁ బయనంబగుట,

తే॥ సవనమునుదీర్చి యవభృథస్నాన మహితుఁ
డగుచుఁ గౌశికుఁడెదఁగడు నలరుచుండ
జనక భూపతి చాటించెఁ జంద్రవదన
కలరు సీతకు వెలయు స్వయంవరంబు. 80

చ॥ స్థిర తర పౌరుషంబు, పటుతేజము, దోర్బల మొప్పురాఘవుం

ధర వెలుఁగింప నొప్పెసఁగు ధర్మపథంబది యంచునెంచి, తా
నిరువురనన్నదమ్ములను నెంతయుఁబ్రీతినిఁబ్రోత్సహించి, రం
డరుగుదమంచుఁ దోడుకొని యర్గుచుఁబల్కెఁదొడంగె నివ్విధిన్

ఉ॥ కూరిమి మీఱఁగా మిథిలకుంజని, యందునృపాలసూనులే
పారఁగఁజూపు పౌరుషము, నచ్చపువేడ్క స్వయంవరంబుఁగ
న్నారఁగఁ గాంచివత్తము, రణంబులమిన్నలు రాజపుత్రుల
వ్వారిగ వత్తురచ్చటికి, వారల మేలుదలంపమీకగున్. 82

ఉ॥ భాసకులావతంసమ! సభాంతరముల్ సొర, నందుబాణసం
ధానము లేని, శూరజనతంత్రములేని, కవీంద్రకావ్యస
మర్పనములేని, పండితుల మాన్యవివాదములేనిఁ జూడనౌ
దానమనోనిరూఢి, పటుధైర్యము చేకుఱునెట్టివారికిన్. 83

తే॥ కూర్మి మిథిలాపురంబుఁగన్గొనఁగవచ్చు
రాచమూఁకలఁజూచి సంబ్రబపడవచ్చు
సీత చిత్తంబు రంజిల్లఁ జెలఁగవచ్చు
మీకు శుభమగుఁ బోదము మిథిలకిపుడు. 84

మ॥ అనుచున్మౌని కులావతంసుఁడటవీయానోద్గతాయాస సం
జనితోద్యద్గురు తాపనోదన కథాసల్లాపసంసేవ్యుఁడై
ఘనమౌ స్వీయచరిత్రముందెలుపుచుం, గాంతార మార్గంబునం
జనియెన్ శోణనదంబుదాఁటి యవలన్ స్వస్థాపగంజేరఁగన్.

శా॥ రంగత్తుంగ మహీధ్రశృంగ విదళత్ప్రాంచత్తరంగంభుపన్
బొంగంబారుచుఁ బొంగునీఱు జగముప్పొంగందగంజెంగలిం
చంగం భైరులు ప్రోదిసేయుచుజనుల్ శ్లాఘింప, రంగారునా

గంగంగాంచి రఘూద్వహుండు మురిసెంగంభీర భావంబునన్.

వ॥ అంత రామచంద్రుండు కుశికసుత నివేదిత భాగీరథీ పవిత్ర చరిత్రుండును, అనేక ప్రకార సంస్తూయమాన త్రిపథగాస్వరూపుండును, దజ్జాహ్నవీతోయావగాహ పవిత్రితగాత్రుండును, నగుచు దాని నుత్తరించి యరుగుచు, గాధినందనునిచే విశాలాపుర వృత్తాంతంబు నెఱింగి, యందారాత్రి కడప మఱునాఁడు మిథిలాపుర గమనోన్ముఖులై చనుచుండు నవసరంబున. 87

చ॥ మెఱపు తెఱంగు దోఁప, మిఱుమిట్లుగొనం,గనుదోయి, తళ్కుమం
చిరవుకొనంగ నింతియయియింపు దలిర్పఁగ నొప్పుచున్నయా
గరిత మొగంబుఁజూడగనె గౌతమపత్ని యహల్యయంచు, మున్
సురపతి మూలమివ్విధికి సుమ్మనిగాధిసుతుండు తెల్పఁగన్. 88

ఉ॥ రామ! జయాభిరామ! కృతరాక్షస దౌష్ట్యవిరామ! శ్రీపదాం
భోరుహ చింతనాకలిత పూర్ణసుకామ! నమోస్తుతే, భవ
ద్ధీర పరాక్రమ ప్రథిత తేజముఁగన్గొన మానవాళికిం
ధారుణి సాధ్యమౌనె? విబుధావళి పూజ్యము నీచరిత్రమౌ. 89

వ॥ అని శ్రీరామచంద్ర మహిమంబు నానావిధంబులఁ గొనియాడుచున్న యహల్యావృత్తాంతంబు సమగ్రంబుగ, నివేదించి, తదాశ్రమంబున సపర్యలంది విశ్వామిత్రుండు రామ లక్ష్మణులంగూడి మిథిలోపకంఠంబున జనక యజన భవనంబునకరుగ, నందు జనకుండు వారల యథావిధినభ్యర్చింప, నిమికుల పురోహితుండైన శతానందుండు విశ్వామిత్రుంజూపి రామునకిట్లనియె. 90

ఉ॥ పుట్టువుచేత క్షత్రియుఁడు పూజ్యమహర్షి వసిష్ఠునాశ్రమం

బట్టె ప్రవేశముఁ సలిపి, యమ్ముని పుంగవుపూజలంది, తా
నెట్టులో కామధేనువును నేపునఁగొంచుఁ జనందలంచి, య
ప్పట్టున బ్రహ్మతేజమును బట్టుదలన్గడియించెఁ బూజ్యుఁడై. 91

తే॥ అనుచుఁ బొగడ శతానందమునివరుండు
హర్షమందుచు నార్యాత్రి యచటఁగడపి
వేఁకువను లేచి నియతి, వేనెలుఁగుఁగొలిచి
యర్ఘ్యమొసఁగుచుఁ బూజించె ననఘుఁడగుచు. 92

చ॥ మునిపతి రామ లక్ష్మణులపూర్వమనోహర మూర్తులై తనుఁ
వెనుకొనివచ్చుచుండఁ బురవీధిని నేగుతఱింబురాంగనల్
గొనకొని మూఁగి యచ్చెరువు గూరఁగ విచ్చినకల్వకన్గవం
దొనకు జిగిన్వినీలమగు దుప్పటిఁబర్చిరి దారియంతటన్. 93

వ॥ అప్పుడు విశ్వామిత్రుండు రామ లక్ష్మణులంగాంచి "యిప్పట్టణంబు జన్నంబుసేయ సమకట్టు జనకమహారాజునకు రత్నగర్భ యగు భూదేవిచేఁ బుత్రికగా నొసంగఁబడిన సీతయను కన్యారత్నంబునకు సూతికా గృహంబు, ఆమె మహిమంబనన్యసామాన్యంబు. 94

చ॥ వసన మెఱుంగ నంబునిధి, వాసిగఁ బీఠముమేరు భూధరం,
బసదృశ హారమా సగర సంతతి సద్గతి మార్గబంధువై
యెసఁగు విభాసి సింధునది, యిమ్మగనాదివరాహదంష్ట్రి యిం
పొసఁగు విలాస పర్వతము, నొప్పుగ సీతకు లోకమాతకున్. 95

తే॥ సీత యిప్పుడు సొగసుల మాతయనఁగఁ
బొలుచుచుండును బంగారు పూఁదెవోలె

వెలయ నెలజవ్వనంపుఁ బొల్పాలఁతి రాజ
సుతుల మనముల రంజించు సుదతియయ్యె. 96

తే॥ జనకునింటను శంకరు చాపమొండు
పరగు, దుష్కరమయ్యది సురవరులకు
దానినెక్కిడు ఘనునకుఁ దనయనిత్తు
ననుచునారాజు పణముగా నునిచెదాని. 97

క॥ అనుచున్ముని వరుఁడల్లన
చనియె సుధర్మావిభూతిఁ జనునృపు సభకున్
గనిరన్న దమ్ములచ్చట
ఘనమగు శివధనువు కొండకరణిని మెరయన్. 98

చ॥ పరగ సభాంగణమ్మునను బ్రజ్ఞయుఁ దేజము వైభవంబును
న్మెరయఁగఁ గూరుచుండి ధరణీందము కీడుదొరల్లలారెయం
చెలుఁగఁగ మీసలున్నులుపు చింతికి సీతకునేనె కాంతుఁడం
బరువున బల్మిమైననెడు భంగిని రాజకుమారులొప్పఁగన్. 99

ఉ॥ రాజపురోహితుండట విరాజ దుమేశుశరాసనంబు, ను
త్తేజితమైనదాని, వినుతింపఁగఁ బూజయొనర్చ, ఱేఁడు వి
భ్రాజిత వైభవోన్నతుల రాజకుమారులఁగాంచి పల్కె "స
దాప్తిజినుతింప సీతను శరాసన మెక్కిడు వానికిచ్చెదన్. 100

చ॥ అని పలుకంగ నొక్కరొకరాధను వెత్తఁగ నెంతయుంచు వే
గనుదరియంగఁ బోయి, తమకౌఁగిటి కబ్బకయుంటఁ జూచియే
మనియన నోరురాక, బిగువంది కదల్పఁగఁ జేతఁగాక, స
మ్మానములఁ జింతలుప్పతిల, హాయు రె! మోసమటంచు నెంచుచున్

సీ॥ బిగువు చిక్కక కొందఱుగలించి యగలించి
కదలికఁ గనలేక కడకుఁబోవఁ
జుట్టు గిట్టునఁజుట్టి నెట్టుటకనువుగా
కట్టెకొందఱు వెన్కకరుగుచుండ
నూపిరిబిగఁబట్టి యుబికించి కొందఱు
ముక్కిముందుకుసాగి మ్రొగ్గతిలఁగ
సవరించుకొని చక్కసాము చూపెడుభంగి
నిగుడి పట్టొదవక నీల్గిపడఁగ.

తే॥ తూఁచి పట్టంగఁ జాలక దూలిపడఁగ
రాచకొమరుల జతనంబులూఁచపోవఁ
దలలువంచిరి సిగ్గుచే ధరణిపతులు
ధరణిసుత, మేడపై నుండి తలచుచూడ. 102

క॥ తమచేతఁగాని తనముల
గమనించక మోసమనుచుఁ గార్ముకమునకున్
నెమకుచు వంకలు జనకుని
క్రియమిది సరికాదటంచుఁ గడఁగిరి చనఁగన్. 103

ఉ॥ అంతట రాముమోము కుశికాత్మజుఁ డాదరమొప్పఁజూచి "నీ
వెంతయునేర్తు లెమ్మిచట నేఁడెఱఁజూపి పరాక్రమమ్ముఁ దా
నింతి వసుంధరాసుత వరింపఁగ భాసిలు వాఁడవై తగం
బంతము తీర్చుకొమ్మనెడు" భంగినిఁ దెల్పఁగ సైగసేసినన్.

ఉ॥ సాధువుపోలె రాజసుత సంఘమునందొక మూలనుండి తే
జోధికుఁడైన రాఘవుఁడు చుల్కనలేచి ధనుస్సమీపమున్

మోదముతోడఁజేరి జనముల్మదినచ్చెరువొంది చూడఁగా
గాధిసుతుండు చిత్రఫలకమ్మున దీర్చిన యట్లుధీరుఁడై. 105

ఉ॥ శంకర! భక్తమానసవశంకర! లోకవినింద్యదుర్యశః
పంకమునందుఁద్రోయుదె శుభంకర! నీదు కృపాకటాక్షవీ
క్షాంకితునన్నుఁ బ్రోవుమభయంకర! నీధనువెక్కుడించు, యీ
యుంకువఁదీర్చి, పేర్చి, యశమొందఁగఁజేయుమనీకుమ్రొక్కెదన్

మ॥ అనుచున్ శంకరు నామకీర్తనముచే నగ్గించి, చాపంబు నె
క్కొను తేజోబలధుర్యుఁడై నిలిచి, యంగుష్ఠంబుఁగీలించి, చ
క్కన చేసాచి గుణంబునందుకొని సాగందీసి సంధింప, ఫె
ళ్లునఁజాపంబు తుంగెనప్డు జలధుల్క్రోగంగనానోయనన్. 107

క॥ పొంగుచు జానకి బిరబిర
నంగజు శరమట్లువచ్చి హారముమెడవే
యంగను రాముఁడు మెరసెను
దొంగకుఁ దేల్గుట్టినట్లు దొరలు తొలంగన్. 108

తే॥ జనకభూజాని యంతట జయజయధ్వ
నులు చెలంగఁగ హర్షంబువెలయ మదిని
రామచంద్రుని పెండ్లివార్తలనుదెలిపి
పిలువఁబంచెను దశరథుం, గలిమిమెరయ. 109

తే॥ రాజు వెలయింపఁ బట్టణరాజమందు
వేడ్కలలరంగఁ గొంగ్రొత్త వింతలలర
పౌరులను దీర్పమురిసిరి పౌరులెల్ల
రాచనగురునఁ బెండ్లిసంభ్రమముమించె. 110

ఉ॥ వించునె వేడ్కరామునకుఁ బెండ్లి యటంచును, సంతసించి, యూ
హించి శుభమ్ము పంక్తిరథుఁ డెక్కుడు వైభవమొప్పవేగ నే
తెంచి విదేహరాజనుమతించిన రాజగృహంబుఁ జేరి, భా
సించెడు రామ లక్ష్మణుల చెంగటఁ గౌశికుఁ గాంచి రంజిలెన్.

ఉ॥ ఎవ్వనికీర్తి గేయమమరేంద్రు పురంధ్రులగోష్ఠిఁ బూజ్యమై
యెవ్వఁడు తండ్రి శ్రీశునకు, నెవ్వనిచేత ధరిత్రిసాధ్వియా,
నెవ్వనిచేత నింద్రుఁడుత్యజించె సురాసుర యుద్ధసంకటం
బవ్వసుధేశుఁడిద్దశరథార్యుఁడు పూజ్యుఁడు రాజకోటికిన్. 112

వ॥ అని బహుముఖంబులఁ గొనియాడంబడి దశరథుండు సపురోహి
తుండు జనకరాజాభ్యర్చితుండై సుఖంబుండెనంత. 113

తే॥ మఱుదినంబున గోదాన మంగళంపు
విధులు నెఱవేర్చి ఋషివరుల్బుధులుపొగడ
దశరథాత్మజులకుఁ బెండ్లి ధర్మవిధిని
వెలసెఁ బౌరోహితుల్వేదవిధినిజరుప. 114

ఉ॥ ఆయతబ్రహ్మ ఘోషములు హాయిపొనర్పఁగ, వాద్యఘోషమా
ప్యాయతఁ గూర్ప, మైథిలనృపాలుఁడు సీతను దారవోసె ని
"ట్లీయమసీత, నాదుసుత, యిచ్చితిరామ! గ్రహింపు, సౌఖ్యసం
ధాయక ధర్మ నిర్వహణ తత్పరవై యెడఁబాయకుండెడున్".

తే॥ ఒక్కగుణమును ధనువున నెక్కిడించి
పరగ సీతను రాముఁడు పరిగ్రహించెఁ
బెక్కుగుణములు జనకున కెక్కమెలఁగి
లక్ష్మణుఁడు పొందెనూర్మిళ రాజవదన. 116

తే॥ భరత శత్రుఘ్నులలకుశధ్వజునివలన
మాండవీశ్రుతకీర్తులన్మంగళాంగ
నలను బరిణయమాడిరి వెలయనపుడు
దశరథుండందె మోదమత్యంతముగను. 117

—: పరశురాముఁడు శ్రీరామునడ్డగించి పరాభూతుఁడగుట. :—

వ॥ అనంతరంబు దశరథుండు వధూవర సహితుండై జనకమహారాజు
న్వీడ్కొని యయోధ్యకుఁ బయనించువాఁడు మధ్యమార్గంబున
రోషవివశుండును, భీషణమర్యాద పరాక్రముండును, తపస్సము
చిత వల్కలవసనుండయ్యు, వాసనావశంబున నాదర్శిత యుద్ధ
శ్రద్ధుండును, నగుభార్గవరాముంగాంచి సందర్శన మాత్రాపగత
హార్దుండయ్యు, ఋషివరులతోడ న్విహిత సపర్యుండై కుశలం
బడిగిన నాతండు దశరథుపల్కు వినిపించుకొనక శ్రీరాముని
వలోకించి యిట్లనియె. 118

శా॥ ఓరీ! క్షత్రియవంశపాంసనుఁడ! గర్వోద్రేకముంజెల్లె నౌ
రౌరా! నీకిది యెట్టులొప్పె, సమదవ్యాపారదుఃక్షత్రియ
స్ఫారానోకహఖండనోగ్రపరశుస్వాయత్త సర్వాంసహాం
ధీరుం భార్గవరాములెక్కగొనకే తీండ్రింపనౌరా! భువిన్. 119

ఉ॥ ఎన్నఁడొమూలవేసి పరికింపని తుక్కటి విల్లువిర్వనీ
కున్నదె కీర్తి రామ! యిదిగోయిది వైష్ణవచాపమెత్తి స
త్సన్నుత వీర్యబాహుబల సంపదఁజూపి జయించునన్నులే
కున్నఁబదంబు నేన్గదుపనున్నది నీకును నాకు వైరమున్. 129

మ॥ అని యత్యంత పరివృద్ధరోషుఁడయి పెల్లాక్రోశముఁజూపఁగం

గని రాముండు ప్రసన్నభావమెసఁగంగాఁబల్కె "నోభార్గవా!
చనునే నన్నుఁబరీక్షసేయ, నటులే సంధింతుఁదే తెమ్మనీ
ధనువం"చుంగొని "యెక్కువెట్టెదనిఁకంధన్యాత్మ వీక్షింపుమా!"

క॥ అని యెక్కువెట్టి భార్గవుఁ
గనుఁగొని మునివర్య! యిదిగొ గాదిఁకనిలుపక
విను శ్రీరాముని బాణం
బనియాతనిస్వర్గగతికి నడ్డుగనాఁటెన్. 122

తే॥ పరగ రాముండు గుణమును బట్టిలాఁగ
ధనువునందున వక్రత తనరె మివుల
భార్గవునియందుఁ జక్కనై పరిఢవిల్లెఁ
గడు విచిత్రము పెద్దలఘనత యరయ. 123

తే॥ కడఁగి శ్రీరాము గమనంబుక్షణమె యడ్డి
పరశురాముఁడు పరగతిఁబాసె నహహా!
యించుక యొకండు పెద్దలఁగొంచెపఱుప
నడరి యనురూపదుష్ఫలంబందకున్నె. 124

తే॥ పరశురాముని యానన ప్రతిభతొలఁగఁ
దేజమొక్కండు శ్రీరాము దివ్యతనువు
నందు నొక్కటఁజేర నయ్యనఘమూర్తి
రమణ నొప్పారె, భార్గవరాముఁడరిగె. 125

ఉ॥ చింత తొలంగఁగా బ్రదుకు జీవుఁడ! డెందమ శాంతినొందుమం
చెంతొగఁ దండ్రిసంబ్రపడి, యెక్కుడు ప్రేముడి రామచంద్ర! య
త్యంత శుభమ్ము నీకనుచు, నబ్బురమందుచునుచ్చి మూర్కొనం

జింతలవీడి యెల్లరును జేరిరయోధ్య ముదంబుతోడుతన్. 126

తే॥ చెలుములలరంగ ముద్దియల్ సిగ్గుతోడఁ
జేరి యవ్యక్తభావ విస్మితలుగాఁగ
లలిత భావాభిరామ సల్లాపములను
రాజ తనయుల నాద్యమకారసముగొలిచె. 127

—: ఆశ్వాసాంతము. :—

ఉత్సాహము:-రామచంద్ర! కరుణఁబ్రోవరాదె జగము రక్షకా!
తామసింపధర్మమగునె తల్లడిల్లలోకముల్
నీమహా విభూతి జగతి నిర్ణయింప శక్యమే
కామ భోగ పరత నిన్నుఁగాంచఁగలరె మానవుల్.

గద్యము:-ఇది శ్రీభారద్వాజ గోత్ర పవిత్ర, ఆపస్తంబసూత్ర, రాఘవాచార్య ద్వితీయ తనూజ, శ్రీరామచంద్ర కరుణాకటాక్షలబ్ధ కవితా విస్ఫురణ, కాండూరు నరసింహాచార్య విరచితంబైన రామరాజ్యంబను మహా ప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము సంపూర్ణము.





—: శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః :—

# ★ రామ రాజ్యము. ★

## (ద్వితీయాశ్వాసము.)



శ్రీరామునకు యౌవరాజ్య పట్టాభిషేక ప్రయత్నము, దానిభంగము.

ఉ॥ శ్రీకర సద్గుణ ప్రకర శిష్ట జనోత్కరనుత్యమాన ర
త్నాకరధీరరామ విభుధార్మిక తత్త్వప్రహృష్టపౌరవ
ర్గైక మనోనిరూఢ ప్రకటీకృత భావసమాహితాత్ముఁడై
ప్రాకట యౌవరాజ్య పదభద్రునొనర్పఁదలంచి యాత్మలోన్

చ॥ దశరథుఁ డొక్కనాఁడఖిల తంత్రసమర్థులు మంత్రివర్యులో,
ప్పెసఁగు పురోహితుండు, ధరణీశులు, పౌరులు, కొల్వుదీఱియుం
పెసక మెసంగి యొప్పుతఱి, నెంతయునుత్సుకతన్వచించె "నో
యసదృశ శేముషీమహితులార! వినుండు మదీయవాక్యముల్. 2

చ॥ ఎఱుఁగుదురెల్లవారు ప్రజకింపగు ధర్మపథంబునందు సు
స్థిరతర కీర్తికాములయి తేజము పర్వఁగరాజ్యపాలనం

బురుకరుణాయుతుల్సలిపి యొప్పిరి మానధనుల్మదీయుల
క్కరణిన నాదుపాలనముఁగంటిరయంచు మదిందలంచెదన్. 3

చ॥ ప్రజమదికింపుగాని పరిపాలన యొప్పదు లోకమందు, నా
భుజబలపౌరుషంబులిఁక మున్పటిచొప్పులె, దేహముంజరా
భజనముచేతఁ గీడ్పడియెఁబంకజషండము చంద్రికంబలెన్
సుజన వతంసులార! దయఁజూపుఁడి నాయెడ విశ్రమింపఁగన్. 4

మ॥ సకల క్షత్రియ గర్వభంజన యశశ్చండుం, దృటిన్ భార్గవున్
వికలప్రజ్ఞునొనర్చి భంగపఱుపన్విఖ్యాతశౌర్యుండు భా
వుక సౌజన్యదయాప్రపూర్ణుఁడు సుధీపూజ్యుండు రాముండు,మా
మక సింహాసనమింక వానికొనఁగన్మన్నింపఁగా వేఁడెదన్", 5

తే॥ జేనిపలుకులు వినఁగనె మేనులలర
మొయిలుగనుఁగొన్న నెమ్మిలుపోలె జనులు
కేకలుప్పొంగఁ జెలఁగిరి వీఁకలెసఁగ
రాచకొలువెల్ల జేజేలు రహివహింప. 6

ఉ॥ రాముఁడెమాకు రాజు రఘురాముఁడె తండ్రిసుపాలకుండు, మా
రామునిఁబోలు వాఁడునృపరాజిఁ గనుంగొనఁ జిక్కఁబోఁడు శ్రీ
రామముఖాంబుజంపుమకరందముఁ గ్రోలిమదించుమామనః
సీమలుపొంగి రాఘవునిఁజేరక యన్యులనిచ్ఛగించునే.? 7

క॥ అని కొలువుదెలుప దశరథుఁ
డను మోదముతోడఁ బ్రజలననిచి రయమునన్
మునివరు వసిష్ఠుఁగనుఁగొని
వినిపించె ముహూర్తమొకటి వేగఁదెలుపఁగన్. 8

వ॥ అనంతరంబు దశరథుండయోధ్యాపురంబున వాడ వాడలను పౌర
వరులు గుమిగూడి శ్రీరామ పట్టాభిషేక మహోత్సవ సందర్శన
జాతకుతూహలురై ముచ్చటించుకొనుచు నానందాతిరేకంబున
నుప్పొంగుచుండఁ దాను ద్విగుణీకృత హర్ష ప్రకర్షుండయ్యె సు
మంత్రి ప్రముఖ మంత్రివర్యులంగాంచి యిట్లనియె. 9

తే॥ "పుడమినేలెడు క్రమమును విడఁగ లేదు
తాపసాశ్రమములకేగఁ దలఁపలేదు
బాలుఁడగు రామునింతగఁ బ్రజలుతవిలి
యాశ్రయింపఁగఁగతమేమొ యరుదుమదికి." 10

వ॥ అనుటయు మంత్రి పుంగవులిట్లనిరి 11

తే॥ "దేవ! యేమిందుఁ జిత్రము! నీవ భూమి
నేలుచుండఁ గుమారు భజింతురిగాక
చంద్రువిడనాడి యాశ్రయజలధిఁగొలువ
డప్పివడియుఁజకోరకంబొప్పుకొనునె". 12

తే॥ అంత దశరథుఁడానందమందియిపుడ
రాముఁ బిలిపించి పట్టాభిరాముఁడవగు
మనుచు వచియింపఁ గౌసల్యకరయఁబలికి
సిద్ధపడుచుండె మఱునాఁటి శ్రేయమునకు. 13

మంథర కైకకు దుర్బోధలుసేసి రామునరణ్యమునకుఁ
బంపునట్లుచేయుట.

ఉ॥ పొందుగ వాడవాడ జనపుంజములెక్కుడు పొంగుచుండ, సం
క్రిందన మందిరంబాయన రాజగృహంబు వెలుంగుచుండఁగ

న్వొందుగఁగాంచి మంథర వినెన్ రఘురాముని పట్టమంచు, వే
గందుమి కేన్ హతాత్మగను గైక గృహంబున నోర్వలేమిచేన్.

ఉ॥ పొంపిరి వోవనబ్బురము పొందికలల్లఁగ నేర్చుకుబ్జ, భా
వింపఁగరాని శోకదశ వహించి వచించె "నిదేమి కైక! యూ
హింపవు నీదు శ్రేయమును నెల్లరు నీవలెనుందురంచు, భా
వింపుము రామరాజ్యమున నెన్నఁగ బానిసవై తివక్కటా! 15

చ॥ అనుటయుఁ గైక సంభ్రమమునంది యదేమియొ తెల్పుమన్న, నా
వనిత యిదేమిచిత్రమిఁకఁ బట్టము రామున కెల్లియంచు శో
భనములు తీర్పఁబట్టణము భాసిలు చుండుటఁగాంచలేదె, కా
మిని! ప్రియుఁడెంతసేసెఁ దమిమించఁగ మోసమెఱుఁగ లేవనన్.

ఉ॥ "సంతసమయ్యె నామదికి సంభ్రమమెందుకు మంథరా! ధరా
కాంతుఁడు రామభద్రునకుఁ గైకొని పట్టముఁగట్టుచుండెనం
చెంతయు వేఁడుకం దెలుపు నింతికి నీకిపుడేమియీయనోఁ
గాంతనుఁ జంద్రహార మిదిగైకొని సంతసమందుమం"చనన్.

చ॥ పకపకనవ్వి యక్కపటవర్తనయిట్లనుఁ "గైక! మేలు నీ
వికఁగడు ధన్యురాల విలనేలఁగ రాముఁడు, నీసుతుండు బా
యక రఘురాము పాదములయందును, నీవును గోసలాత్మజా
నికటమునందు దాస్యమున నిందితులౌట యెఱుంగవేలకో. 18

చ॥ ప్రియుఁడని నమ్మియుంటి పతిప్రేమకు లక్షణమిద్దియేమొ, కే
కయనృపు చెంతకున్ భరతుగాదిలి పుత్రుని సాగనంపుటీ
నయముగ రాము పట్టముమనంబున నిల్పియకాదెముగ్ధ! యీ
వయిక నెటుచూచినం జెడితి వారకనీకు శుభంబుగల్గునే"? 19

చ॥ అనుటయుఁ గేకయాత్మజ ప్రియంబున మంథరకిట్లు వల్కెఁ, "రా
ముని సుగుణాభిరాముని విమూఢ! యెఱుంగక పల్కెదిట్లు, నా
తనయుఁడు పెద్దవాఁడు కడుధార్మికబుద్ధిఁ దలిర్చువాఁడు న
న్ననయము తల్లికంటెఁ గడునర్మిలిఁ జూచుఁదలంక నేటికిన్".

వ॥ అనుటయు మంథర తోఁకఁదొక్కిన త్రాఁచువలె మండిపడుచు,
నిట్టూర్పువిడుచుచుఁ, గ్రూరనారాచంబులంబోని చూపులని
గుడించుచు, సృష్టిమునుంగునట్లు దీర్ఘాలోచనసేయుచు నిట్లనియె.

చ॥ "అవునిది పోలు నీమదికి సర్థముకాదిపుడేమి సెప్పినన్
సవతికి నూడిగంబొదిగి సల్పెదు నాఁడు తలంతుగాని, యో
యువిద! సుఖంబులందు మిఁకనుండఁగ రాదిటఁబోయివత్తు, నీ
కవగతమౌనె ధర్మము సమంచిత పద్ధతి బోధసేసినన్." 22

తే॥ అనుచు మంథర తన కోపమడరఁబలికి
యరుగుచుండంగ "నెచ్చెలి! యరుగవలదు
నాకు నియ్యది యెట్టుల న్యాయ్యమగును
దెలియఁబలుకుము" యని కైక పలుకరించె.

తే॥ అంత మంథర దుర్బోధమెంతొ సలుపఁ
గైక చెవియొగ్గి యెవ్విధిఁ గార్యమనియె
నెంతవారలనేనియుఁ జెంతఁజేరి
చెప్పుమాటలుచేటయి చెఱుపకున్నె.? 24

ఉ॥ కజ్జముతీరుఁ దెల్పియరుగంగనె మంథర, కైక గేహము
ద్వ్యజనపాలుఁడప్పుడు ముదంబునఁ జేరఁగ మందిరంబునం
దజ్జలజేక్షణాయత శుభాంకముఁగాంచక చింతగూరఁగన్

ముజ్జగమొక్క పెట్టునను ముంచుకొనంగను దోఁచెనెమ్మదిన్.

ఉ॥ తోఁచిన నిందునందుఁగని తొయ్యలి కోపగృహంబుఁజేరుటం
జూచి యిదేమిరాయనుచు "సుందరి! పల్కవదేల తెల్పుమిం
దేఁచిన క్రొవ్వుచే నొరులొకించుక నిన్నుడికించి మందురే?
నీచతురోక్తులంబలుపి నిల్పుమ చిత్తము తత్తఱించెడిన్. 26

ఉ॥ సొమ్ములు పెక్కలింపొసఁగు, సోయగమొప్పగ హృద్యమాచు,నీ
మమ్మున సేవకుల్దవిలి మానితవృత్తినుపాచరింత్రు, నా
కమ్మున దేతవల్పొగడ గణ్యయశస్కుఁడనైన నేను సే
మమొడఁగూర్చు దాసుఁడనుమానిని! యల్కవహింపనేలకో"?

చ॥ తనరఁగఁగోప తాప పరతంత్ర, కృశాంగి వచించెఁగైక, 'యో
జనవర! యేల యీకపటచాతురి, ప్రేయసినైతినేను, నా
కనవరతంబు గూర్తువిఁక నక్కఱలుండునె మీకుమాయెడం
జనుము ప్రియాంగనాపరవశా! మెఱమెచ్చులు పల్కనేటికిన్.

ఉ॥ నమ్మితి నింతకాలము మనంబున నాశలు పిక్కటిల్ల, నా
నమ్మకమెల్లఁ బొల్లగుననంగ నెఱుంగక పేలనైతి నో
యమ్మకచెల్ల! గోముఖము వ్యాఘ్రమనంగను స్పష్టమయ్యెఁబో
పొమ్ము ప్రియుండ! నీప్రియులపోఁడిమిగూర్పఁగఁగాలమయ్యెడిన్"

చ॥ అనఁగనె ఖేదమానసమునందున నివ్వెఱపైకొనంగ ని
ట్లను "లలితాంగి! యిప్పగిదినర్థముగాని తెఱంగున న్మదిం
గనలుట యేలకో, తెలియఁగన్వివరించుట పోలదొక్కొ, నీ
మనమునఁ బేర్చునమ్మలికమాని వచింపుము వంతయేటికిన్. 30

చ॥ అనవుడు నాథ? యేమనగ నౌను నదృష్ట విహీనురాలికిన్

వినిచినయంత మేమనుభవించెడి దెయ్యది, కార్యముందునే"
యనుటయు"బేల! పల్కఁదగునయ్యది యెంతటి దుస్తరంబునేన్
బనిగొని సల్పువాఁడ వినుభామిని! సత్యము, నమ్మఁజాలవో. 31

చ॥ మఱి మఱి వేఁడు కోల్తెలుప మానిని యించుకమోమునెత్తి, నీ
వరయుగముందు మున్నటిది వారక తీర్పఁదలంతువేని, నేఁ
డెఱుఁగఁగ నాసుతుఁ భరతునేడ్తల రాజునొనర్చి, రామునిఁ
గుఱిగఁ జతుర్దశాబ్దములకున్మ్మరి వృత్తినరణ్యమంపుమా. 32

చ॥ పిడుగును బోలునప్పలుకు వీనులసోఁకెనో లేదో, వేగమే
పుడమికొఱంగి పంక్తి రథభూవరుఁడుత్కట మూర్ఛఁదేలఁగ
న్వెడఁగగు కైక రాఘవుని వేగమ పిల్వఁగఁబంప, సేవకుల్
కడు వడి నేగి పిల్చుకొని కైక గృహంబునుజేర, నంతటన్. 33

వ॥ "రామచంద్ర! మున్ను దండకంబున వైజయంత పురవాస్తవ్య
శంబరాసుర సంగర రంగంబున మీతండ్రి నాకు రెండు వరంబు
లొసంగియుండె, నందొకదానికి భరతునకుఁ బట్టాభిషేకంబును,
రెండవదానికి నీకుఁ బదునాలుగేడు లరణ్యావాసంబును గోరితిని.
పుత్రవాత్సల్య పరవశుండైన మీ జనకుండు ఇది యది యని
యేమియుం బలుకంజాలక మిన్నకున్నవాఁడు. సుపుత్రుండవగు
నీవు పితృవాక్పరిపాలనాదక్షుండవై తండ్రిని సత్య సంధుంగా
వింపుము. చతుర్దశాబ్దంబులు నీవరణ్యంబున మునివృత్తి నుండ
వలయు" నని కైక పలుకుచుండ నీపత్సంజాత ప్రజ్ఞుండగు దశ
రథుండు గద్గదకంఠంబునఁగైకంగాంచి యిట్లనియె. 34

చ॥ పుడమి భరంప నర్హమగు పూజ్యగుణంబులు ప్రోత్సహింపఁగా

నొడయని చేయ ధర్మగతి, నుల్లముచూచి సహింపదేని, నీ
కొడుకును రాజుఁజేయుమని కోరుట కొంతగుణంబయేమొ, పే
రడవికి రామచంద్రుఁజనుమంచెటు లాడెనెనోరురాక్షసీ!. 35

ఉ॥ నిన్నుఁదలంచు నిచ్చలును, నిర్మలచిత్తుఁడు, బుద్ధిశాలి, స
త్సన్నుతుఁడైన రాఘవుఁడు సంతతమున్నిను గారవించు, నో
రున్నదె వానిపై నొకటినొప్పమిఁ జూపఁగ లోకమందు, రా
మున్నయకోవిదున్వనికిఁ బొమ్మని పల్కుట ధర్మమయ్యెనే?. 36

ఉ॥ నీతికిఁదావులేదు ధరణీశగృహంబులఁబుట్టిపెర్గినన్
ఖ్యాతిఁదలంచఁబోదు హృదయంబునఁబెర్గిన యీసుపెంపునన్
భూతముపోలె పట్టి పరిభూతి యొనర్పఁగఁజాలునట్టి స్త్రీ
జాతి సృజించె దుర్విధి, విచారముసేయ ఫలించునేకటా!. 37

ఉ॥ అంతట రాముఁడిట్టులను నమ్మరో! తమ్ముఁడు తేఁడు గాఁగ, నే
నెంతొగ సంతసింతుఁ బరికింపఁగ నింతటి భాగ్యమున్నె? నా
కెంతొ శుభమ్ముఁగోరితి మదీప్సితసిద్ధికిఁ దోడ్పడంగ, వి
శ్రాంతికిఁ దావలమ్ము మునిసంగతి, యిప్పని యొప్పమీరదే.

చ॥ తనయులు తండ్రిమాట జవదాఁటుట లోకహితంబె, రాముఁడ
న్వనములనుండువాఁడ, రఘువంశమునన్వెడ దారిచెల్లునే?
జనకుని సత్యసంధతకుఁ జాలఁగమెచ్చితిఁబోయివత్తు, నీ
తనయుని నాకుఁదమ్ము భరతార్యు నొనర్పుము రాజు, మాతరో.

చ॥ పనిఁగొని యేగువాఁడు మునిపల్లియలన్వసియించువాఁడు నీ
తనయుఁడు రామచంద్రుఁడు, నితాంతధురీణుఁడు ధర్మరక్షసే
యను భరతుండు, భూప్రజభయంబుఁదొలంగి సుఖించుఁగాదె,

యో, జననీ! మహోపకారణివెసంగుము, నీకృప యేమనందగున్

చ॥ అడలఁగనేల తండ్రి తనయా! యిటు సేయుమటంచుఁదెల్పఁగా
నడుగుకుమడ్డులొత్తుచునయంబున నేఁదలఁదాల్చి సేయనో
పుడమిభరించి భోగములు పొందు తలంపులకన్న సద్వ్రతం
బడవుల విశ్రమించుటది యారయ నిత్యసుఖంపుఁద్రోవయా. 41

ఉ॥ నీతలఁపేమొగాని ధరణీతలమెల్ల సుఖించుఁదల్లి! ప్ర
ఖ్యాత వినీతుఁడౌ భరతుఁడాయతదోర్బల మొప్పఁతేఁడుగా,
సీతనయుండు రాముఁడు మునీంద్రుల చెంతల సేవకుండుగా,
మాతరో! మేలుసేసితివి మాన్యచరిత్రవు నీకు సాటియే. 42

ఉ॥ తమ్మునిఁబిల్వఁగాఁబనిచి తండ్రి మనోరథపూరణమ్ముగా
నిమ్ముగఁబట్ట భద్రునొనరించి శుభమ్ములఁదేలుమమ్మ! నా
కమ్మరో! నిల్వఁగాదిచట నాజ్ఞ యొసంగుమ పోయివచ్చెదన్
సమ్మతి మీకు మ్రొక్కెద, విచారము వీడుఁడి భద్రమయ్యెడిన్

ఉ॥ అప్పుడు లక్ష్మణుండచటికన్న తెఱంగుఁ గనుంగొనంగఁదాఁ
జప్పున నేగుదెంచి మది సంశయ ముప్పతిలంగరామ! యీ
చొప్పున నుంటివేల ననుఁజూడవు, కార్యము తొందటించెడిన్
జెప్పుము నీముఖాంబుజము చెప్పకచెప్పు విచారమేమిటో. 44

వ॥ అనవుడు రామచంద్రుండిట్లనియె. 45

చ॥ "అడవులకేగ నేనిపుడ యానతిఁగొన్నది తల్లి కైక, యీ
పుడమి భరింపఁగాఁదనదు పుత్రునిఁగోరఁగఁ దండ్రియేదియు
నొడువఁగలేక ప్రాప్తమననుండయియుండె, మునీంద్రవృత్తినై
వెడలెదఁగానకున్, భరత వీరుఁడు తమ్ముఁడు రాజ్యమేలెడిన్.

వ॥ అని శ్రీరామ చంద్రుండు జరిగిన వృత్తాంతంబంతయు నివేదింప లక్ష్మణుండు దండతాడిత భుజంగంబు పగిదిఁ గ్రోధ పరవశుండై యిట్లనియె. 47

శా॥ ఔరా! యెట్టి విరుద్ధ ధర్మముల కన్యాయంబు రేకెత్తె, నా
ధీరుణ్ రాఘవుఁ గానకేగుమని యెంతేఁ బల్కనోరాడె, స
త్ప్రారంభుణ్ రఘురాము వీడుమనఁ గంబాటించు తండ్రి న్వెసం
గ్రూరంబైన మదీయ ఖడ్గమెరకై కోపించి వీక్షింపదో. 48

ఉ॥ "శాంతము పావమంచుఁ, బరుసంబులు వల్కఁగ బోలునయ్య! భూ
కాంతుఁడు తండ్రి తల్లి పరగంగను బూజ్యులు, తమ్ముఁడుం ధరా
కాంతుఁడు గాఁగ, నొంటి మెయి గానలకేగ విచారమేల, ని
శ్చింతగ నుండవచ్చు, విధిచెయ్వ మెఱుంగఁగ నీకు శక్యమే. 49

శా॥ అన్నా! లక్ష్మణ! కోప తాపములకయ్యా! పాత్రులే పూజ్యులె
న్నెన్నో నోములు నోఁచికన్న జనకుండీతండు కాంక్షింప, మా
పున్నెంబంచుఁ దలంధరించి పనికై పూనంగ ధర్మంబుగా
కున్నే? నీతి పథంబు జాఱవిడఁగా నొప్పౌనె రామానుజా.? 50

మ॥ తగునే యొప్పరికింపఁ దండ్రితగవేదం ధర్మవృత్తంబులం
బగసాధించఁగ శత్రువయ్యెనె మహాపాపంబు సేయంగ, ని
వ్పగిదింగంచెయొ చేనుమేయఁగడఁగం బట్టంగనౌనే భువిం
దగ సామాన్యజనంబు పోవిడువదే ధర్మంబు రామానుజా.? 51

మ॥ ఇనవంశాయత కీర్తి చంద్రిక లసద్వృద్ధిం దిశాంతంబులం
దెనయంగానలకేగి కర్జములవెంతే నొప్పనీయంగ నే
ననయంబు వ్విధి చోదకత్వమునసయ్యా? కాలముంబుచ్చెద

న్వని, నీవిచ్చుటం గొల్వుమా జనకులకు భద్రంబు రామానుజా.!

చ॥ అనుటయు లక్ష్మణుండు తనయన్న వచించిన ధర్మసూక్తికి
న్మనమున లజ్జచేవగచి మాన్యచరిత్ర! క్షమించునన్ను, నీ
వెనుకనె వచ్చువాఁడ నినువీడి చరించుట నాకులగ్గె? నిన్
గనుఁగొనలేక యొక్కత్రుటి కాలమునిల్తునె తెల్పుమగ్రజా.! 53

శా॥ తోడంబుట్టితి నీకుఁదోడయితి నీతోడన్వనాంతంబునం
గూడం దుఃఖసుఖంబులందవిలి నీకుంగింకరత్వంబునం
జూడన్మ్రగ్గఁగఁజాలు నీయనుజు రాజాంతఃపురంబందునే
జూడన్ రాఘవ! బందిఁజేయుదువు, నన్ శంకించితేయగ్రజా! 54

వ॥ అని పలుతెఱంగుల బతిమాలుకొనుచున్న తమ్ముని యనుగమ
నంబున కియ్యకొని రాముండు పయనంబు సాగింపనిశ్చయించి
కౌసల్యాదుల వీడ్కోలువడసి యరుగుదమని యంతిపురంబున
కరిగెనయ్యవసరంబున దశరథుండు కైకతోనిట్లనియె. 55

ఉ॥ "కౌతుకముజ్జగించి వడిఁగానలకేగును రామచంద్రుఁడుం
గౌతుకమంద్యజించుఁ జిరకాల సమార్తునుఁబౌరవర్గముల్
నీతినిబద్ధ చిత్తమునవేను సహించెదఁగాని దుఃఖమున్
ఖ్యాతి తొలంగు నీకనుచుఁగైక! సహింపదు చిత్తమేలకో!.

ఉ॥ చిత్తములేదె నీకు వనసీమలఁగుందఁగ నోర్తువెట్లులో
కోత్తరుఁడైన నీతనయుఁడుత్తమశీలుఁడు రామభద్రుఁడ
త్యుత్తమ భాస్కరాన్వయ సముజ్జ్వల కీర్తి కలంకితంబుగా
నిత్తెఱఁగెందునేర్చితి మదీప్సిత భేదకి? ప్రాణఘాతకీ?" 57

చ॥ అని పలుకంగఁగైక యిటులాడె "మహాత్మ? సమంజసంబు, వీా

మనమరయంగలేక కొఱమాలినకోరిక వ్యర్థనైతి, ని
య్యనకుల సార్వభౌములకు నిచ్చితపించుట పాడియేమొ, య
య్యనఘునలర్కునిన్ శిబినినైనఁదలంచుట మేలుగాదొకో. 58

ఉ॥ ఇచ్చెదనంటి తొల్లియవి యిప్పుడు వేఁడఁగ నీయలేక యీ
పొచ్చెములెన్నుచుంటివిదిపోలునె భానుకులాగ్రగణ్య? నీ
మెచ్చు తెఱంగునన్మెలఁగి మేల్మిఁదలిర్చుము నీవయిందు, నేఁ
గ్రచ్చఱమ్రింగెదన్విషము కాలునిచెంత సుఖింపధార్మికా?." 59

వ॥ అనిన దశరథుండు రోషావేశంబున మానసవీథిన్వీడిచిన రాగంబు
నయనంబుల నాశ్రయింపఁగన్నులు విచ్చి కైకంజూచి యిట్లనియె

చ॥ "తులువ తనంబు మానుమిఁకఁదుచ్ఛవు, లోకవిగర్హ్యవీవు, నీ
పలుకులు వింట నేనయితిఁబాపిని, ద్రోహిని, నిర్ఘృణుండ, నిం
డెలియక చెట్టవట్టి కడతేఱితిఁబాతకి? మోసమయ్యె, హా,
వలపులఁదేలు మోహినులు వంచన ధర్మవిఘాతకల్భవిన్. 61

చ॥ తలఁపకు నన్ను నీ పతిగ దైవము సాక్షిగఁబల్కువాఁడ, నీ
వలపునఁజిక్కి యిప్పగిది వంచితచిత్తుఁడనైతి, నెందునుం
దులువలఁజేరువారలకు దుఃఖముతప్ప మఱేమిగల్గు, నో
యలఘుచరిత్ర! నీకొడుకు కంజకపట్టముఁగట్టుకొమ్మిఁకన్". 62

వ॥ అనుచు దశరథుండు పరిపరివిధంబుల వగలంబొగులుచుఁ జింతా
సాగరనిమగ్నుండై యుండె, నక్కడనంతఃపురంబున శ్రీరాముండు
కౌసల్య కడకుంజని కృతప్రణాముండై యిట్లనియె. 63

శ్రీరాముఁడు కౌసల్యాదుల సెలవుఁగైకొని యడవులకుఁబయ
నంబగుట.

చ॥ "అరుగు మరణ్యవాసమునకంచు విధించెనుగైక నేఁడు నా
కరయఁగఁ దండ్రియాజ్ఞయని యమ్మరొ! ధర్మపథంబు మీఱరా
దరయుము తండ్రివృద్ధుఁ, డగవౌనటు దీవనలిచ్చి పంపునన్
భరతుఁడు రాజ్యమేలునిఁక భాగ్యము పండెను గైకతల్లికిన్.

చ॥ అనఁగనె మిన్నువడ్డగతి నాయమదిక్కులెఱుంగలేక హా!
తనయ! శుభంకరంబగు విధంబున మూర్తముపెట్టుటేమి, కా
ననములకర్గుటేమి, జననాయకుఁడిందుకు నొప్పుటేమి, నా
యన! విధిచెయ్దముల్దలఁప న్యాయపథంబులు తాఱుమాఱగున్.

ఉ॥ నీమహిమల్దురూహ్యములు నీరజలోచన! లోకబాంధవా!
రాముఁడరణ్యవాసమున రాక్షసవర్గముఁద్రుంచి భూమికిన్
క్షేమముఁ గూర్పఁగాఁ, బ్రజలశ్రేయము నిల్పఁగఁగట్టడించెదో,
నేమపుమాతృరక్షయిది నిర్జరులార కుమారుఁగావుఁడీ. 66

వ॥ అనుచు నెల్లవేల్పుల ధ్యానించి, దక్షిణకరంబున రక్షఁగట్టి శుభంబు
పల్కుచు నీరాజనంబొసంగి "నాయనా? మేలగుఁగాక. మాకు
బదునాలుగు వత్సరంబులు పదునాలుగు యుగంబులగు, ధీరుండ
వగు నీకెందున్నను విచారంబులేదు. వేగంబు చర్ధర్శనంబిమ్ము. పోయి
రమ్ము. విధి విధానంబెంతవారికిఁగాని యలంఘ్యంబు." అని
పలుకునంబకు వలగొని సాష్టాంగ ప్రణామంబు గావించి తనయిర
వునకరిగి సుఖాసీనుండై యుండు నవసరంబున. 67

ఉ॥ రాజగు రామభద్రుఁడని రంజిలుమోమునఁగోర్కిమీఱఁగం
దేజునెసంగ, సీత కడుఁధీరత రామునిఁ జేరవచ్చి రే
రాజునుఁబోలు నెమ్మొగము రాజిలకుండుటఁ గాంచి, హేతువే

యోజ మెలంగ నేమనుచునుగ్మలి చింతిల రాముఁడిట్లనుఁ.

శా॥ "కాంతా! నీపతి కానకేగవలెఁ, గైకాంబాతనూజుండు భూ
కాంతుండయ్యెడుఁ జింతసేయకుము, యేకాంతంబునందుండి నీ
వెంతేనత్తలమామఁగొల్వఁ దగునోయింతీ! శుభంబయ్యెడిఁ
గాంతారంబుననుండి యుందుమునులంగావంగనేఁ బోయెదన్."

చ॥ అనవుడు సీత యిట్టులను "నార్య! బళీ! యిదిమంచిమాట, యే
చనవునఁబల్కినారోయిటు, జానకి వెట్టిదో, వెక్కిరింపుకో,
జనకుఁడు పెండ్లినాఁడు "మిము జానకి యెన్నఁడుఁబాయకుండు
నం" చెనయఁగఁబల్కుమాటలవి యెన్నఁటికేనియుఁబొల్లుపోవునే.

చ॥ పతినెడఁబాసి యుండుసతి పాతకి, నింద్యచరిత్ర, యందురె
వ్రతమున నొంటినుండునిట, విశ్వమునీవయియుంటనాకు, నీ
మతి హితమెంచదేని ననుమాన్పకు, వచ్చెద నీదువెంట, శ్రీ
సతి పురుషోత్తముందవిలి సన్నిధిఁబాయుటచూచనావోకో". 71

వ॥ అనుటయు రామచంద్రుండిట్లనియె. 72

సీ॥ "జానకి! కానలు ఘానలు ఘోరనాన
క్రూర సత్త్వనిరూఢి ఘోరములవి,
కొండ నెత్తమ్ములనుండి మొత్తమ్ములై
గజబృంహితమ్ములు కడలుకొనఁగఁ
గవులను వెల్వడి గర్జిల్ల సింగముల్
భూధరంబులమాఱుమ్రోఁతలడరఁ
బుండరీకంబులుద్దండ భీకరవృత్తిఁ
దఱుముచు మెకముల దండడింప.

తే॥ సంజమాపుల రక్కసుల్ సందడించి
చండగతిఁ గాననంబెల్ల జఱచుచుండ
దండిమగవారలకు నేని గుండెలవియుఁ
గలికి! సుకుమారి! యోర్చెదే కానఁ దిరుగ. 73

ఉ॥ ఇందునిభాస్య! నీయొడలి కెండయు గాలియు సోఁకఁ గందు, నీ
వందురుపాటు గాంచి పగవాఁడు సహించునె పద్మగంధి! యీ
మందిరమందు నత్తలకు మామకు సేవలొనర్పఁ బూజ్యమౌఁ
గందము మూలముందినుచుఁ గాఱడవి న్వెతలొందఁ జాలుదే"?.

వ॥ అనుటయు నజ్జలజాక్షి రామచంద్రుం గాంచి "నాథ! అట్లనెద వేల సీతోడిద నాకులోకంబు. నీతోడి యరణ్యంబులె నాకు రాజభవనంబులు. నీతోడి యరణ్యసంచారంబె వన విహారంబు. నీతోడి భయంకరారణ్యకారావంబులె మధురగానంబులు. నీతోడి కందమూలంబులె పంచ భక్ష్యపరమాన్నంబులు. నీతోడి శిలాతలంబులె హంస తూలికాతల్పంబులు. నీతోడి నారచీరలె నాకు చీనాంబరంబులు. లోకైక వీరుండవగు నీవు నాచెంతనుండ నాకు భయంబెక్కడిది. నిన్నెడఁబాయక సేవించుటయ నాకు సర్వసౌఖ్యానుభవంబు. రఘునందనా! నాశ్రేయంబుఁ గోరుదేని నన్వీడి వెడలు తలంపు విడువు" మని యనేక ప్రకారంబులఁ బ్రార్థింప రాముండిట్లనియె. 75

ఉ॥ పంకజనేత్ర? నిన్ను విడువం, దలక్రిందులు భూతధాత్రి. మీ
నాంక సతీవిలాసిని? మనంబెఱుఁగంగ వచింతునిట్లు, పా
దాంకితమైన కాననపదంబులు పావనమౌను గాదె, ర

మ్మింక సతీ? మనోధృతి వహించి చనంగను, జాగిఁ కేటికిన్. 76

ఉ॥ తల్లి సుమిత్రకుం దెలిపి తల్లులకెల్ల నమస్కరించి వ
ర్థిల్లఁగ దండిఁ యాజ్ఞఁ గొని, యేగుదమిప్పుడ చిత్తశాంతి సం
ధిల్లఁగఁ దల్లి కైకకు, మదీప్సితసిద్ధికి లక్ష్మణానుజా?
విల్లు శరమ్ములుంగొనుచు వేగమ రమ్ము విచారమేటికిన్. 77

ఉ॥ అంతఁ బురంబునంతటను నార్యుఁడు రాముఁడు కానకేగున
న్వింతలు సందుగొందులను బెల్లుగఁ బ్రాఁకె సుమంత్రుఁడాదియౌ
మంతురులుం, బురోహితుఁడు, మాన్యులు పౌరులు పొక్కి
పొక్కియ,
త్యంత విషణ్ణ చిత్తులయి యందఱుమూఁగిరి రాజు ముంగిటన్.

వ॥ అంత రామచంద్రుండు సీతాసమేతుండై సుమిత్రకడకరిగి నమ
స్కరించి యిట్లనియె. 79

ఉ॥ "అమ్మ! సుమిత్ర! కైక తన యాత్మజు పట్టముఁగోరి నన్నుఁ గ్రూ
రమ్మగు కాననంబునఁ బురమ్మును వీడి చతుర్దశాబ్దముల్
సమ్మతినుండు మంచనుప సత్వర మేగుచునుండువాఁడ, నా
తమ్ముఁడు లక్ష్మణుండు ననుఁ దావలదన్నను వెంబడించెడిన్. 80

వ॥ నావుడు సుమిత్ర కైక తెలివిలేమికి ననేక ప్రకారంబుల వగచి
శోక దందహ్యమాన మానసయై రామునుద్దేశించి యిట్లనియె.

చ॥ "విధి విపరీత చర్యయిది, వెంగలికైక గ్రహించునెట్లు, స
ద్బుధులెఱుఁగంగలేరు, నయధుర్యుఁడు రాముఁడు కానకేఁగఁగన్
విధి నిరతుండు లక్ష్మణుఁడు విచ్చిమెలంగఁగఁ జెల్లునయ్య! నీ
పదములనంటి నిన్నెపుడు పాయకయుండుటె వీనిధర్మమౌ. 82

ఉ॥ అంత వసిష్ఠగేహమున నర్చన యుక్తములైనవాని, యా
గాంతమునందు మున్ను జనకార్చితుఁడై వరుణుండొసంగఁగా
నెంతయుఁబొల్చువాని, నుతియించుచు ఖడ్గయుగంబు విండ్లు తా
సంతస మొప్పలక్ష్మణుఁడు చయ్యనఁగైకొని రాముఁజేరినన్.

తే॥ రాము భావింపు దశరథరాజుఁగాఁగ
సీత భావింపు నన్నుఁగా శీలవినుత?
యడవి నెన్ను మయోధ్యనాయతశుభాంగ?
తండ్రి! సుఖముగ నరుగుము తలఁతు శుభము. 85

ఉ॥ మ్రొక్కెడు సీత కిట్టులను "ముగ్ధ! సుశీల? వనాంతసీమలం
దుక్కివులైన రక్కసుల యుత్తల పాటులకుల్లమీక, పెం
పెక్కిన భక్తిఁ జేఁబతికిఁ బ్రేయసివై తగునిష్టకార్యముల్
తక్కక సల్పుచున్ సతము తత్పరురాలవుగమ్ము జానకీ"? 86

వ॥ అని యాశీర్వాద పూర్వకంబుగా ధర్మంబులుపదేశించి
వీడ్కొలుప రాముండు సీతాలక్ష్మణ సహితుండై ప్రయాణ
సన్నాహంబున జనకునాజ్ఞంగొని యరుగువాఁడై తండ్రియున్న
కైకేయీ మందిరాంగణంబున కరుగుదెంచి సుమంత్రుంజూచి.

తే॥ "ఆర్య? తెల్పుము తాతకు నడవికరుగ
వచ్చి నిలుచుండె రాముఁడు వాకిటనని
ధర్మ దీక్షాపరుండయి తాతకెరగి
యరుగు వాఁడని తెలుపుమ సరగనిపుడు". 88

చ॥ అనఁగ సుమంత్రుఁడేగి తగనయ్యది తెల్ప "హతోస్మిదుర్విధీ"?
యని భువిదయ్య మీఁడ్చిననయంబున వ్రాలఁగ, సేదఁదీర్పఁగం

బనవుచు రామచంద్ర? తగవా? వనవాసము, నే భరింతునే
ననుఁగొని యేగుమావనమునకా సుఖముండెద మంచుఁదెల్పఁగన్

వ॥ సుమంత్రుండు కైకంగనుంగొని యిట్లనియె. 90

ఉ॥ "ఇంతిరో! కైక! నీవు మరలింపు మనంబును, రామచంద్రుఁడ
త్యంత గుణాభిరాముఁడ సహాయధురీణుఁడు, నాఁగ మీ
రింతలు పల్కుటేల తగవెంచితిరే యసమంజసుకా సుతుం
జింత దొఱంగి కాఅడవి చెంతలవీడుట మీకులంబునకా. 91

క॥ అనుటయు సిద్ధార్థకుఁడను
"వనితా! నీనోట నిట్టి వాక్కువెలువడన్
వినువారి గుండెలవియును
గనుఁగొంటివె రామునందు గర్వ్యాగుణములన్. 92

వ॥ అమ్మా? తనయలకుఁ దల్లిచాలు, తనయులకుఁ దండ్రిచాలు
ననులోకోక్తి నేఁడు నీవలన సిద్ధాంతితంబయ్యె. మహాపాపాత్ము
రాలగు నీతల్లి మొండిపట్టె నీయందుఁ గానంబడుచున్నయది.
నీచుల స్వభావంబులట్టివకదా? ఛీ? దుర్మార్గురాలా? నీమోము
చూడ బ్రహ్మహత్యాది మహాపాతకంబులు వెన్నంటు,ఁ" నని
సుమంత్రుండు పలుకుచుండ దశరథుండు. 93

చ॥ అరుగుము రామ? నీవడవికంచితమై పరివారమొప్ప, నీ
పురమునఁగైక యొక్కతయ పుత్రునితో సుఖయించుఁగాక మే
మరుగుదు మిప్డు నీవెనుకనయ్య? పురంబిది పాడరంగ, మే
లరయఁగలేని మూర్ఖులకు నార్యులబోధలు చేదుగావొకో. 94

ఉ॥ నావుడుఁగైక యిట్లులను నాథ? వరించితి రాముఁగానకుం

బోవఁగఁజేసి, నాభరత పుత్రునకుందగరాజ్యమిమ్మటం
చీవగ నీవు వందురిలనేటికి, నీయఁగ లేనటంచు నీ
భావముఁదెల్పరాదె యిలభానుకులంపుఁ బ్రతిష్ఠవెల్గఁగన్. 95

తే॥ అనుచుఁ గ్రోధారుణంబైన యక్షియుగముఁ
ద్రిప్పినిప్పులఁగ్రక్కెడు తెఱఁగుదోఁపఁ
జండికాకృతిఁజూపుచు మండిపడఁగ
రాముఁడిట్లను దశరథరాజుతోడ. 96

తే॥ "తాత! మునివృత్తి నరిగెడు ధార్మికుండు
తగునె పరివార సహితుఁడై తరలఁగనిటు
నియతి వల్కల యుగము, ఖనిత్రపిటక
ములను దయజేసి పంపుమా! పోయివత్తు. 97

ఉ॥ సీతయు, లక్ష్మణుండు, తగఁజెప్పిన పీడక వెంబడింతు, రీ
మాతకు సంతసంబొదవ మానుగరమ్మని యియ్యకొంటి, జా
మాత గృహంబునం భరత మాన్యున కిత్తెఱఁగెల్లఁజెప్పి, సం
జాతకుతూహలంబడరఁ జయ్యనఁ బట్టముఁగట్టమేలగున్." 98

తే॥ పలుకులయ్యవి చెవికి విన్పడెనొ లేదొ
కైక కొనివచ్చి ముందు వల్కలములుంచె
రామలక్ష్మణ సీతలుద్దామగరిమ
సభ్యులను గాంచి వేడ్కలు సంభ్రమింప. 99

ఉ॥ భూసురకోటికిచ్చి మణిభూషణ రాజములూడ్చి యంతటన్
వాసిగనున్న సంపదలవారిగ నర్థులకిచ్చి తన్పుచున్
గోసలరాజ పుత్రకులకుంఠిత తేజులు నారచీరలన్

భాసురమూర్తులొప్పెసఁగ భాసిలిరప్పుడు రామలక్ష్మణుల్. 100

సీ॥ పట్టు పుట్టంబుల పసమించు మొలలపై
నారచీరల జిగినాణెమొసఁగ
ననుపరి కుసుమవాసనల నింపుదలిర్చు
సిగలు జడల్దాల్ప మొగములలరఁ
గస్తూరికాంగరాగములు పిసాళించు
మేననంతట బూది మెఱుఁగులీన
రంగుమీాఱెడు పాదరక్షలఁ బొలుపొందు
నడుగులు పావలనందగింప.

తే॥ చాపమమ్ముల పొదులు బుజమ్ములెక్క
మూర్తిఁగైకొన్న సన్యాసమోయనంగ
రహివహించెడు శ్రీరామ లక్ష్మణులకు
భోగములువీడ సన్యాసయోగమమరె. 101

తే॥ సీత యొకవల్కలంబును జేతఁబట్టి
సిగ్గుచేఁగట్టుకొనలేక శిరమువంచ
సూర్యకులగురుఁడామెనుజూచి విసిఁగి
కైకతోనిట్లు వలికెను గసరుకొనుచు. 102

ఉ॥ రక్కసి యేమిన్యాయమిది, రాముని‌ఁగోరితి కానకేగఁ, దా
నిక్కడనుండి రాజ్యమునునేలక సీత, సుజాత, యాటచే
నొక్కతయుండలేక కడునొప్పుగఁగాంతుని వెంటనేగఁగం
డక్కలమాటి! నీవదియెదంబరికింపక యిట్లొనర్తువే. 103

వ॥ అని యామె దుర్వృత్తంబు గర్హించుచు వల్కలంబు విసరి వై

చుటయు, సీతా లక్ష్మణసహితుఁడై రాముండీక నాలసించుట
తగదని గురువులకెల్లరకుఁ బ్రదక్షిణించి ప్రణామంబులాచరించి
ప్రయాణోన్ముఖుండై యరుగు నవసరంబున నంతఃపురంబంతయు
నొక్కపెట్టున రోదనంబుఁగావించె. 104

చ॥ దశరథు నానతింబురపు ద్వారము ముందరదంబు నిల్పఁగా
వెసఁజని జానకీరమణి వేడ్కతలిర్పఁగనెక్కెఁదొల్త, న
ల్లెసలఁబురంబుఁజూచ విధి లీలయటంచును రామచంద్రుఁడుం
బొసఁగఁగ లక్ష్మణుండు తగఁబొల్చిరి తేరునఁబైన మొప్పఁగన్.

ఉ॥ తేరుఁగదల్పుమా! యనుచుఁదెల్ప సుమంత్రుఁడు పర్వఁజూపనా
ధారమ! రామ! నిన్విడిచి తాళఁగఁజాలునె ప్రాణమింక, నే
దారి మనంగ నాకిపుడు తండ్రి! రథంబును నిల్పరాదె, క
న్నారఁగ నీముఖాంబుజము నక్కటఁచూడఁగ భాగ్యమున్నదే.?

తే॥ అనుచు విలపించి విలపించి యవని విభుఁడు
తేరిపైఁజూపునిగుడించి తేరిచూచి
దాఁటిపోవఁగ మూర్ఛిల్లి ధరణిఁబడియె
రామ! హారామ! శ్రీరామ! రామ! యనుచు. 107

ఉ॥ రాముఁడుపాసె రాజ్య మమరంగ సుధాంశుఁడు పాసెరాత్రి, మ
మ్మోమఁగలేర యన్యులని పొక్కుచుఁబౌరులు వెంబడింప, "శ్రీ
ధామమయోధ్య, మీకు శుభదంబు, వినుండిది, వేగవత్తు, మీ
ప్రేమకు నేఁగృతజ్ఞుఁడను, వేఁడెద నిల్వుఁడు పోయివచ్చెదన్.

మ॥ అనుచున్ రాముఁడు పీడుకోల్తెలుప "నయ్యా! రామభద్రా!
నినుం

జనునే వీడఁగ నిర్మలాత్మ! తగవా! స్వాంతంబులెట్లోర్చుఁ, గా
నన భూమిన్నినువీడి భోగముమదింగాంక్షింప మేలున్నె? మా
మనవింగైకొని చిత్తగించు రఘురామా? లోకసంరక్షకా?". 109

తే॥ అనుచుఁబౌరులు రథవేగమనుసరించి
పరుగు వాఱుచుఁ బురమున కరుగకున్న
"సూత! వినరింక వేగంబుఁజూపుము" నిన
వేడ్కఁగొలుపుచు గుఱ్ఱాల విడిచెవేగ. 110

ఆ॥ వె॥ అరయ రాము వెంట నాబాల గోపాల
మరిగెఁబురము నాకు నడరనగునె?
యనుచుఁ బుడమియెంచి యతనివెంటనె యేగ
ధూళి నెపముచేత గాలికెగిరె. 111

తే॥ రాజ భోగవిరక్తుఁడై రాముఁడడవి
కరుగ సీతయుఁ గాంతుని ననుగమింపఁ
దలఁప నశుభంబొకో యంచుఁదల్లిధాత్రి
పాంసువులచేత బాష్పముల్ ప్రజకుఁదొలఁచె. 112

క॥ పరి జనులు మూర్ఛఁదేర్పఁగ
ధరణీ పతి దశరథుండు తల్లడపడుచున్
బరికించి పలికె "నన్నిఁక
వెరవుగఁ గౌసల్యయింట విడువుండ"నుచున్. 113

శ్రీరాముఁడు పౌరులను వంచించి యరణ్యమున కరుగుట.

చ॥ ఇనకులకీర్తి వల్లరుల నెల్లదిగంతములందుఁ బెంచు స
ద్వినుతుఁడు రామమూర్తి సొరిదిందమసాతటభూమిఁజేరి, స్వం

దనమును నిల్పి, పౌరులకు దాఁటఁగరాదని నిశ్చయించె, నా
దినమట, సూర్యుఁడస్తగిరి తీరముఁజేరఁగ విశ్రమింపఁగన్ 114

చ॥ పురమునువీడి వెందవిలి పోక్కుచు రామునరణ్యవాస దు
ర్భర పరిణామముందలఁచి, భాగ్యములెల్లఁ బరిత్యజింప, దు
స్తర విపినోర్వి భాగములె సౌధములయ్యెఁ బ్రజాళికయ్యెడం
ధర సుగుణాభిరాములగు ధన్యులఁబాయఁగఁజిత్తమోర్చునే?.

చ॥ కదలిక లేది మైమఱచి గాఢతమంబగు నిద్రనుండ, నిం
పొదవ సుమంత్రుమేల్కొలిపి యొయ్యనఁ“ బౌరులఁగూడియేగనా
కొదవుఁబ్రవాదమార్య! యిదియొప్పదు, కాన నిగూఢవృత్తినే
గుద”మను రామువాక్యములకు న్వడిసూతుఁడు తేరుబూన్పఁగన్

ఉ॥ మెల్లగ రామ లక్ష్మణులు మేదిని కూఁతురు తేరునెక్క, వీ
రుల్లతికావృతాటవిక రుద్ధపథంబున జాడలెవ్వియుం
దెల్లముకాకయుండ, వడిఁదేరు చనం, గహనాంతరంబులం
దెల్లలునేర్లు దాఁటి రథమేగెను సంజకుశృంగిబేరముఁన్. 117

తే॥ పరగునెచ్చట నింగుదీపాదపంబు
నింగి గంగాసుసంగత శృంగ తలము
పుడమిగాంగ జలాప్లుత మూలమగుచు
నందు నిరవొంద విశ్రాంతి నందడిగిరి. 118

వ॥ అచ్చటఁ దమ సానదీతీరంబున. 119

ఉ॥ బల్లున తెల్లవాఱఁగనె పౌరులు మేల్కని తేరులేమికి
న్వెల్ల మొగంబువైచి దురపిల్లుచు, జాడలు పట్టిపోదము
చెల్లరు పైనమై పురికి నేగిన జాడను దోఁపఁబత్తనం

బల్లన చేరి మోసమని యార్తి మునింగిరి చేష్టలుడ్గుచున్. 120

వ॥ ఇచ్చట గంగాతీరంబున శృంగబేర పుర ప్రాంతేంగుదీపాదప మూలంబునందుఁ బావన నిర్ఝర తరంగిణీ నిర్వర్తిత సాయంతన నిత్యకృత్యులై విశ్రాంతి నొందుచున్న దాశరథులసన్నిధికి నిషాద రాజు గుహుఁడరుగుదెంచి విదిత సకలవృత్తాంతుండై యంజలి ఘటియించి రామునకిట్లనియె. 121

ఉ॥ "రామ! పవిత్రనామ! నిను రాజ్యము వీడఁగ జేయుటేమి, సు
త్రామ ముఖామరార్చిత పదాబ్జమరంద మిళింద భూతులై
నీమములం దపోధనులు నిన్విడఁజాలక కొల్చుచుండ, నే
నేమివచింతు, నీమహిమ లెన్నదురూహ్యములై తలిర్చెడున్.

చ॥ తలఁపఁగనీకు ధర్మపరతంత్రునకొక్కటలోపమున్నె, సం
దలఁపుము ప్రాణమిత్రుఁడని, నాయదిరాజ్యమునేలుమిద్ది, నీ
గొలుచెడిదాసుఁడీ గుహుఁడు, కుత్సితురాలగు కైకకిచ్చట
న్మెలఁగఁగరాదు, నీ జనకునిర్ణయమయ్యది తీర్పనయ్యెడిన్."

వ॥ అని పలుతెఱంగులఁ బ్రార్థించుచున్న గుహునకుఁ బితృవాక్పరిపాలనాతత్పరుండగు రాముండిట్లనియె. 124

చ॥ విడువగరాదు ధర్మగతి విఘ్నహతంబయి వ్రేఁగుదోఁచినం
గడఁగిమునీంద్రవృత్తిమెయిఁగానకు నేగఁబ్రతిజ్ఞసల్పి, యి
య్యెడ నినుఁజూచి నిల్చిన మదీప్సిత సిద్ధితొలంగకున్నె, న
న్విడఁగుగ నెంచి లోకములనేక విధంబుల దూఱకుందునే?. 125

వ॥ "స్వార్థ పరత్వంబునకు ధర్మ మార్గంబునకుఁజాల దూరంబు. అధార్మికులకైహికాముష్మికంబులుచెడు" నని బహువిధంబుల

హితోపదేశంబు సేయుగుహుండు. 126

తే॥ ఆతిథేయమ్ముఁ గైకొని యరుగుమనిన
రాముఁడంగీకరించె నారాత్రినిలువఁ
గడఁగి సలుపంగ నతిథి సత్కారములకు
సంతసించెను శ్రీరామచంద్రమూర్తి. 127

చ॥ పొలుపుగ లక్ష్మణుండు తరుమూల తలంబునఁ బర్ణశాలనిం
పొలయఁగఁ దీర్పఁజేసి, రఘుపుంగవుఁడున్నతిఁ గూర్కి విశ్రమిం
ప, లలిత గాంగ సంగత సువాతము లొయ్యన సేదఁదేర్పఁగం
గలిత ప్రతిజ్ఞుఁడై నిశనుగాయుచునిల్చె గుహుండుతోడుగాన్.

చ॥ అరుగఁగ రాత్రి బింబఫలమట్టులడంబర మండితుండు భా
స్కరుఁడల తూర్పుకొండ పయిఁ గ్రాలఁగఁ, దాల్చి జటావిబంధ
ముల్
తరలిరి సీతతోడనది దాఁటఁగనప్పుడు రామలక్ష్మణుల్
సురతటినీ చరిత్రము విశుద్ధమనస్కత నెమ్మినెంచుచున్. 129

ఉ॥ మక్కువ రామచంద్రుఁడు సుమంత్రునిఁగాంచి "మహాత్మ! యింకనీ
విక్కడనుండి యేఁగఁదగునింటికి, నేఁడుమేము కాననం
బక్కజమైన వేఁడుకనునార్య! రథఃబిఁకఁబొక్కరాదటం
చెక్కుడు సాంత్వనంబులవచించి మరల్చెను నొల్లకుండినన్.

ఉ॥ కైకకుఁ దల్లి దండ్రులకుఁ గావలు చేరితి మంచుఁదెల్పి, పె
న్వేఁక సుపుత్రుఁడౌ భరతువేగమెరాజు నొనర్చి రాజ్యమున్
బ్రాకట ధర్మతత్పరతఁబాలన సేయుమటంచుఁదెల్పుమా,
నాకయి చింతవీడుమని నాయన వృద్ధుఁ దలిర్పఁజేయుమా. 131

క॥ తల్లులకెల్ల నమస్కృతిఁ
దెల్లముగాఁ దెలుపు, తండ్రి దివ్యపదములం
దుల్లము నిల్పి వనస్థలి
నల్ల సిలన్మెలఁగివత్తు మూరికినుమా. 132

వ॥ అనుచు సుమంత్రు వీడ్కొలుపునయ్యంతలోన. 133

ఉ॥ సమ్మతిఁ దెచ్చి నిల్పెఁగ నిషాదుఁడు నావను మువ్వురప్డు, గం
గమ్మనుతించి మ్రొక్కులిడఁగన్ శుభమంచు వచించు చెక్కు సీ
తమ్మ, "శుభంకరీ! మనుముదంబునఁ బ్రోవుమ" యంచుఁ బల్కు
చున్
దమ్ముఁడుఁ దానునొప్ప సరదారు నిషాదుఁడు బోటువేయఁగన్

ఉ॥ "అమ్మ! పవిత్రవాహిని! ముదావహమై తనరంగ నీదుతీ
రమ్మును జేర్పుమమ్మ! రఘురాముఁడు ధర్మనిరూఢ చిత్తుఁడై
యిమ్ముగఁ గాననంబరుగు నిమ్మెయి భోగములుజ్జగించి, గం
గమ్మ! శుభంబు లీవొసఁగి కావుమ" యంచుఁ దటమ్ముఁ జేర్చినన్

క॥ అనుగమన మొప్పదనుచును
ననువుగ గుహునచటనిలిపి యనునయమొప్పన్
జని వత్సదేశమున నా
తనికొక దినమందుఁ గడవఁ దరలుచునవలన్. 136

క॥ గంగా యమునా పావన
సంగతి రంజిలు ప్రయాగ శాంతాశ్రమమొ
ప్పంగని యందు భరద్వా
జుంగన నాతిథ్యమొసఁగి చూపఁగఁ ద్రోవన్. 137

మ॥ యమునందాఁటి యరణ్యమార్గమున నయ్యారణ్యకవారితముం
భ్రమికృజ్జ్యారవ భీత సంశ్రిత దిశాప్రాంతంబుగాఁ జేయుచుఞ్
శ్రమముందీర్పఁగ భూమిజాతయలరన్ రాముండు, వేచిత్రకూ
టము వంకంజనుచుండె, నందలరుచుంటందాపసుల్ ధన్యులై.

సీ॥ కలకల నిస్స్వనాకలిత ద్విజప్రౌఢి
స్వాగతంబు లొసంగు చంద మొప్ప,
ఆహుతంబులఁగొని యరుగంగ హర్షంబు
పొలుపొందన మరవిభూతియడర
తత విశ్రుత శ్రుతిఁదవిలి తపోధనుల్
నానాముఖ బ్రహ్మలనఁగ మెరయఁ
దతపింఛ శిఖిధామ తరుబృందవనములు
వేణునాద వినోద వితతిఁగూర్ప.

తే॥ శారికా కీరకోకిల స్వనములలర
రాజహంసలు సరసులు రంజిలంగఁ
జిత్రకూటంబు తనరు విచిత్రగతుల
వినయమునఁజేరె రాముండు వేడ్కఁదాని. 139

మ॥ పులులంజింకలు కొమ్ములన్ సెలవఁజూపున్నెయ్య మున్మెండు, చి
ట్టెలుకల్ సింగము లొక్కటేయనఁగ నెంతేమోద ముంగొల్పఁ, దా
వలమై శాంతికి, సత్యసంధతకు దాత్పర్యంపు సద్వృత్తులం
బొలుచుంబుణ్య జనాశ్రితంబులు తపఃపూతాశ్రమంబుల్గిరిన్.

మ॥ అలసాకేత పురాధినాథ తనయుండౌ రామచంద్రుండు కా

నలనుండన్విధి చోదకత్వమున భూనాథత్వమున్వీడి, యి
మ్ములనీకొండకు వచ్చువాఁడని మనమ్ముప్పొంగఁగా నాశ్రమం
బులకుందోడ్కొని యేగి మానులు తగంబూజింప రంజిల్లుచున్.

ఉ॥ రాముఁడు చిత్రకూటమున లక్ష్మణకల్పిత పర్ణశాలను
ద్దామ తపోధనార్చిత విధాన సమాచరణైక ధుర్యుఁడా
రామమునందుఁబోలెఁ గడులాలిత చిత్తత నొప్పుచుండె, నా
లేమ విదేహరాజసుత, లేఁబవలాతని చెంతనుండుటన్. 142

—: పుత్ర మోహమున దశరథుఁడు విలపించి మరణించుట. :—

వ॥ ఇట గంగాతీరంబున సుమంత్రుండు శూన్యరథంబుంగొని యయో
ధ్యకరుగ నల్లంబొల్లకన్నను రామచంద్రుండు తిరిగి వచ్చునేమో
యని భ్రమించి గుహుండు వచ్చువఱకు నందయుండి నిరాశా
హతుండై చేయునదిలేక సంతప్తహృదయుండై యయోధ్య
కరిగె నందు దశరథుండు. 143

ఉ॥ చిత్తము రామ రామ యనుచింతను బ్రుంగ విసంజ్ఞుఁడైన, వే
తత్తఱపాటు కీల్కొనఁగ దైవమ! యంచు, సతుల్వెతల్గొనన్
గుత్తుకలెత్తి యేడ్చి కడుఁగుందుచు నొయ్యనుపాచరింపఁగా
నత్తఱినేమిశబ్దముల కజనపాలుఁడు కన్నువిప్పుచున్. 144

ఉ॥ చూచి సుమంత్రు "నాతనయుఁజూపుమ,! యెచ్చటనుండువాఁడు
నా
నోచిన పంటరాముఁడు, నినున్విడనాడెనె, ప్రోవరాఁడె, న
న్నేచఁగఁజూచు నెవ్విధి? మునీంద్రుని శాపమువేచినావె, నీ
దాఁచిన దాఁగఁజాలుదె యధర్మమ!"యంచు నిమీలితాక్షుఁడై

ఉ॥ "హా రఘురామ! నాతనయ! హా వినయాన్విత! ధర్మధుర్య! నీ
నీరజతుల్యమౌ మొగము నెమ్మిఁ గనుంగొను భాగ్యమున్నె, నా
భారము తీఱె నాయన! శుభంకర! నన్నెడఁబాసి యేగితే,
ధీర విచార! సద్గతికిఁ దేపవు నీవ" నిమాటలుడ్గినన్. 146

చ॥ విలవిలనేడ్వ నంతిపురి, వేగఁ బురోహిత మంత్రిముఖ్యులుం
బిలబిలచేరి పెల్లు దురపిల్లుచుఁ గార్యగతిందలంచుచుం
బొలుపుగఁ దైలద్రోణి శవముంచఁగ, వేగరులేగి వార్తలం
దెలుపక పుత్త్రునా భరతుఁ దేఁగను నిశ్చయమొప్పఁ బంచినన్. 147

చ॥ పరువిడి వేగరుల్భరతు వార్తల నేమియుఁ దెల్పకుండ స
త్వరముగ రమ్మనన్వడిగఁ దమ్మునిఁ దోడ్కొని వచ్చువాఁడు "దు
ర్భరముగఁ దోఁచె నామదికి బాధ, విచారము పెల్లుమీఱె, నా
కరయఁగ దిక్కుఁ దోఁచద మహాపద యేదొ నిరీక్ష సేసెడున్.

ఉ॥ అన్నకు సేమమే, పరగ నయ్యకు సేమమె తెల్పుఁడన్నవా
"రున్నత వంశవర్ధన! సముజ్జ్వలతేజులు మంత్రిపుంగవుల్
పన్నుగ నిద్దియద్దియని పల్కరు, మిమ్మట వేగఁ గొంచుర
మ్మన్నది వార్తయొక్కటియె మాకు విధించినయాజ్ఞ" యంచనన్

చ॥ తలఁపులు తొందఱింప, వడిధైర్యము జాఱఁగ, బీరువోవఁగ
న్వెల వెలఁబాఱ మోము, కడువేగ నయోధ్యను జేరి పత్తనం
బెలమి తొలంగి యుంటకును, నింపుగఁ బౌరులు మెల్గకుంటకు
న్నిలయము దోఁపఁగా నరిగి వేడ్కఁ దొలంగఁగఁ గైకయింటికిన్.

చ॥ కొడుకరుదెంచెనన్పలుకు కోమలి వీనులు సోఁకునంత న
వ్వెడఁగెదురేగి కైక తమిపెల్లునఁ గౌఁగిటఁ జేర్చి నిల్వఁగా

నడుగఁ లకుం బ్రణామమిడి "యమ్మ! పురమ్మిది పాడువాటునే
యెడరు ఘోనంగఁ గుండఁగద, యిమ్మగ నుందురెయన్న, తండ్రి
యున్" 151

చ॥ అనుటయుఁ గైక యిట్టులను "నయ్య! వరంబు నుగోరి కానకుం
బనుపఁగ రాముఁ డేగెఁ దన పంతముఁ దీర్పఁగఁ, దండ్రియేగె నా
తనియెడఁ బాటుకై వగచి తాళఁగ జాలక స్వర్గధామముం,
బని విని యేలుకొమ్మవని పట్టము, నీకొఱకింత సేసితిన్". 152

తే॥ మాట వినునంత భరతుఁడు మ్రానుపగిది
నేలకొఱఁగుచు మూర్ఛిల్లి చాలతడవు
నకును దాలేచి "రాముఁ గాననముఁ బంపి,
తండ్రి దిగమ్రింగితే కైక! తల్లివగుదె?. 153

మ॥ పరగం జ్యేష్ఠుఁడు, ధర్మమూర్తి, తలఁపం బ్రజ్ఞాధురీణుండు, సా
గరగంభీరుఁడు రామచంద్రుఁడు ధరాకాంతుండుగా నర్హుఁడై
వరలం ధీరుని నన్నఁగా నడవికిం బంపించి రాజ్యంబు నీ
భరతుండేలఁగ ధర్మపద్ధతి కిలం బ్రాపున్నె స్వార్థప్రియా?. 154

చ॥ భరతుని చిత్తవృత్తి తలఁపం జరితమ్మను గ్రొత్తయానె? యీ
ధర తలక్రిందులై పరగ ధర్మము వీడఁగ నొప్పునొక్కొ, యీ
పరమ దయాళు రాఘవునిఁ బంపి యరణ్యము లేలుమంచు, నీ
భరతుని రాజ్యమేలుమని పల్కఁగ నోరెటులాడెఁ బాతకీ!. 155

ఉ॥ అన్న తలంపుమార్చి, ననునాతఁడు దూఱఁగఁ జేసినావు, నీ
వెన్నఁగ రక్కసుల్గనిన యింతివి, తల్లివె? పాపినైతి, నా
యన్న మొగంబుఁ జూతునెటు, లాగుణగణ్యుఁడు లక్ష్మణుండు న

న్నన్నివిధంబులన్మదికి నెక్కఁగ దూఱెనో, నిందబాయునే?.156

చ॥ నిలువఁగరాదు నీయెదుట, నిల్చినఁబాపము వెంబడించు, నీ
తలఁపున నిన్నిపుట్టె, నిటుతండ్రిని నన్నునుఁబాసి యుండనా
కలవియె, "యేగువాఁడనట నన్నపదంబుల నాశ్రయింప" నం
చలుక మొగంబుతోఁగదలునంతట మంథరఁబట్టి కొట్టుచున్.

ఉ॥ లాఁగుచు లక్ష్మణానుజుఁడు "రక్కసి! యుక్కడఁగింతు, నీదురు
ద్యోగ మడంతు గైక నిఁక ధూర్తముగించెదనం"చు ఖడ్గమున్
వేగమపైకి లాఁగఁ "దగునే యనుజా! మగువన్వధింప, నీ
లాగునఁజేసినన్మనలరాముఁడు మెచ్చునె చూడనెంచునే?". 158

వ॥ అని భరతుండు శత్రుఘ్నునివారించి "యెవరిపాపఫలమ్ము వార
నుభవించెదరు. మనకేల ' యని యంతుండ నొల్లక కౌసల్యకడ
కుంజని పాదంబులపైఁబడి వెక్కివెక్కి యేడ్చిన నాయమలేవఁ
దీసి భరతుంగాంచి యిట్లనియె. 159

ఉ॥ ఉల్లమునందు సంతసిలె నొప్పుగ రాజ్యముఁగట్టఁబెట్టి మీ
తల్లి, సుఖించుమన్న! వసుధన్విలసిల్లఁగ నేలుమన్న! సం
పల్లలితంబు, రామునసుపన్నన సీమలఁగావనేగె, సం
ధిల్లఁగ నిస్సపత్నత, మదిందలపోయుము ధర్మసూక్ష్మముల్.

వ॥ అని పలుకఁగడునొచ్చి భరతుండిట్లనియె. 161

మ॥ "భరతుండిట్టి కృతఘ్నుఁడయ్యెనె, భువిన్ భావింప భావ్యంబె,యి
క్కరణింగుట్ర యొనర్చువాఁడనఁగ నోఁగాముల్విచారింపరే
పరగన్ రాముఁడరణ్య మందడలఁబాపాత్ముండె భోగింపఁ ద
ల్లిరో! నాయుల్లము నీవెఱుంగనిదె, మేలే నన్నుశంకింపఁగన్.

ఉ॥ నేనిటు లెంతునేనిఁ దరణీందుల సాక్షిగ బల్కువాఁడ, నా
యాన, సమస్త భూతములయాన, మహాపద ఁబ్రుంగువాఁడ, నేఁ
గానన భూమికేఁగి పరగన్ రఘురామునిఁ గొంచువత్తు, రాఁ
డేని వనంబులో నతని కెన్నఁగ సేవలు సల్పుచుండెదన్". 163

వ॥ అని దీనాననుండై పల్కుచున్న యవసరంబున మంత్రి పురోహిత
ప్రముఖులరుగుదెంచి, ధర్మనిర్ణయపరులై విధి విధానంబున దశ
రథ కళేబరంబునకు దహనాది సంస్కారంబులు సేయించి పార
లౌకిక క్రియాతత్పరులై సాంగోపాంగంబుగ నిర్వర్తించి, యనంత
రంబు పట్టాభిషిక్తుండవు గమ్మని భరతుఁ బ్రార్థించిన నతండు.

చ॥ "ఇనకుల రాజధర్మము ఋషీశ్వర! క్రొత్తదె, నీవెఱుంగవే?
ననునిటు ధర్మదూరునిగ న్యాయమె యెంచుట, తప్పుగాద, యే
మననగుఁ గైక గర్భమునఁ నయ్యా! జనించితి నొప్పు, నామనం
బనుదిన మెర్గుచుండి యిటులాడఁగ మీకును బుద్ధిపుట్టెనే?. 165

చ॥ వినుఁడు మదీయ నిశ్చయము, వేగమ కానకు నేగి రామచం
ద్రునిఁ గొని తెచ్చి పట్టమును రూఢిగఁ గట్టెద, రాకయున్న నా
తని వెనువెంట వల్కలముఁ దాల్చి వసించెదఁ గానయందు, మీ
యనుగమనంబు వేఁడెదఁ బ్రయాణము సల్పఁగఁ జిత్తగింపుడీ"!

ఉ॥ ఒప్పును సచ్చరిత్రమది యొప్పును నున్నత వంశ సంభవం
బొప్పు గభీరతామహిమ యొప్పు సహోదర సౌహృదంబునం
జప్పుడమాత్యులాది ప్రజలందఱువల్కఁగఁ బైనమయ్యెఁ దా
నొప్పుగ సైనికుల్గొలువ నుల్లము రంజిల రాముచెంతకున్. 167

వ॥ ఇవ్విధంబున భరతుండు కృతనిశ్చయుండై తల్లులు వెంబడింప

నమాత్య పురోహిత పౌరవర్గ చతురంగ బలసమేతుండై రామ
చంద్రుఁదోడి తెత్తమని యరుగుచుఁజనిచని గంగానదీప్రాంతంబు
ను సమీపించు నవసరంబున. 168

చ॥ పుడమియు నింగి యేకమయి పొల్చు తెఱంగున ధూళి రేఁగె, నె
వ్వఁడొ కడువేగ సైనిక ప్రవాహము ఘూర్ణిల వచ్చుచుండె, నీ
తఁడు భరతుండుగాఁ దగుఁ, గుతంత్రములింకను మానలేదె, రా
ముఁడు వనమందు నుండుటయుఁబోలదొ, యూరకపోవనిత్తునే?

వ॥ అని యాక్రోశము పొర్లి పాఱ, గుహుఁడత్యంతార్భటింజూపునం
తననొక్కండు కిరాతవీరుఁడరుదందవ్వచ్చి "యోస్వామి! రా
మునిఁదోడ్తెచ్చుట కరుగువాఁడితఁడు సంపూజ్యుండు,గర్వ్యుండుగాఁ
డని" తెల్పవినయంబు సంధిలఁగఁదోడై దారిఁజూపింపఁగన్.170

ఉ॥ అందఱుదాఁటి గంగవినయంబున నాశ్రమ బాహ్యసీమలన్
సందడి సేయకుండఁ దగ సైనిక బృందమునిల్పి, యాశ్రమం
బందుమునీంద్రు పాదములపైఁబడి, యర్ఘ్యసపర్యలంది, రా
త్రిం దమకొక్కకల్పముగతిం దలపోయుచునందు నిల్చినన్.171

తే॥ మఱుదినంబు భరద్వాజ మానివరుఁడు
హితవుఁ గఱపుచు నెదను సమ్మతిదలిర్ప
మార్గమునుజూప హర్ష సంభరితుఁడగుచుఁ
దరలె భరతుఁడు శ్రీరాముదరికి గిరికి. 172

చ॥ చనఁగను వాహినింగనుచు సత్త్వములన్నియు విచ్చిపాఱ, నె
క్కొను పొగమంచువోలె భ్రమిఁగొల్పు రజఃపటలంబుఁగాంచి, యే
మని మది వింత దోఁపఁగనయంబున లక్ష్మణ! చూడుమన్న నా

యనఘుఁడు వృక్షమెక్కి కలయంగనుఁ గొంచువచించె నిట్టులన్.

శా॥ "అన్నా! రాఘవ! యెంతమోసమిది, యయ్యా! తమ్ముఁడే వీఁడు, నీ
పున్నెంబంచు జడల్ధరించి యడవిన్ బూజ్యుండవై యుండ, నిం
దున్నన్ సైతునెయంచు నీభరతుఁడత్యుద్రిక్తుఁడై వచ్చె, నే
నున్నానంచుఁ దలంపఁడొక్కొ, తగవే యుక్కిని సైరింపఁగన్.

మ॥ కనుఁగొమ్మద్దిగొ సూర్యవంశపుఁ బతాకల్గోచరంబయ్యె, సై
న్యనికాయంబులు పెల్లుమీఱెడునిఁకన్నాల్గయ్యెంబె సైరింపఁ గై
కొనుమయ్యా! రఘునాథ! నీకరమునం గోదండముల్, గానిచో
వినుమేస్వైర విహారముల్ సలిపెద న్వీక్షింప ముల్లోకముల్".

వ॥ నావుడు రామభద్రుండు కోపించి యిట్లనియె. 176

చ॥ "భరతుఁడె యిట్టివాఁడు, కడుభక్తుఁడు, నమ్ముము శంకయేల,నీ
వెఱుఁగవు, నన్నుఁ దోడ్కొనుచు నేగు తలంపునవచ్చువాఁడు! భా
స్కరకుల సంభవుండతఁడసంగత భాషణమొప్పునయ్య! భా
నురముగ నాకుఁదమ్ముఁడవు చొక్కఁగనేటికి నీకు లక్ష్మణా!"

చ॥ అనుటయు లక్ష్మణుండు తన యజ్ఞతకుం గడునొచ్చి, లజ్జచేఁ
గనుఁగొని మోమువంచి పరగన్వినయాన్వితుఁడై తలిర్చె నం
తన భరతుండు సానుజుఁడు దవ్వున సైన్యమునిల్పి, సాధు వృ
త్తినిఁజనుదెంచె రాఘవుని దివ్యపదాంబుజ సేవకై వెసన్. 178

వ॥ వచ్చి రామచంద్రు పాదారవిందంబులకు సాష్టాంగ ప్రణామంబుఁ
గావింప నతండు భరత శత్రుఘ్నుల నాలింగన పరిహృష్ట చిత్తులఁ
గావించి గౌరవింప, భరతుండన్న మొగంబుఁజూచి బాష్ప పూ

రిత లోచనుండగుచు నిట్లనియె. 179

చ॥ కడఁక ధురీణుఁడై ప్రజలు గాటముగా మదిమెచ్చుచుండ, ని
ప్పుడమి భరించి భోగములు పొందఁగఁ జాలినధర్మమూర్తి నేఁ
డడవులఁ బర్ణశాలలను నగ్రజుఁడుండఁ దపస్వియాచు, ని
క్కడిఁదిఁగనుంగొన న్వలసెఁగై కకుఁబుట్టిన కారణంబునన్. 180

ఉ॥ వేఁడఁగలేవె కోరికలు, వీఱిఁడి యుల్లము చిత్తగించునే,
"వాఁడి మగంటి మిన్మొరయువాఁడవనంగఁ బ్రజల్వరింప, ని
య్యాఁడుదికై క తల్లి మరియాద యెఱుంగక యాఘనంతని
వ్వీడఁగ రామచంద్ర! తగవే పురుషోత్తమ! నీవెఱుంగవే"?.181

తే॥ అనుచుఁ బలుకంగ శత్రుఘ్నుఁ డనియెనిట్టు
"లన్న! మీా విరహాగ్నిచే నడలి యడలి
రామ! రామ! యటంచు నీప్రేమమునిఁగి
మనుజాధుండు మనతండ్రి మనలవిడిచె". 183

వ॥ అప్పలుకు వినునంతన రామచంద్రుండు సీతా లక్ష్మణ సహితుం
డై మొదలు నఱికిన తరువుంబోలెఁ బుడమింబడి మూర్ఛిల్లి
కొంత వడికిఁదెలిసి శోకాగ్నిసంతప్తుఁడయి ప్రాకృతుండువలెఁ
బొరలి పొరలి విలపించుచుండ భరతుం "డగ్రజా! యిదేమి
తెఱంగు. ప్రాకృతుండవె, కర్తవ్యంబు విచారింపవలదె? నీకుఁ
జెప్పువారలెవరు?" అని సమాశ్వాసింప నప్పుడు మందాకినికరిగి
కృతస్నానులై యన్నదమ్ములు పిండప్రదాన పూర్వకంబుగఁ
దర్పణంబాచరించి పితౄణముందీర్చి వ్యసన పరవశచిత్తంబునఁ
బర్ణశాలకరిగి కూర్చుండి యుండునంతఁ గౌసల్యాది మాతలు

వసిష్ఠుంబురస్కరించుకొని వచ్చిన, వారల యడుగులంబడి దిక్కు లేనివాని వగిది రోదనంబుసేయ, నాశ్రమ వాసులరుదెంచి శోకంబు నివారించిరాసమయంబున భరతుఁ డన్నకు నమస్కరించి కరంబులు ముకుళించి యిట్లనియె. 184

ఉ॥ "నీదగు రాజ్యమేలుటకు నేర్పరులెవ్వరు నీవుదక్కరా
వేదయఁబ్రోవరాఘవ! ప్రతీక్షణ సల్పెదు నిన్నయోధ్య, భా
గ్యోదయముల్లసిల్లఁ బ్రజకొప్పఁగఁబాలన సల్పుమయ్య! నీ
మీఁద సమస్తమున్నిలుచు మీఱినరాజ్యమరాజకంబగున్. 185

తే॥ రాకతక్కిన నేనిందె రామచంద్ర!
విడుతుఁబ్రాణంబుఁ బ్రాయోపవేశమడర"
ననుచు దర్భాసనస్థుఁడై మునుకొనంగ
భరతుఁగని రామభద్రుండు పల్కెనిట్లు. 186

వ॥ "అనుజా! వినుము. సాహసంబసాధులక్షణంబు. దీర్ఘదర్శియైన సాధువు శాంతి ప్రియుండు. ధర్మశాసనంబు సమస్త ప్రజానీకంబునకు సామాన్యంబు. దానికి శాస్యశాసక తారతమ్యంబులుండవు. ఎందాఁక లోకంబు నియమబద్ధంబగు నందాఁక సుఖ సమృద్ధి వెల్లివిరియు. ధర్మప్రవర్తకులైన ధరణీశులె నియమోల్లంఘనంబాచరింపనీక సామాన్యప్రజ యదుపులేని కుటుంబంబుమాడ్కి, అసమర్థుండైన గోపాలుని పశువర్గంబు వగిది నానా ముఖంబుల సంచరించి చెట్టుగుట్టలపాలై చెడకుండునె? దాశరథీ! పితృవాక్పరిపాలనంబు మనకిరువుర కనుల్లంఘనీయంబు. నీవు పుడమిభరింపుము. నేను జతుర్దశాబ్దంబులు నానియమంబు

పాటించి తిరిగివచ్చెద. ఉత్తమ వంశ సంభూతులకు మాఱుకుఁ
దనంబు సెల్లునే" యని సమాధానపఱచుచుండఁ బురోహితుం
డగు వసిష్ఠుండిట్లనియె. 187

ఉ॥ "శ్రీరఘురామ! నిన్నొడువఁ జిత్తమనొప్పదు, విడ్వకుండినం
ధారుణి ధర్మమొప్పదు, యథార్థము, గావున ధర్మరక్షకై
కోరి భజింపఁగా భరతుకోరికఁ దీర్పఁగఁ బాదుకాద్వయం
బీరఘువంశశేఖరునకిచ్చిన సర్వము సంగతంబగుఁన్". 188

చ॥ అని పలుకంగ నయ్యనఘుడంచిత పద్ధతి యంచునెంచి, స
ద్వినయ వివేక సంపదల దిట్టవు తమ్ముఁడ! లెమ్మపాదుకల్
గొనిచని తండ్రియానతి యకుంఠితమా తెఱఁగొప్పఁబాలనం
బొనరఁగఁజేయుచుండుము,ముదమొప్పఁగఁజే కొనుమంచుఁబల్కినన్

చ॥ తలను ధరించి పాదుకలు, దైవతసంఘము, భూతపంచకం
బలవన దేవతాసమితి నచ్చుగ సాక్ష్యముఁగొంచుఁబల్కె "నీ
యిలఁ బదునాలుగేండ్లు నుతియింపఁగ రాముని బంటనౌచు, ని
ర్మలమతి రక్షసేతు రఘురామ పదాంబుజ సాక్ష్యమొప్పఁగన్.

చ॥ నియతి నయోధ్య వెల్పలనె నిల్చెద వల్కలధారినౌచు, నీ
నియమము మించునేని భువినిల్వఁగఁజాల నిమేషమేని, య
న్నియమముతోడ వీక్షొనుచు నిర్మలుఁడా భరతుండయోధ్యకుం
జయజయ రామభద్ర! యని చాటుచునేగె బుధుల్నుతింపఁగన్.

ఉ॥ పట్టపుటేనుఁగుపై విమలపాదుకలుంచి కెలంకులందు సం
ఘట్టి తచామరద్వయముఁగైకొని వేయుచు సన్నదమ్ముఁలుం
బట్టిరి సూర్గముఁదొలుతవచ్చిన యట్టులె, రాము పాదుకా

పట్టముఁజాటుచుంజనులు పట్టఁగఁజాలనిహర్షమందఁగన్. 192

ఉ॥ చేరి యయోధ్యఁ బాదుకలఁజేర్చి ముదంబున సింహపీఠికన్
బౌరులకెల్ల ధర్మగతిఁబాలకుఁడై భరతుండు పొల్చుచా
భారమునంత పాదుకలపై నిడి తాను బురంబు వెల్వలం
గోరిక నందిగ్రామమునఁ గోవిదులొప్పవసించె నిచ్చలున్. 193

చ॥ నిరతము సత్యనిష్ఠితులు, నిర్మలచిత్తులు, ధర్మతత్పరుల్
పురమునఁ బౌరులొప్పెసఁగఁబొల్చుచు నిత్యశుభోదయంబులు
స్వరలఁగ రామరాజ్యమని వర్ధిలుచుండిరిగాని, కాననం
బరిగెను రాముఁడంచు మరియాదలవీ డఁగనొప్పుకొందురే?.194

ఉ॥ అచ్చట రామచంద్రు హృదయంబున సంశయముప్పతిల్లఁగా
"నిచ్చటనుండ నొప్పదిఁక నేగుటలెస్స, తపస్సమాధికిం
బొచ్చెము గల్గునియ్యెడఁ, దపోధన వర్గము భంగమొప్పునే?
సొచ్చెద దండకాటవి, వసుంధర మెచ్చఁ, దపంబు హెచ్చఁగన్"

తే॥ అనుచుఁ జింతించి యచ్చట మునులకెఱుక
పఱిచి దండకఁజేరఁగాఁ బయనమయ్యెఁ
బుణ్యసంచయ పరిపూత భూరిమతులు
పుణ్యజన భంగమోర్తురే పుడమియందు. 196

తే॥ అత్రిమున్యాశ్రమంబున కరిగి రాముఁ
డతిథి సత్కార సహితుఁడై హర్షమొంద
విస్మయావిష్ట నేత్రముల్విస్తరించి
గ్రాసముల్మాని హరిణముల్గాంచుచుండె. 197

తే॥ అతుల పతిభక్తి తాత్పర్యమతికి సతికి

సీ తకత్యంత మంగళాశీస్సులొసఁగి
భూషణవితానమర్పించి పూజసేసి
యనిపె, ననసూయతానాత్మ యందునలరి. 198

తే॥ రామచంద్రుండు దండకారణ్యసీమఁ
జేరెఁదీక్ష్ణార్చి మేఘాళిఁ జేరుపగిది
ధారుణీమాన సాంభోజ తాపకరులఁ
జటులరాక్షస నీచులఁ జంపివేయ. 199

—: ఆశ్వాసాంతము.

శా॥ క్షోణీ భారముమాన్ప, సజ్జనుల సంక్షోభంబులందీర్పఁ, క
ల్యాణంబుల్వెలసిల్ల, ధారుణి సదారంజిల్ల ధర్మంబు, ని
దాఘావస్థ తొలంగి పొరులెసఁగ రామప్రభూ! సర్వగీ
ర్వాణ ప్రార్థిత నిత్యమంగళ! నినుఁబ్రార్థింతు భద్రాత్మకా!.

మాలిని:—దలిత దనుజమూర్తీ! తత్త్వసంవేద్యమూర్తీ!
గలిత బుధజనార్తీ! కామితార్థ ప్రపూర్తీ!
ప్రలయ విలసితాత్మా! భార్గవోద్గీతనామా!
లలిత సుజనధామా! రామ! సంపూజ్యనామా! 200

గద్యము:—ఇది శ్రీభారద్వాజ గోత్ర పవిత్రాపస్తంబ సూత్ర రాఘవా
చార్య ద్వితీయతనూజ, శ్రీరామచంద్ర కరుణా కటాక్ష
లబ్ధకవితావిస్ఫురణ, కాండూరు నరసింహాచార్య ప్రణీ
తంబైన రామ రాజ్యంబను మహా ప్రబంధంబునందు
ద్వితీయాశ్వాసము.

సంపూర్ణము.



—: శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః :—

# ★ రామ రాజ్యము. ★

## (తృతీయాశ్వాసము.)



### శ్రీరాముఁడు దండకారణ్యముఁ బ్రవేశించుట.

శా॥ శ్రీమత్పంకజషండ మండిత సరోరేఖావిరాజత్తరూ
ద్దామ శ్రీవిలసిల్లు నాశ్రమములంధన్యంబు, యాగక్రియా
ధూమ ప్రోజ్జ్వల హవ్యగంధ హాసితోద్భూతాన్య గంధంబు, శ్రీ
రాముండొయ్యనఁజేరె దండక మహారణ్యంబు సన్నద్ధుఁడై. 1

చ॥ ఎదురుగవచ్చి మౌనివరులెక్కుడు వేడుక విన్నవింప, నా
సదయులు రామ లక్ష్మణులు జానకితోడను నాశ్రమస్థలుల్
ముదమునఁజేరి మౌనికృత పూజల నందిశ్రమంబువాయ, బ
ల్లిదులగు నన్నదమ్ములు చరించిరి నిచ్చలు దండకాటవిన్. 2

ఉ॥ జానకితోడ రాఘవుఁడచంచల సత్త్వధురీణుఁడౌచు, సం
ధానితకార్ముకుండు లలితంపుఁదటిల్లత వారిదంబునాఁ
గాననచారి రాక్షస నికాయ దవానల శామనక్రియా

నూన ప్రతిజ్ఞమైఁ దిరుగుచుండె నరణ్యమునందునంతటన్. 3

చ॥ మునివరులానతిచ్చు నయముంగొని రాముఁడధిజ్యకార్ముకుం
డనయ మరణ్యచారియయి జ్యారవధావితక్రూరసత్త్వుఁడై
తనమది నిశ్చయించెఁ బ్రమదంబగు పాపినిశాటవారముం
గనుఁగొని యుక్కడంచి కుతుకంబొదఁ గూర్పమునీంద్రకోటికిన్.

చ॥ మెడ కిరువైపులంగుదెలమొండు మొకంబులు వ్రేలుచుండ, న
ల్గడలువడంక, గర్జలుచుఁగన్గవ చూపులు బీతుఁగొల్పఁ, గా
ల్నడకల దుమ్ముఁజిమ్ముచు నిలన్నడయాడెడు కొండవోలె, న
య్యడవి విరాధనామకుఁడ హంకృతి రక్కసుఁడడ్డగించుచున్.

—: విరాధుఁడు రామ లక్ష్మణులచేఁ జచ్చుట. :—

ఉ॥ ఎవ్వరుమీరలియ్యడవి నేమికతంబునఁ దిర్గువారు, మీ
రెవ్వని పుత్రు, లివ్వనిత యెందుకు మీకుఁదపోధనుల్గదా,
యివ్వన భూమినాయది, చరింతుమునీంద్రులఁ జంపుకోర్కె, నా
చివ్వకు వత్తురేని మిముఁజీల్చెద, నేను విరాధుఁడన్నుమీ. 6

మ॥ అనుచుంజానకిఁ జంకఁబెట్టుకొని యత్యంతాగ్రహోదగ్రుఁడై
చనుచుందిక్కులు పిక్కటిల్లఁగ మహాసంరంభియై యార్చుచున్
జనునే మానిని మానవాధములకున్ సన్న్యాసులౌవారికం
చనయంబుద్ధతివేగఁబోఁదొడఁగె నత్యార్భాటముంజూపుచున్. 7

తే॥ అంతరాముండు వేపమానాంగ యగుచు
నలువలంకులు దీనాననంబుఁద్రిప్పి
కలయఁగాంచెడు జానకీకాంతఁజూచి
యలుకఁగందోయి రంజింపఁబలికెనిట్లు. 8

ఉ॥ "చూఁచితె లక్ష్మణా! యితనిచూడ్కికి లెక్కకు నెక్కుడయ్యె నా
యేచినకార్ముకంబు, పరికించితె జానకి బన్నమీవు, పుల్
పోచకు లెక్కరామితని బుద్ధికిఁ, గర్మబలీయమైన-చోఁ
దోఁచెడు నాపదల్పుడమిఁ దోరములై వెనువెంటనంటుచున్.

చ॥ అనుటయు లక్ష్మణుండు సమయజ్ఞత నన్నమనంబెఱింగి, య
ద్దనుజు నుఱంబు వ్రయ్యఁగ నెదం, దల పోయుచునమ్ములేయఁ, గా
ననము వడంక నార్చి, తన నమ్మిన ముమ్మొనవాలునేసె నా
ముని జనఘాతకుండు, రఘుపుంగవుఁ డిమ్ముగ దానిఁ దున్మచున్

ఉ॥ వాఁడి శరమ్ములందొడిగి వాని యుఱమ్మును దూఱనేయ, న
ప్పోఁడిమి మీఱుగక్కసుఁడు భూమిజనేలనుదించి. యొక్కటం
గూడఁగఁబట్టి యిర్వురను గొబ్బున మూఁపులఁజేర్చి పర్వున
న్వాఁడు చనంగ వందురిలి, వారిజలోచన సీత యేడ్చినన్. 11

ఉ॥ రాముఁడు సైగ సేయఁగ విరాధుభుజమ్ముల నొక్కపెట్టునన్
సామజ శుండమున్నఱకు చందమునందెగ వ్రేయగూలుచున్
భూమిధరంబు చందమునఁ బొర్లుచుఁ జంపుచు జంతుకోటినా
నాముఖ చేష్టలన్నలుపునంతట లక్ష్మణుఁడుగ్రుఁడై వెసన్. 12

చ॥ నిలుపఁగరాదు వీనినిటు నిర్జరలోకము హర్షమంద మా
నులుసుఖియింప, లోకముగనుంగొనఁ దీర్చెదనంచు రేఁగి, కా
ఘులఁబిడి గుద్దులంబదములూడఁగఁ బ్రాణములన్మథించిన
న్వీల విలఁదన్నుకొంచతఁడు విన్నపమొక్కటియంచుఁబల్కెనన్.

వ॥ ఓరీ! దురాత్మా! కోసలదేశాధీశ్వరుండగు దశరథమహారాజు
పుత్రులను మమ్ము రామ లక్ష్మణులను ధర్మసంరక్షణార్థంబిందుఁ

జరియించువారల నెఱుంగవె? దుర్మదాంధా! పరమసాధ్వి, జనక భూజానిపుత్రి దశరథావనీందుస్నోడలు, మదగ్రజుండగు శ్రీరామ చంద్రు ధర్మపత్నిఁ బరిభవింపఁబూను నీకీలోకమున, మనుగడ సెల్లునే? నీవెవ్వండవు? ఏల యీఘోరరూపంబుఁ దాల్చితివనిన నతండిట్లనియె. 14

ఉ॥ "రాఘవ! నేను దుంబురుఁడ రంభను గౌఁగిటఁజేర్చు నుద్యమం
బాఘనుఁడౌ కుబేరునకు నారయఁదెల్పినఁ గ్రుద్ధుఁడౌచు, ని
త్యాఘనిధానమౌ నిశిచరాకృతి గల్గశపించె, వేఁడఁగన్
రాఘవుచేతఁ బాయుదువు రాక్షసరూపమటంచుఁ దెల్పఁగన్. 15

ఉ॥ నేనిటు లెతి రామ ధరణీవర! పోవఁగవచ్చితీవ, యి
క్కానన భూమిదేహము నిఖాతమునంబడవై చికావ, రా
మానుజు వేఁడుకొందున"ని యాడఁగఁ, బ్రాణములూడనంతటం
భానునిభాగ్రజుండు శరభంగుని యాశ్రమమేగ నెంచినన్. 16

మ॥ పుడమిన్ రాముఁడుపూనె రాక్షసవధంబు ద్రిక్తుఁడై యంచుఁదా
నుడువన్ స్వర్గముఁజేరె రక్కసుఁడు ధన్యుండౌచు గంధర్వుఁడై
కడిమిన్ లక్ష్మణ ఖాతగర్తమున దుష్కర్మంపు దేహంబునుం
బడియెం, జాట రసాతలంబునను రామాజ్ఞానునిక్షిప్తమై. 17

♦ శ్రీరాముఁడు శరభంగాది మహర్ష్యాశ్రమముల సేవించుట. ♦

ఉ॥ వీనులు సోఁక రాముఁడడవిన్ శరభంగునిఁ జేరునంచు, న
మ్మానవచంద్రుసేవకయి మానివతంసుఁడు వేచియుండఁగా
నేనిటఁజూడలేననుచు నిర్జరనాథుఁడు వీడియేగె, నె
వ్వానికినేని సాధు దురవస్థలు చూడఁగఁజిత్తమొప్పునే?. 18

తే॥ రాముఁ డంతట మునిఁ జేరి ప్రేమ మీఱఁ
బ్రణతులొనరింప నమ్మౌని ప్రణయ మెసఁగ
నతిథి సత్కారములు సేసి యంతరామ
చంద్రసన్నిధి భువి వీడి చనియె దివికి. 19

వ॥ అప్పగిది నగ్ని ముఖంబున శరభంగమహాముని యింద్రలోకంబున కరిగిన యనంతరంబ రామచంద్రుండు తదుపదిష్ట మార్గంబున జాహ్నవిం దాఁటి యావాసయోగ్యంబగు ప్రదేశంబు నెఱుంగ నతి తీక్ష్ణ తపఃశాలియగు సుతీక్ష్ణమహర్ష్యాశ్రమ వనప్రదేశంబుఁ బ్రవేశింప, నందలి మునిసంఘంబు లెదురుపఱతెంచి దాశరథిక్కృత ప్రణాములై దీవించుచు నిట్లు విన్నవించిరి. 20

ఉ॥ రామ! శమాభిరామ! సకలాగమసత్యపవిత్రనామ యు
ద్దామ గుణాబ్ధిసోమ! వరధర్మవినిర్జితకామ! సాధుహృ
ద్ధామ! సురారిబాధలకుఁ దాళఁగఁ జాలము కావవే! పరం
ధామ! విరోధి రాక్షస విధానము లెల్లనడంచి పార్థివా!. 21

చ॥ అనుటయు రామచంద్రుఁడు దయార్ద్రమనస్కుఁడు వల్కె నిట్లు "లో
మునివరులార! మీకు శుభములొనరించుటె నా వ్రతంబు నె
మ్మనముల శంక వీడి యసమాన తపః పరివృద్ధ సత్త్వులై
మెనయుఁడు రాక్షసాధముల నేర్చెద నేఁక మూలముట్టుగన్"

ఆ॥ వె॥ అనుచుఁ బ్రతిన సలుపు నార్యరాముని వాక్య
ములకు హర్షమొదవ మునులు సనఁగఁ
బ్రియుని మోముఁ గాంచి ప్రేయసి జానకి
పలికె సతులు మెచ్చు ఫణితి నిట్లు. 23

ఉ॥ "క్రూరులు రాక్షసాధములు కుత్సితబుద్ధులు, పంతమేలని
ష్కారణ వైరమిద్ది, ఋషిసంగతి సద్గతి చింతఁబాసి, యే
దారినొయేగు పాతకముఁ దాఁదలఁదాల్చు తెఱుంగుగాదొకో
దూర విచార! దుష్టులను దూరముత్రోయుట పాడియౌఁగదా"

వ॥ అంత రామభద్రుండు భూపుత్రికిట్లనియె. 25

ఉ॥ "జానకి! దుష్టశిక్షణము, సజ్జన రక్షణ రాజధర్మమౌ,
దానవకోటి పెల్లడరి ధార్మిక సంయములన్వ్యధింప, గీ
ర్వాణులనోంప, నిప్పగిదిరాజ పదప్రథితుండనౌచునా
పూనికఁ దీర్పకున్ననుఁ బూలకుఁ బ్రతికినమ్మకుందురే?. 26

చ॥ పలుకుల పొందికల్దనరఁ బద్దెములల్లెడునేర్పు, కామినీ
తిలకము లుల్లసిల్ల సరిదిద్దెడు దిట్టతనంబు, మూర్ఖులం
దెలుపఁగఁజేయు పూనికి, విధిన్మరలించు తలంపు ప్రజ్ఞచేఁ
గలికిరో! రాజ్యపాలనముఁగాంచఁ గడింది ధరాతలంబునన్. 27

అ॥ వె॥ చిత్తశుద్ధి, పూజ్యశీలంబు, విజ్ఞత
ముందు వెనుకలరయు బుద్ధిగరిమ
సరస వాక్యసరణి, సంస్కృతి, శాసన
చతుర గతులు తెలియ శక్యమగునె?". 28

వ॥ అని యనేక విధంబుల జానకి నొడంబఱిచి సుతీక్ష్ణ మహర్షి పాలి
కింజని కృత ప్రణాముండై యమ్మహాముని సపర్యలంది యాది
నంబందయుండి యనంతరంబ. 29

క॥ కోదండ ధారియగుచును
నాదండక రాత్రిచరుల నరయుచు నిచ్చల్

తాదండి మగతనంబున
నాదుండగుల న్వధింప నటునిటు తిరిగెన్. 30

చ॥ ఒకనెల యొక్కచోట మఱియొక్కట రెండు నెలల్వసించుచున్
సకలమునీంద్ర సంఘములు సంతసమందఁగ ధర్మతత్పరా
వికలమనస్కుఁడై యడవి వీరులు మెచ్చఁ జరించి రాఘవుం
డు కుటిలరాక్షసౌఘముఁ గడుంగడు నుక్కడఁగించి వేయుచున్

◆◆◆ శ్రీరాముఁ డగస్త్యమున్యాశ్రమంబున కరుగుట. ◆◆◆

ఉ॥ నీరముఁ గ్రోలి యంబునిధినిల్వనినింకఁగఁ జేయు, మేఘముల్
ద్వారమునందుఁ గావుమని ప్రార్థనసేసెడు తీరుశోభఁగా
భూరుహపంక్తి క్రమ్ముకొని పొల్చునగస్త్యమునీంద్రు నాశ్రమం
బారఘుపుంగవుండరుగు చల్లన జానకితోడ నిట్లనున్. 32

ఉ॥ "పావనమైన యాశ్రమము, పంకజనేత్ర! యగస్త్యమౌని సం
భావిత శాంతమూర్తి యయి పంకజ సంభవుఁడో యనంగదు
ర్భావ మదాంధరాత్రి చరవర్గముఁ గీటడఁగించి పొల్చెడిన్
దేవి! మహాత్మునీతని నుతింపఁగ శక్యమె యెంతవారికిన్. 33

సీ॥ కుపితుఁడై జలరాశి కూలంకషంబౌచు
నాచమనంబుచే నడఁచివైచె
నెలుఁగున కెడమీక వింధ్యయుద్ధతమైన
నవని సమంబుగా నడఁగఁద్రొక్కె,
సాధువృత్తి నటించి సంయమీంద్రులఁ ద్రుంచు
నిల్వల వాతాపులీల్గఁజేసె
నమరాధిపవిభూతి యడర గర్వాంధుఁడై

వరిల్లు నహుషు సర్వంబుసలిపె.

తే॥ సట్టిముని లోక సంసేవ్యునయ్యగస్త్యుఁ
బొగడవశమౌనె? జానకి? పువ్వుఁబోఁడి!
చేరి యమ్మునిచరణ సంసేవసలుపు
భాగ్యమబ్బెను బుణ్యంపు ఫలమదేమొ." 34

వ॥ ఇవ్విధంబున ముచ్చటించుచు నాశ్రమ ప్రదేశావలోకనతరంగి తాంతరంగుండై రామచంద్రుండాశ్రమ ద్వారంబు సమీపింప నంతేవాసి గణంబంతః ప్రవేశంబు సేయింప సకలలోక వంద్యమాన చరణార విందుండును, నరవిందసంభవుండుంబోలె బృందారక, మునిబృందారకపరివృతుండును, బరిత్యక్త సమస్తాశుండయ్యు నుపగత దక్షిణాశుండును, లోపాముద్రా వల్లభుండగు భగవంతుండైన కుంభ సంభవునగస్త్యునవలోకించి.

తే॥ బ్రహ్మతేజోవిరాజిత ప్రౌఢమూర్తి
కయ్యగస్త్యున కత్యంత హర్షమొదవ
రామచంద్రుండు కులగోత్ర నామములును
దెలయ నభివాదనంబుఁ గావించె భక్తి. 36

వ॥ అంత నమ్మునికుల తిలకుండు ప్రహృష్ట చిత్తుండై యాశీర్వాద పూర్వకంబుగ సపర్యలంగావించి వైష్ణవ చాపంబును, బ్రహ్మాస్త్రంబును, నైంద్రంబగు నక్షయ తూణీరద్వయంబును, రుక్మమయకోశంబగు ఖడ్గంబు నను గ్రహింపఁగైకొని తదుపదిష్ట ప్రకారంబున గోదావరీతట నికట ప్రసిద్ధంబగు పంచవటిని నివాస యోగ్యంబుగ నిశ్చయించి, మిగిలిన వనవాస దివసంబులందుండి

కడపుదమని యచ్చటి కరుగువాఁడు. 37

—: రాముఁడు జటాయువుతోఁ సఖ్యంబు నెఱపుట. :—

ఉ॥ కాంచెను నొక్కచోట బహుకందర శోభిమహీధ్రమాయన
న్మించిన కన్నుదోయి, నుతిమీఱిన పక్షయుగంపుమేను, బ
ల్చెంచు పుటంబుగల్గి ఖగరాజు గభీరతఁబొల్చువాని, ధై
ర్యాంచితమూర్తి గృధ్రకులరాజుఁ జిరాయువునజ్జటాయువున్.

ఆ॥ వె॥ కాంచి పలుకరింప ఖగరాజమిట్లను
"సఖుఁడ నేను మీదు జనకునకును
రామచంద్ర నన్ను రాజీవలోచన!
యరుణ పుత్రుఁగాఁగ నరయుమయ్య! 39

ఉ॥ నన్ను జటాయువండ్రు గహనంబున మిమ్ముఁగనుంగొనంగ భా
గ్యోన్నతి నందె జన్మము, రఘూత్తమ! మిత్రుని పుత్రులైన మీ
కెన్నఁగ సేవసల్పి కృతకృత్యుఁడ నయ్యెదఁబ్రోవు సత్కృపన్
సన్నుత సచ్చరిత్ర! మనసారననుంబనిగొమ్ము వేఁడెదన్". 40

చ॥ అనుటయు "నిర్మలాత్మ! వినయంబు, నయంబు, విశాలభావముం
దనరఁగ నంతరాత్మ వితతంబగు హర్షముపొంగిపాఱె నిన్
గనుఁగొనఁ బుణ్యుమజ్జనకుఁగాంచిన యట్లులతోఁచె నెమ్మదిన్
వినుము త్వదీయ సఖ్యమిల విశ్రుతమై పొలుపొందు నెల్లెడన్"

తే॥ అనుచు రాముఁడు సంపాతికనుజుఁడైన
యజ్జటాయుసపర్యలనంది ముదిత
హృదయుఁడగుచునుజనియె సమ్మదముతోడఁ
జక్కఁబంచవటీ ప్రదేశమ్మునకును. 42

ఉ॥ అచ్చట లక్ష్మణుండు వినయాన్వితుఁడై తనయన్న సీతయు
న్మెచ్చఁగఁ బర్ణశాలఁగడునేర్పునఁ దీర్పఁగ వాస్తుప్రక్రియన్
జొచ్చి రఘూద్వహుండు విధిచోదితుఁడై నివసించుచుండఁగా
నిచ్చలు దీర్చుచుంగొలిచె నింగిత వేది బుధుల్నుతింపఁగన్. 43

## ♦♦♦ హేమంత ఋతువర్ణనము. ♦♦♦

ఉ॥ కాంతలు పొంచియుండ,రణకౌతుకి కంతుఁడు శంఖమూఁదఁగాఁ
బంతము లుజ్జగించి తమ వల్లభులంతట లొంగిపోవ సి
శ్చింత గృహాంతరమ్ములను జేర్చి కవుంగిటఁ గట్టివేయు హే
మంతముపక్రమించెఁగుసుమాయుధు దిగ్విజయంబుఁజాటుచున్

చ॥ కిలకిల రావముల్చెలఁగఁ గ్రేవలఁబుల్గులు మేలుకొల్పఁగం
జలిచలి శ్రీహరీయనుచుఁజానల కౌఁగిలి వీడకుండఁగం
దెలతెల వాఱఁగాఁబనులుతీర్చు తలంపులు తొందఱింపఁగం
దలుపులు తీయుచుంద్రు చలితాఁకుడు కోర్వఁగలేమిఁదెల్పుచున్

చ॥ వడవడలాడుచున్ముసలివగ్గులు కుంపటిచుట్టు మూఁగి మే
న్మడుఁగఁగ రామరామయని మూల్గుచు వెచ్చఁదనంబుఁగోరు
చుం
దొడివడు పల్కులందమదుతొట్రి మొగంబులు వేలవైచి య
వ్వడువున నొప్పుచుండ్రుహిమ వత్సరయంబున నెల్లచోటులన్

చ॥ కలమపిశంగ మంజరులు కాంచన శైలములై తలిర్పఁగా
లలిత విభూతిమైఁ బ్రకృతిరాజ్ఞి విరాజిలసంజమాపులం
గలిత శుభంకరాకృతి వికారముఁ జెందఁగ నీయకుంటకై
వెలయుఁ దుషారలేపనము విశ్వమునంతట వెండిగొడ్డుగాన్. 47

## తృతీయాశ్వాసము.

సీ॥ వినుఁగించె మదినెఱవెన్నెల ప్రజలకు
నంతర్గృహంబుల హర్షమొసఁగె
సంజల విహరించు సమ్మతినరికట్టె
జలకేళి సలుపఁగా జడుపుఁగొలిపెఁ
జంద్రశాలలఁ జేరు చనవులు సడలించె
వాతాయనాలోక భ్రాంతిఁదొలఁచెఁ
గంబళ ధారణాకాంక్షలు గలిగించెఁ
దాళవృంతంబులఁ దలఁగఁజేసె.

తే॥ చంద్రసూర్యులు వెలుఁగుల చందమెడలి
ధూళిధూసర తనువులఁదోఁచుచుండ
వనజముల పాలిదావ పావకమనంగ
నిలను వెలుఁగొందె హేమంతఋతువు మిగుల

### —: చుప్పనాతి రామ లక్ష్మణులచే భంగమొందుట.

వ॥ అట్టి సమయంబున రావణుని చెల్లెలగు చుప్పనాతి య
వెదురు వనంబునఁ దండ్రి పగఁదీర్పఁ దపంబాచరించు
జంబుకుమారున కాహారంబుఁ గొనివచ్చి, యతఁడు
యుండుటం గాంచి, లక్ష్మణనిహతుండగుట యెఱు
యందుల కందలి మునివరులె నిమిత్తంబుగా వగచి, ద
క్రోధవివశయై కన్నుల విస్ఫులింగంబులురుల దుర్నిరీక్ష్య
స్వరూపయై చంపుదు, మ్రింగుదు, నని మునీంద్రులనదల
బెదరుచు వారలిట్లనిరి.

కం॥ "మే మెఱుఁగ మిద్ది భామిని!

భూమిపసుతుఁడొక్కరుండు పుత్రునిఁదునిమెక
గామితగతి నెందేగెనొ
వామాక్షి! యథార్థ మరసి వర్తలవలదే?." 50

చ॥ అనుటయునుగ్రయై వనమునంతటఁదిర్గుచు నొక్కచోట స
జ్జనులునుతింప నర్హమగు చందము నన్నివసించుచున్నరా
మునిఁగని దవ్వునన్నిలిచి ముక్కున వ్రేలిడివింతదోఁప ని
ట్లని మననంబుసేసెఁ దనయందుఁదలిర్పఁగ భావవీచికల్. 51

సీ॥ "గంభీర జలధర క్రమకాంతిఁదలిర్చు
తను విలాసము హాయిఁదనరుచుండ
రాకాసుధాకర రమణీయతరమౌచు
ముద్దుగుల్కు మెఱుంగు మోమెలర్ప
విరితెలి దమ్ములబురుడించు పెంపునఁ
గందోయి మురిపంపు గరువమడరఁ
దతపృథూన్నత శిలాతలము విడంబించు
వెడఁదయుఱంబు కన్విందుసేయ.

తే॥ పొలుచు భువనైక మోహనమూర్తి యితఁడు
తలిరుఁబోఁడికి నీతని చెలిమిగలుగఁ
జెలువములరదె? భాగ్యంబుగలుగునెట్లు
చరణములనొత్తు మానవ తరుణి యెవతొ?. 52

చ॥ తడయుట మేలుగాదు, తనుతాపభరంబిఁకఁ దాళఁజాల, ని
య్యడ వివెలార్చి యిమ్మగువ, నంగజసంగర ముగ్ధచిత్తుఁడై
పొడవరి వెంబడించు తలఁపున్మది నెక్కొనఁజేసి, యంతనా

యొడయఁడ! యేలుకొమ్మనఁగ నొప్పదె? యీతఁడు నన్ను
వీడునే?" 53

చ॥ అని తలయూచి భావమున నాసలు పెక్కుగ నుప్పతిల్ల, మె
ల్లన ననురూప రూపమమరంగను రామునిఁజేరిపల్కె, "నో
వనజదళాక్షి! యెవ్వఁడవు? వన్యపుజీవనమేల నీకు? నీ
వనిత విరూపయెక్కడిది? పల్కుము నాచరితమ్ముఁదెల్పెదన్".

చ॥ పలుకఁగ రాముఁడిట్లనియె "భామిని! పంతముచేతఁగాననం
బుల వసియించు రాముఁడను, భూసుత యీసతి నాదుపత్ని, యి
మ్ముల ననుఁగొల్చు వాఁడితఁడు ముగ్ధుఁడు తమ్ముఁడు, నీచరిత్ర
ముం
దెలుపుము" నంగ శూర్పణఖ తెల్లముగా నిటువల్కె నేర్పునన్.

చ॥ "వనజభవాన్వయుండగుచు వజ్రిముఖామర వర్గమెంతయుం
బనిగొని సౌఖ్యముల్మెలప, వాసిగ దైవత కాంతలాదృతి
న్వినయముతోడ నూడిగపునేర్పులు సూపఁగ నొప్పునట్టిరా
వణుఁడు మదీయభ్రాత, తగభాసిలు శూర్పణఖాఖ్యనాకిలన్.

ఉ॥ గర్జనసేయ లోకములు గల్లునమ్రోఁగును బ్రాపుఁగోరుచున్
దర్జనిఁ జూపవేల్పుగమి తారసిలుం జయనెట్టి కొల్వఁగన్
నిర్జిత సర్వలోకుఁడవనిన్ రజతాచలమెత్తుమేటి సం
తర్జితమానిని, రావణుఁడుగారతఁబెంచిన చెల్లెలన్ సుమీ! 57

ఉ॥ దాఁపఁగనేల నాహృదయతాప మడంపుము నన్నుఁగూడి నీ
దాఁపునఁజేరితి, న్విడువు తన్విఁగురూపిణి భాగ్యహీన, నా
యేఁపును జూపి యియ్యబల నీడ్చెదఁగాటికి, మిఁగిగవైచెదం

జూపుము నాపయిన్నరులు చొక్కితి నిన్నని సుందరాంగుఁడా!. 58

ఉ॥ మేపుదు రుచ్యమాంసముల మేలగు మేడలనుంతు, సంపదల్
చూపుదునన్న గేహమునఁజూచి కడుంగడు సంతసింపఁగా
నాపయిఁగూర్మి నెక్కొలిపి నన్నెడఁబాయక యుంటివేని, నే
నేపనియైన సల్పుదును నిక్కము, రమ్ము విరాళిఁబాపఁగన్. 59

చ॥ వెరవకు మింతయేని, వెనవీడుము వీరిని, వీడవేని ని
బ్బరముగ మ్రింగి నిన్గొనుచుఁ బాఱుదు నెచ్చటికేని నొంటిమై
మరులు కొనంగఁజేసి కుసుమాస్త్రుని కేళికి విందుసల్పుదున్
సరసుఁడ! పల్కవెందులకు? చానమరుల్కొన రిత్త పుత్తురే?". 60

వ॥ అంత రాముఁడు శూర్పణఖతో నిట్లనియె. 61

చ॥ "పడఁతి! యెఱుంగఁజాలుదువె, పత్నిముదంబొడఁ గూర్చుచుండనె
య్యెడలను నొప్పునే పతికి నిద్దఱు ముగ్గుఱుభార్యలిద్దఱం
"గడుపునునిండఁ జేదగును గారెలు" నానుడి వింపుగాదె నీ
వెడఁగుఁదనంబువీడి యడవిందగువాని వరింపఁజెల్ల దే? 62

ఉ॥ ముద్దుగఁబల్క నొక్కసతి ముక్కుచు నొక్కత యీసడించు, నే
నుద్దియునోట నెల్వడినఁ జూపులనిప్పులు గ్రక్కుచుండు దా
నెద్దియొ చిత్తమందునిచి యెంచదు మానము, నుండుటేమువెం
దిద్దఱఁ బెండ్లియాడినతఁడిద్దరఁగాంచు సుఖంబులెట్టివో. 63

చ॥ యువకుఁడు గట్టివాఁడితఁడు యోగ్యుఁడు తమ్ముఁడు లక్ష్మణుండు, ని
న్గవియఁగనర్హుఁడయ్యెడును గానన నీమచు నొంటినుండు, నో

యువిద! ప్రసన్నుఁ జేసికొన నొప్పును నాసయుఁ దీరు నీకు, నా
హావము నొసంగువాఁడనఁగ నద్దిగొ చూచెదు వానిఁ జేరుమా!"

తే॥ అనుచుఁ బలుకంగ నాముగ్ధ యతనిఁ జేరి
తన్నుఁ గవియంగ వేఁడినఁ దంత్రవేది
లక్ష్మణుఁడు వల్కె నిట్టుల "రమణి! నీవు
నయము లెఱుఁగవు చిత్తనిర్ణయము వలదె?. 65

ఉ॥ నేమముతోడ నియ్యడవి నిచ్చలు దాసుఁడనై చరింతు, నో
కామిని! రాముఁ డిప్పుడమికాంతకు రాజయి పొల్చుచుండు, నా
రాముని వీడి దీనుఁడగు రాముని దాసుని పత్నివైన నీ
సేమముఁ గోరువారెవరు, చిత్తమునం దలపోసి చూడుమా!. 66

వ॥ అని పలుకు లక్ష్మణు పలుకులకు నిరుత్సాహయై చుప్పనాతి
రామువంకకరుగు దెంచునవసరంబున నతం "డియ్యది క్రూర
రాక్షసి, క్రూరులతోడి సరసంబు చేటునకు మూలంబు, దీని
నేమి సేయనగు" నని యాలోచించుచుండ నాశూర్పణఖ తిరిగి
వచ్చుటం గాంచి జానకి యాపుకొనఁజాలక నవ్విన. 67

ఉ॥ "నవ్వెదవేల నాసవతి! నవ్వులు గివ్వులు పుచ్చివైచెదం
జివ్వకుఁ జీరు నేర్పిదియె చీ, యని సీతను డాయఁబోయినన్
మవ్వపు నెమికాఁడయిన మాన్యుఁడు రాముఁడు సైగ సేయఁగన్
మువ్వగలంద లక్ష్మణుఁడు ముక్కు సెవుల్ తెగఁగోసి పంపినన్.68

ఉ॥ తోడనె చుప్పనాతి ఖరదూషణ రాక్షసులున్న చోటికి
రేడగువేల రక్కసులదేమని యచ్చెరు వాగ్రహంబునూ
టాడఁగఁ జూచుచుండ బెగడందిన యుగ్రగజంబు పోలెఁ బో

రాడఁగఁ బ్రోత్సహించి తనయూరటమూడ్చుకొనంగఁ బాఱెనన్

తే॥ అటజనస్థానమంతయు నాగ్రహించి
యేమి యేమని యడుగ నిం కేమిగలదు?
పంచవటమున మానవ పశుయుగంబు
బలిమి నీరీతి ననుభంగపఱిచెననియె. 70

♦ ఖరదూషణాదులు రాము నెదిరించి చచ్చుట. ♦

చ॥ అదివిని యాగ్రహించి యటులా! ఖరుచెల్లెలికిట్టి బన్నమే?
యదుముఁడు చిక్కఁబట్టి మరియాదలు చూడక ముక్కుముక్కుగం
జిదుముఁడు, మానవాధములఁజేర్చి యమాలయ, మందుమీఁదనా
వదనముఁజూడుఁడంచుఁబనుపన్ ఖరుమాటకు నుత్సహించుచున్

చ॥ పరుగున నానిశాచరులువచ్చి "రఘూద్వహువేఁడి కోలలా
దరమున స్వాగతంబొసఁగి తప్పకనేఁడు దొడంగి యాహవం
బిరవుగ సాఁగు విందులట నింపుగ సల్పుయముందు, వానిమం
దిరమున" నంచుఁ దెల్పఁజనుదెంచిరి వేగమ విందలాటకున్.

క॥ ఖరదూషణులకుఁ దెలిపినఁ
బరుగున నటకరుగుదెంచి పలికిరలుకచే
"నరమాంస భుక్కులను మ
మ్మెఱుఁగక చెరలాట నీకు మేలుర! తులువా! 73

శా॥ ఓరీ! తుచ్ఛనరాధమా! చెడఁగ నీయుద్రేకమున్మీఱె, నీ
కౌరా లెక్కకు రాకపోయె ఖరుఁడౌరౌరా విజృంభింతె, రా

రారా చూచెద నీప్రతా మిఁక నీపాపిగల్భ్యముందీర్తునా
కారాధ్యున్ననుఁదాఁకి నిల్వఁదరమే గర్వంబడంగించెదన్." 74

వ॥ అని ప్రచండ భండన ప్రయత్న భీకరాకారుండై దూషణ సహితుండగుచు దూషణ భాషణంబుల రోషపెట్టుచుఁ, గ్రూరనారాచంబులంబఱపుచు, నార్భాటంబులు చెలంగ గర్జించుచు, నట్టహాసంబులు చూపుచు, నింగికెగురుచు, "నిలునిలుర మానవ పశువ! ఆఁడుదాని ముక్కు సెవులంగోయించి నీనెఱమగంటిమిం జూపితివి, నీయుసురులందీసి యీయసురులు పారణసేయువార" ని పలుక నా పిశితాశనులం గాంచి నిశితశరంబుల నాఁటుచు రాముండిట్లనియె. 75

తే॥ పట్టి యార్భాటములనేమి? గట్టితనముఁ
జూపి బ్రిదుకుఁడు రాక్షసశూరులార!
కఱచు కుక్కలు మొఱుగునె కడఁగి జగతి
నిర్జరులుమెచ్చ మిముఁగూల్తు గర్జలుడుగ. 76

మ॥ అనుచుం జాపముఁదాల్చి దాశరథి యత్యుగ్రోగ్రబాణంబులం
దునిమెన్ రాక్షసులన్ ఖరాదులఁబ్రభూతోదగ్ర గర్వాంధులన్
ఘనదుర్జన్మ పరంపరాఘటిత నానా క్రూరకర్మాఢ్యులన్
జన సామాన్యము నిర్భయంబని జనస్థానంబునందిర్గఁగన్. 77

శా॥ వీరాగ్రేసరుఁడైన లక్ష్మణుఁడు తన్వీన్ సీతఁగాపాడఁగన్
ఘోరారణ్యక రాక్షస ప్రికర మాక్రోశింపఁ జెండాడుచున్
వీరావేశ తరంగి తాత్ముఁడయి, తన్వీక్షింపవై హాయనుల్
ధీరోదాత్తుఁడు రామచంద్రుఁడడరెంధీరోద్ధతుండోయనన్. 78

తే॥ రంగులనుమార్చు సినిమా తరంగమట్లు
వేసములమార్చు సాంఘిక విజ్ఞులట్లు
రామకవి యప్పుడౌచిత్యరసికుఁడగుట
రసములను మార్చె వెవ్వేలు ప్రకృతులేర్చి. 79

శూర్పణఖ రావణునికడకుఁ బరువెత్తి వృత్తాంతం బెఱింగించుట.

ఉ॥ దూరమునుండి చూచి కడుధూర్త నిశాచరి చుప్పనాతి, యా
ఘోరము చూడలేక, తనకున్నిలువంగను నీడలేక సం
చారముమాని యయ్యెడపఁ, జయ్యన రావణుఁజేరఁబోయె నా
కారముఁజూచువారు పలుకంగ నిదేమని సిగ్గుపాటునన్. 80

చ॥ కొలువుననున్న యన్న కడకుంజని బోరుననేడ్వఁ, గొల్వువా
రలు ప్రతిమాకృతిన్నిలువ, రావణుఁడుగ్రకషాయితాక్షుఁడై
“చెలియల! యీపరాభవము చెల్లునె నే,మనియుండఁదెల్పుమా
తులువలుదుడ్కడంచి తలఁదుంచెద నంచెఱుఁగంగఁజాలరో?”

చ॥ అనుటయుఁ జుప్పనాతి తనయన్నఁగనుంగొని పల్కెనిట్టు “లా
మనుజ యుగంబు లెక్కఁగొనుమాట యటుంచుము, వారలెంత? యో
దనుజకులాధినాథ! విబుధార్చిత! యొక్కవిశేషమిప్డునే
వినిచెదఁ జిత్తగించు, మదివీడుము నాకయిచింతరావణా! 82

చ॥ వనభువి నిచ్చమైఁ బటుజవంబునఁ దిర్గుచు నొక్కచక్కినేఁ
గనుఁగొని పర్ణశాలఁ దమకంబున నచ్చటికేగియుండు, ని
ర్జన వనసీమ నిర్భయతఁ జానవొకర్తుకఁగూడి కాపురం
బనువుగఁ జేయునిర్వురను నచ్చెరువొప్పఁగఁగంటి నంతటన్ 83

చ॥ సురగరుడోరగ ప్రముఖ సుందరులం దెగడంగఁ జాలున
న్నరసతిఁ గాంచి యచ్చెరువు నన్పరికొల్పఁగఁ జెంతఁ జేరిని
బ్బరముగఁ జెల్మిసేయఁదగు వాలకముంగొని నీచరిత్రముం
బరువడిఁ దెల్పుచుంటఁగని వంచననన్నిటు సేసిరిద్దఱుల్. 84

తే॥ అంతఁ బరువిడి ఖరదూషణాదులకును
దెలుపవారలు పోరాడి తెగిరి లెమ్మ
కాంతసోయగ మెంతేనిఁ గడఁగినన్నుఁ
దఱుమవచ్చితి నీకిది యెఱుకపఱుప. 85

సీ॥ జగములెల్లను మోహజలధి ముంపఁగఁజాలు
నిండుచందురుఁబోలు నెమ్మొగంబు,
నిగనిగల్పచరింప నిడుదమై సొగయించు
తుమ్మెదబాఱునాఁ దోఁచు జడయు,
నెచ్చెలి యలరంగ నెఱివిచ్చఁబాఱిన
నీలోత్పల విభూతి నెఱపుకనులు,
కుంభసన్నిభమౌచుఁ గుచములొప్పు ఘటింప
బంగారు పసమించు బాహులతలు.

తే॥ కంబుకంఠంబు, దరహాసకలిత మధుర
బింబ, మెలజవ్వనమున మెప్పించుమేను
గలిగి చెలువొందునక్కాంత కౌఁగిలంత
కలరునినుఁగాంచు భాగ్యంబుగలదెనాకు''? 86

ఉ॥ ఇమ్మెయిఁ జుప్పనాతి మదికెక్కఁగఁ బల్కినఁ గ్రోధమోహముల్
గ్రమ్ముకొనంగ రావణుఁడు కన్గవరంజిలనుగుఱిఁజూచు వే

గమ్మునఁ దాటకాసుతుని గారవమొప్పఁగఁ జేరిపల్కె "నా
కిమ్ముగఁ దోడ్పడంగఁదగుదువీవ హితుండవులాతివాఁడవే? 87

చ॥ అరుగుదు దండకాటవిక నందలి యింతి మృగాక్షిఁ జేరఁగా
సరగున నీవుముందరిగి చారుమృగాకృతి భ్రాంతిఁగొల్పి, సుం
దరినినుఁబట్టి తెమ్మనఁగ దవ్వున దవ్వునఁ జెంగలించుచున్
మురిపముఁజూపుచానరుల ముగ్ధులఁజేయఁగఁగార్యసిద్ధియౌ".

ఉ॥ సూచనసేయనిట్లు చవిచూచినవాఁడు ప్రతాపవహ్ని మా
రీచుఁడసమ్మతిం దెలుపఁ బ్రేమతలిర్పఁగ వేఁడుకొన్న నా
నీచుఁడు సమ్మతించె ధరణీసుత, రాముని మోసపుచ్చఁగం
గోచులుదాల్చునంత ఋషికుంజరులౌదురె నీచులిద్ధరన్. 89

తే॥ జడలు నారలుదాల్చి యాశ్రమముఁజొచ్చి
తపముసేయుచు దరిఁజేరఁ దలఁచు టేడ
పరసతీ చౌర్యపరుఁడయి పఱచువాని
కడరిసాయంబుఁ జేయంగఁ దొడరుటేడ. 90

మారీచుఁడు వంచింపఁగా సీతను రావణుండపహరించుట.

సీ॥ మేనుబంగారమై మెఱుఁగు లీనుచునుండఁ
జిత్రమృగాకృతిఁ జెంగలించి,
గిరిదుర్గమస్థలుల్ క్రేళ్లువాఱుచు దాఁటి,
యాశ్రమప్రాంతంబునట్టె చేరి,
రామ లక్ష్మణులు సీతామహాదేవియు
నిలుచుచోటులు మెల్లనిక్కిచూచి
తనపని కనువైన తలఁపులు తలపోసి

యంత నింతటఁ దళ్కు లడరఁ దిరిగి.

తే॥ బెగడి వారల సహజ గాంభీర్యమునకు
ముందునకుఁబోవ జంకుచు సందుకొనఁగఁ
గాలమనుకూలపడుదాఁకఁ జాలతడవు
కాచుకొనియుండె నందు మారీచుఁడపుడు. 91

ఉ॥ చూచుసు నిక్కినిక్కి తనచూపుల నిగ్గులనట్టె సీతపై
వీఁచుఁ దదేక దృష్టిమెయిఁ బిల్చెడునట్టులఁ ద్రిప్పుఁగంఠముల్
దోఁచుఁ దళుక్కుమంచుఁ గనుదోయికి దూఱముపాఱు, వచ్చు మా
రీచ మృగంబు పల్వగలఁ గ్రీడలు సల్పుచునుండె నయ్యెడన్. 92

చ॥ తళుకు మనంగఁజూచి ప్రమదంబున జానకి సంభ్రమించి, యా
కలిత సువర్ణ వర్ణపు మృగంబని యుల్లము పల్లవింపఁ, గా
నలఁదన పొద్దుపోకకయినల్వసృజించిన లేడియంచు, నిం
పలరఁగఁబట్టి యిమ్మనుచు నారఘురామునిఁగాంచి వేఁడినన్.

ఉ॥ "మైథిలి! మోసపోదువకొ, మాయల రక్కసులెన్నొ పోకడల్
సాధుల నొంపనెంచి యిటులంజరియింతురు, నమ్మరాదు, ని
ర్బాధముగాఁగ నుండి విధిపంచిన యట్టుల కాలమీఁగకే
లా, ధరణీసుతా! యిఱకరాయిడి? స్వర్ణ మృగంబుగల్గునే"?

క॥ అని రాఘవుండు పలికిన
విని జానకి కనులనీరు వెడలఁగ నారా
ముని మనము నొవ్వఁబలికెను
వనితలుసదసద్వివేకవతులె జగతిలోన్. 95

ఉ॥ "వేఁడఁగలేద సాధ్యముల, విశ్వమనోహరమూర్తియైన యీ
లేడినిఁబట్టి యిమ్మనిన లేదు ఫలింపఁగ" నంచుఁబల్కనో
రాడక రాముఁడాక్షణమ యాసతికోరికఁ దీర్పఁబూనె, హా!
యాఁడువి పట్టుపట్ట నడుగవ్వల దాఁటఁగలారె యెవ్వరే౯. 96

ఉ॥ అంతటఁ దమ్మునింబిలిచి "యయ్యరొ! జానకి యెన్నఁడేని యా
వంతయు నన్నువేఁడదిపుడాసతి బంగరులేడిఁ బట్టుమం
చెంతయువేఁడుచున్నయది, యేగుదుఁ బట్టఁగదానినిప్పుడా
కాంతమనంబు సంతసిలఁగ న్విలునమ్ములనందుకోఁగదే". 97

ఉ॥ అప్పలు కాలకించి తన యన్నకు లక్ష్మణుఁడిట్లుపల్కు "నే
చొప్పున నొప్పుకొందువిది, చూచి విషంబును మ్రింగువారె, బ
లిప్పలువెట్టి రక్కసులు త్రిమ్మరుచుందురుగాక, కాంచమే?
యెప్పగిదింబొసంగుఁ బ్రభవింపఁగఁబైడి మెకంబులిద్ధర౯." 98

చ॥ అనుటయు రామచంద్రుఁ డిటులాడెను దమ్ముఁడ! శంకయేల,నా
ఘనతర కార్ముకంబు గలుగంగ నిశాచరు లెంతవారు, నేఁ
జనియెద నిమ్మెకంబుఁగొని చయ్యన వచ్చెదనట్లు గానిచోఁ
దన నిజరూపముందెలియఁ దత్క్షణమయ్యముఁ జేరఁబంపెద౯.

క॥ నావచ్చువఱకుఁ దమ్ముఁడ!
నీవిట జనకాత్మజాత నిశ్చలమతివై
కావఁగ వలయును గదలక
నావలను విచారముడిగి సహింపుమువత్సా!. 100

వ॥ అని పలికి ధనుర్బాణంబులు కేలంధరియించి, పసిఁడి మెకంబుం
బట్టఁ బయనంబు సాగించుచు మఱిమఱి లక్ష్మణుంగాంచి "య

నుజా! భద్రంబు, భద్రంబనుచుఁ, బొదలమాటునను, దరునికరం
బుల సందులను, నెగురుచు, దుముకుచు, నానా విధ విలాసం
బులఁజూపుచున్న యామృగంబుంబట్ట నుంకించి, కదలి దాఁపు
నకుఁబోవ నాస్వర్ణమృగంబు. 101

చ॥ చేతికిఁ జిక్కినట్టులనె, చిక్కక పేఱెమువాఱు, నిల్చు, ని
ర్భీతిగ గడ్డిమేయుఁ, బులువీడి భయంపడినట్లు చూచుఁ, బో
నీ తగులమ్మిదేలయని నిల్వఁగఁ జెంగునఁ జెంతఁజేరు, నీ
రీతిగ రాము దవ్వులకు లీలమెయింగొని పోవుచుండఁగన్. 102

ఉ॥ పోకడలెల్లఁగన్గొనుచుఁ, బోలికలన్మది నిర్ణయించుచుం
బ్రాకట రాక్షసుండనెడు భావము బుద్ధికిఁదోఁచునంత, "న
న్నీకపటాత్ముఁడియ్యడవి నివ్విధి నెచ్చటికేనిలాఁగి, య
ఱ్ఱాఁకలఁబెట్ట నెంచెడును" నంచు మనంబున నిశ్చయించుచున్.

మ॥ పరగన్ బాణమునెక్కుడించి నిలురా! పాపాత్మ! యెందేగనౌ
ధరణిన్వంచక ఘాతుక ప్రకరముందండించు వాఁడంచు నీ
వెఱుఁగంజాలవొ యంచుఁ జావశరముద్దేయంగ నానీచు బి
ట్టఱచెన్ లక్ష్మణ! లక్ష్మణా! యనుచు, హా హా సీత! యం
చెంతయున్. 104

చ॥ అది విని సీత బెగ్గడిలి యంబుదగర్జన భీత భీతయై
హృదయము తత్తఱింప దిగులెక్కుడుఁ జెందుకురంగివోలెనె
మ్మది గనలేక వేగననుమానము హెచ్చఁగఁజీరిలక్ష్మణున్
"సదయుఁడ! యన్నకెయ్యదియొ సంధిలె, వింటివె యార్త
నాదమున్. 105

చ॥ పరుగిడు వేగ నగ్రజుని బాధలఁదీర్పఁగ, దక్షిణాక్షి స
త్వరముగఁ గొట్టుకోఁదొడఁగెఁ, జాల్మితొలంగెను నిల్వఁగాదు, ని
బ్బరముగ మాటలన్వినుచుఁ, బాలుములక్ష్మణ! యేమి హేతువో,
యరసిరయంబునన్ రఘుకులాగ్రణి కన్నకుఁదోడు సూపుమా".

చ॥ అని బహుభంగులన్వగచు నవ్వసుధాత్మజ కిట్లువల్కు ల
క్ష్మణుఁడు "సతీ! యెదన్భయము మానుము, యన్నకు నెగ్గు సేసి యి
వ్వనజ భవాండమందున నెవండు మనంగలవాఁడొ తెల్పు, నేఁ
జనఁగను నాజ్ఞ లేదుగద! జానకి!మాంతరో! యూఱడిల్లుమా!.

చ॥ మొదటనె సెప్పలేదె యిదిమోసమటంచును, నవ్విధంబునం
బొదలు నిశాచరున్వలచి పొమ్మని యన్నను బట్టుపట్టు, నన్
గదలకుమంచు నిల్పెనినుఁగావఁగ నిచ్చట, మాయలేర్పడన్
వదలెను బాణమక్కపట వర్తను మోసపుఁగూఁత యేయగున్".

తే॥ అనుచు ధైర్యంబుఁ దెలుప నయ్యబలసహజ
చాపలంబున నరయక చకితయగుచు
ధూర్తయట్టుల లక్ష్మణు దూఱెనిట్లు
వెనుక ముందులనరయంగ వలఁదికగునె?. 109

ఉ॥ "అక్కట! యెంతమోసమిది యార్యునకన్నకునార్తి గూరఁదా
నుక్కక మాటపొందికలు చొప్పఁబల్కుచుఁ జూచుచుంటివి
ట్లుక్కివుఁడంచు నిన్నెఱుఁగకుంటిని, భావము తెల్లమయ్యె, నే
నెక్కడకేగుదున్ హాతవిధీ! ననునెంచితెయన్యగామినిన్. 110

ఉ॥ తమ్ముఁడవంచునిన్ సవతితల్లి కుమారునిఁజేరఁదీయ నే

మమ్ముఁ దలంతువే దురితమార్గమె త్రొక్కుడుగాక లక్ష్మణా!
సమ్మినబంటువోలె సుజనత్వముఁజూపితి వన్న భార్య భా
వమ్మునిల్పి యిద్ధరిత భావముసెల్లునె నీకుఁ బాతకీ! 111

చ॥ వినఁగనె 'రామ రామ' యని వీనులవ్రేళులఁజొన్పి 'శ్రీహరీ'
యని తలవంచి కేల్మొగిచి "యమ్మరో! దాసుఁడు విన్నవించు
నీ
వనభువి క్రూరరాక్షస నివాసము, జానకిఁగావు" మంచు నా
యనఘునియాజ్ఞ యాకతననాడితి నన్నిటులాడఁబాడియే?. 112

తే॥ తల్లి! యిందాకఁ బ్రియభాషితములఁజేసి
యల సుమిత్రాంబవైతి నాకడవియందు
దైవయోగంబుననుజేసి తద్దనిపుడు
కర్కశంబగు పలుకుచేఁ గైకవైతి. 113

తే॥ పంచభూతంబులార! కాపాడుఁడింక
సాధ్వి జానకి గురుపత్ని సచ్చరిత్ర
నరుగుచున్నాఁడ రామాజ్ఞ నవలఁబెట్టి
స్త్రీవచో భగ్నహృదయముద్దీప్తమగుట". 114

తే॥ అనుచుఁ దనకంటి కగుపడునంత దాఁకఁ
దిరిగిచూచుచు శబ్దించు దిశనుబట్టి
యరిగె లక్ష్మణుఁడంత సయ్యాశ్రమంబు
వేఁజేరెను రావణ యోగియడరి. 115

చ॥ ముడిచిన కెంజడల్లలను, మోమున భస్మత్రి పుండ్రరేఖలుం
బడుగు శరీరమందు నిడుపాటి కషాయపుటంగి, చేతనుం

బడియు, కమండలంబుఁ గకపాలయుఁ జర్మము యోగదండముం
గడఁక ధరించి వేగ దశకంఠుఁడు వచ్చెను వృద్ధయోగియై. 116

ఉ॥ వచ్చి ముదంబుపై కొనఁగ వావిరినింమను నంమఁజూచి, లో
నచ్చవుఁగాంచన ప్రభలనందము చిందఁగఁగూరుచుండి, తా
హెచ్చు విచారమున్నలుపు నింతిని సీతనుఁగాంచి పొంగుచుఁ
మచ్చరియోగికన్మొగుచి "మాంపరిపాలయ శంకరా"యనెఁ.

చ॥ అనుటయు సీత యక్కపటినంచిత మానిగనెంచి, లేచి, మె
ల్లన వినయంబుతోఁ బలికె "రండుయతీంద్రులు, విశ్రమింపుఁడీ,
తన సను దెంచు నాపతి, ముదంబున మీకు సపర్యసల్పుఁ, గాం
చన మృగమేను గోరఁగ వెసంజనె దానినిఁబట్టితేరఁగఁ. 118

ఉ॥ తమ్ముఁడు లక్ష్మణుండరిగె ధార్మికపద్ధతి నన్నుకాపుగా
మిమ్మిటఁ జూతురేని తమిమించును వారికి సన్మునీంద్ర! యో
గమ్ము శుభంకరంబగునె? కాననవాసము యోగ్యమానె? మీ
కెమ్మెయినున్నఁజెల్లుఁగద, యుద్ధతపోధనులౌట నిద్ధరఁ". 119

వ॥ అని యివ్విధంబున జానకీమాత యోగక్షేమంబుల విచారించు
చుండఁ బంక్తి కంధరుండు నిజరూపంబున నిలిచి దురహంకారి
యై యైశ్వర్య మదమత్తుండగుటఁ బ్రగల్భ వచనంబుల రామ
లక్ష్మణులఁ దూలనాడుటయుఁ, గామాంధుండగుట ననురాగం
బు తేటపడఁ బ్రల్లదంబులాడుటయు, నాసాధ్వి విధివైపరీత్యంబు
నకు వగచుచు మూర్ఛిల్లుటయు, నట్టిపోదిని పట్టియరదంబునం
బెట్టి గగనమార్గంబున నిజపురాభిముఖుండై యరుగుచుండెనయ్యె
వసరంబున జనకరాజసుత మూర్ఛదేఱి నలువలంకులు కలయం

గనుంగొని యిట్లువిలపింపందొడంగె. 120

ఉ॥ "రక్కసుఁడైన రావణుఁడు రామునిభార్యను నన్నుధూర్తుఁడై
గ్రక్కునఁ గొంచుఁబోయెడిని రక్షకులేరును లేరెయిందు, నే
దిక్కునులేద రాఘవ! విధిజ్ఞుఁడ! కావఁగరమ్మువేగ, నా
చిక్కును బాపువారెవరు? శ్రీకరుణాకర! కావె, కావవే. 121

చ॥ అడలుచునుండ నియ్యడవి నందపులేడి చరింపనేల, నే
విడువక పట్టువట్టి రఘువీరునిఁ బట్టఁగఁ బంపనేల, యా
దుడుకు మృగంబుకూఁతలిడ దూఱుచు లక్ష్మణుఁబాయనేల, నె
య్యెడలను మోఱకుందనపుటింతుల చెద్దములిట్టివేయగున్.

చ॥ తెలియక నీగుణంబధిక ధీయుత! లక్ష్మణ! తిట్టిపంపఁగా
నలసితివేమొ, తత్ఫలమునందితి, వెంటనె పండెఁబాపము
న్వెలఁదులు మోఱకల్పువి, వివేకులు నీతిధనుల్వచింప, న
ప్పలుకులు నెమ్మిఁగైకొనరు, భాగ్యములూడుతఱిన్ రుచించునే?

ఉ॥ తప్పునుమోపి, నిందయిడి, తమ్ముఁడ! లక్ష్మణ! నొవ్వఁబల్కియీ
ముప్పునుదెచ్చుకొంటి "యశమున్నదె సజ్జను దూఱువారికిన్"
జప్పున రాఁగదయ్య! రఘునందనుఁదోడ్కొని నన్నుఁగావ, నా
తప్పు క్షమింపుమయ్య! వసుధావరపుత్రక! సూనృతవ్రతా!.124

చ॥ జనకునిపుత్రిఁ, బంక్తి రథ సజ్జనుకోడల ముజ్జగంబులం
దనరి యెదుర్చు నుక్కువుల దైత్యులఁబట్టి వధించురాఘవుం
డనయముఁగూర్చు పత్నినయి యక్కట! రాక్షసుచేతఁజిక్కితిం
బనవిన లాభమేమి? తలఁపన్విధి దాఁటనశక్యమేరికిన్. 125

ఉ॥ హారఘువంశశేఖర! విహాయసవీధి మహాజవంబునన్

ఘోర నిశాచరుండరుగుఁ, గూల్చి చెఱన్విడిపింపరావె, కాం
తార నివాసులార! నసుఁగాన్కొన రాఘవువేగఁబంపరే,
రారె నిశాచరాధమకిరాతకు పీనిని నడ్డగింపఁగన్. 126

మ॥ అనునయ్యింతి విలాపముల్ సెవికి హా హా రావములోఁ్సక, న
వ్వన సంచారి జటాయువట్టె యసదున్వారించి "పాపాత్మ! యి
వ్వనితారత్నము రాముభార్యఁగొనుచున్ పాఱంగ న్యాయంబె, నీ"
కనుచుంగాలను దన్నె వాని శిరమత్యంతప్ర కోపంబునన్. 127

వ॥ అంత రావణుండు కోపానల జ్వాలాభీల నేత్రయుగళుండగుచు.

జటాయువు సీతకై రావణునితోఁ బోరికూలుట.

శా॥ "ఓరీ! తుచ్ఛ విహంగమా! నిలుము నీయుద్రేకముందీర్తు, న
న్నోరా! యెవ్వఁడనంచు నెంచితి, సురారాధ్యుండ! నీచాత్మ! న
న్వీరాగ్రేసరుఁడాఁకి నిల్వఁదరమే, నీసాహసంబెంత, పో
పోరా, రాముఁడు గీముఁడెవ్వఁడనుచుంబోద్రోసె దూరమ్మునన్

చ॥ కనలి జటాయువడ్డపడి కాళ్ళుల, ఱెక్కల, ముక్కునం, దశా
ననుని సురల్నుతింప ఁదగునట్లుగ నొవ్వఁగఁజేసి, పోరఁగం
గనుఁగొని రావణుండా పటు ఖడ్గముఁద్రిప్పుచుఁ బోరిపోరి యా
తని భుజసంధులందునుమధారుణిఁగూలెను ఱెక్కలూడఁగన్.

తే॥ మైథిలీ పక్షపాతంబు మెకొనంగఁ
బక్షపాతంబు జరిగెను బక్షికపుడు
రావణుండంత వేఱొకరథమునందు
సీతఁగైకొని యేగుచుఁ జెలఁగి మదిని. 131

తే॥ అంతనాసాధ్వి యాగ్రహంబతి శయింపఁ
బలికె దశకంఠు దూఱుచుఁ దెలివిగలుగ
దుష్టులకు నీతిఁగఱపిన శిష్టులగుట
పాలఁ బెంచినఁ గఱవక పాములుంట. 132

ఉ॥ "ఓరి! దురాత్మ! రావణ! సముద్ధురతేజుని రామచంద్రునిం
దూరముసేసి, దొంగవయి, దోఁచుకొనన్మనసొప్పెనెట్లు, దు
ర్వార పరాక్రముండయిన రాముని ముందఱ నిల్వనేరువే
నేరము నొప్పుకొంచుఁ గరుణింపఁగ వేఁడుము నీకు భద్రమౌ.

చ॥ వినుము మదీయసద్ధితము, వేగిరిపాటు సుఖంబుగాదు, నీ
దనుజకులంబు రూపఱఁగఁ దార్కొనెఁగాలము లేదయేని దు
ర్జన! విపరీతభావము లెసంగునె బుద్ధికి మేలుగాఁగ, రా
ముని చరణంబునే శరణముందలపోయుము నీకు భద్రమౌ. 134

చ॥ వినక మదీయవాక్యముల వెంగలివై చరియింతువేని, నీ
గొనకొని చుట్టుముట్టిములుకుల్జవ సత్త్వము లీడ్చునప్పుడై
నను ననుసంస్మరించెద, వనర్థము మూడక మున్న మేలుకో
కనలిన రాముముందఱ జగంబున నిల్వఁగలారె యెవ్వరే. 135

ఉ॥ పుట్టితి బ్రహ్మవంశమునఁ, బొల్చితి రాక్షసరాజుగాఁగ, నీ
విట్టి వినింద్య కర్మముల కిమ్మెయిఁ జొచ్చిన శ్రేయమున్నె, బల్
జెట్టివనంగఁ బేరుఁగొని 'ఛీ' యని లోకులు తూర్పుపట్టఁగా
నెట్టులనోర్చుకొందు, పరికింపవు ప్రాణములొల్లకుందువో. 136

చ॥ పరసతిఁ గోరుకంటె భువిఁ బాతకమున్నదె, దుఃఖమున్నదే,
యెఱుఁగవు రామచంద్రుఁడు పరించెడు బాణవిహారగంబులుం

గుఱిగొని ప్రాణవాయువుల గొబ్బునఁ బీల్చెదునంతదాఁక, నె
వ్వారి తరమౌను గాలపరిపాకముఁ దప్పుకొనంగ నిద్ధరన్.'' 137

తే॥ దుర్మదాంధుఁడు రావణధూర్తుఁడపుడు
వెనుక ముందఱఁ జూడక వేగరథము
నడపుచుండెను, జానకి నయములెల్ల
నడవిఁగాసిన వెన్నెలలట్లై వెలింగె. 138

చ॥ అరుగుచునుండఁ బర్వత శిఖాగ్రమునందొకచోట నైదుగుర్
పరగఁగ వానరుల్, జనకరాజకుమారిక భూషణంబులం
జెఱఁగునఁ గట్టివేయనది చెంగటవ్రాలుచుఁ దోఁకచుక్కనా
వరలెను వాలికిం, దనుజపాలకు పీడ ప్రతాపమోయనన్. 139

తే॥ రామసాహాయ్యమునకునై రవి, సుతునకు
బోధసేయంగ దిగివచ్చెఁ బుడమికనఁగఁ
దోఁచె, దశకంఠుబుద్ధికిఁ దోఁచదయ్యెఁ
దనదు తేజః ప్రపాతంబు తనరెననఁగ. 140

తే॥ కపివరులుభూషణావళిఁగాంచి, చిత్ర
విభ్రమంబున మోమెత్తి యభ్రవీధి
నరదమతివేగమునఁబోవ నట్టెచూచి
వింతయేమని వగచిరత్యంతమపుడు. 141

చ॥ అటఁజనికాంచె రాఘవుని నంచితచాపుని, నాశ్రమోన్ముఖుం
బటుజవసూచిత ప్రమదభాసితు, రాక్షస ఘాతనిశ్చలుం
జటుల ప్రభావిశేష విలసద్వనసీమునిఁ, గాంచి లక్ష్మణుం
డెటులువచింతు సీతనికి, నెయ్యది త్రోవయటంచుఁ జింతిలెన్.

ఉ॥ చింతిలి మెల్లఁగా నతనిచెంతకునేగి నమస్కరింప, "నీ
వింతట నేమి మున్గెవని యింతిని సీతను నొంటివీడి ని
శ్చింతగ నేగుదెంచితివి, చెల్లునెయిందుఁ బరాకునొంద, నే
కాంతము నందునిట్లు జవరాండ్రను వీడుట లగ్గె తమ్ముఁడా"!.

చ॥ అనుటయు లక్ష్మణుండు వినయంబున నన్నకుఁ గేలుమోడ్చి యి
ట్లనియెను "రామభద్ర! వినుమార్తి మునింగిన వానిభంగి హా!
యనుజుఁడ! లక్ష్మణా! యనుచు, హా! సతి! సీత! యటంచుఁ బల్కఁగా
విని మది తొందఱించుటను వీడితిఁ దప్పు క్షమింపుమగ్రజా!.

చ॥ విని యది రాఘవుండు కడువేగమసాగి "ప్రమాదమయ్యె, ని
వ్వనము నిశాచరావృతము వావిరి వంచకులై చరింతురే
మని యనుకొన్ననేమి, యసహాయకు సీతకు భద్రమౌనె," యం
చనుజుఁడు తానునేగి యరయంగను నాశ్రమమొప్పె శూన్యమై.

చ॥ పిడుగులు సోఁకఁ బెల్లడరు వేదన యుప్పతిలంగ, నివ్వెఱం
బడి యడుగవ్వలంగదపఁబాఱక, నిల్వున నీఱునై కడుం
బడలికఁ జెంది రాఘవుఁడు "పాసితె, భూసుత! హా! సుజాత! న
న్నడవుల పాలుసేసి" యని యార్చివిభిన్నహృదంతరాళుఁడై.

ఉ॥ జాగొనరించెనంచుఁ దరుజాలము చాటునఁ గోపమూనుచుం
దాగితొ, ప్రేమ నిర్భర విధానపు సొంపులు పెల్లుమీఱఁగా
దాఁగుడు మూఁతలాడఁగనెదందలపోసితొ, యెందుఁబోయితో
రాగదె నాదుమానసమురంజిల జానకి! వంతమేలకో. 147

ఉ॥ చిత్రమృగంబె నీవభిలషించెదవేని నిశాకరోల్లస

చ్చిత్ర మృగంబునై నఁగొని చేర్చెద నిమ్మెడ, లేకయున్న భా
స్వత్త్రి జగత్ప్రసిద్ధ వసుసంచయమెయ్యది గోరుకొన్న భూ
పుత్రిక! కోపమేల నినుఁబూర్ణమనోరథఁ జేతురాగదే. 148

చ॥ అని బహుభంగులంబిలిచి యక్కడి భూరుహపంక్తి చాటునన్
ఘననిబిడాంతరాళములఁ గన్గొని యాశ్రమ ప్రాంతమంతటం
జనిచని చూచిచూచి మది సంశయ మెక్కుడుగాఁగ నక్కటా
జనకజఁ బాసి యెవ్విధిని సంకట మోర్చెదనంచు నిల్లనేన్.

ఉ॥ "ఎక్కడిసీత లక్ష్మణ! యిఁకెక్కడి రామునిభాగ్యలక్ష్మి, స
ద్దిక్కులుచూచి వేసరితి లేదయుపాంతములందునెచ్చటం
జిక్కెనొ రాక్షసాధములచేతికిఁ గ్రూరమృగంబు మ్రింగెనో
యక్కట! దైవమా! యడవులందున నున్నను నోర్వకుందువే.

♦♦♦ శ్రీరామ లక్ష్మణులరణ్యమున సీతను వెదకుట. ♦♦♦

వ॥ అనుచు విలపించుచు నత్యంతశోక సాగరనిమగ్న హృదయుండగు ననుజుండు వెంటరా నాశ్రమంబున నిలువనొల్లక రామచంద్రుండు. 151

ఉ॥ చూచును మోరయెత్తి తనచూపునకందిన మేరలోపలన్
సూచనలేమొ కాంచినటు సూటిగనేఁగును, సుందరీ! యనున్
నాచిగురాకుఁ బోఁడి గహనంబున నెచ్చటఁగాంచియున్న నా
చూచిన జాడలం దెలిపి చూపరె జానకి, మీకు మ్రొక్కెదన్.

సీ॥ సహకారమా! నాదు సహధర్మచారిణిఁ
గనుఁగొంటివే యింపుఁ గంబుకంఠిఁ,
బున్నాగమా! నాదుపూఁబోఁడిఁ గనుఁగొంటె

వకుళమా! చూచితే వనజయన
హంసరాజమ! నాదుహంస యాననుఁగంటె
కీరమా! కనుఁగొంటె కీరవాణిఁ,
జక్రవాకమ! కంటె చక్రవాకస్తని
శారిక! చూచితే చంద్రవదన.

తే॥ ననుచు నున్మత్తు పగిదిని నడలు హెచ్చ
దారిపొడవున నడుగుచు దక్షిణాభి
ముఖుఁడు రాముఁడు నడచుచు ముందుగనియె
రెక్కలూడి తపించు బల్పక్కి నొకటి. 153

చ॥ విఱిఁగిన తేరదొక్కయెడ, వీడిన పక్షయుగంబు నొక్కచోఁ,
బరఁగఁగ, రక్తసిక్తమయి భాసిలుగాత్రము జాలిఁగొల్పఁగా
దురమొనరించి ఖడ్గనిహతుండయి ప్రాణముఁజిక్కఁబట్టి యా
తురత జటాయువప్డు రణధుర్యుని రామునిఁగాంచి యిట్లనెన్.

ఉ॥ "శ్రీరఘురామ! నీసుదతి సీతను రావణధూర్తు వంచనం
దేరునఁగొంచుఁబోవ, విని నేను విలాపము, సీతకై వెసం
బోరితిఁగాని యీగతిని భూమిపయింబడఁ ద్రోసియేగె" నం
చారఘుపుంగవుందలఁచు చప్పుడె ప్రాణమువీడె ముక్తుఁడై .155

ఉ॥ "తాఁకిన వ్రేలికే మరల తాఁకుచునుండును' నన్నమాడ్కిన
ట్లాఁకలఁ బెట్టఁగాఁ దొడఁగె నాపదలొక్కటిపైన నొక్కటై
ప్రాకట రాజ్యవైభవముఁబాసి యరణ్యము సొచ్చియుండుటే
కాక విదేహరాజసుతకై విలపింపఁగ నిద్దిచేకుఱెన్. 156

ఉ॥ ఈతఁడు తాత మిత్రుఁడగు నీతఁడు భక్తుఁడు పుణ్యమూర్తి, నా

సీతకునై యెదుర్చి, మదిఁజేర్చి తొలంగెను మేనినిట్లు వి
ఖ్యాతిగ లక్ష్మణా! సలుపఁగాఁదగు సంస్కరణంబులంచు, వి
ఖ్యాతత సంస్క్రియల్సలిపెఁ దంద్రికి దుర్లభమైనవాసినిన్. 157

తే॥ పక్షియయ్యును భక్తి తాత్పర్యమునను
రామచరణాంబుజ ధ్యానరతుఁడునగుట
నరిగెముక్తికి, నేజాతియైననేమి?
భక్తి యొక్కటె చాలదే ముక్తిఁబడయ?. 158

తే॥ అంత దక్షిణదిశఁబట్టి యరుగుచున్న
యెడనయోముఖి రక్కసి యొడలుదిరుగ
లక్ష్మణుంజేరి చూపదుర్లక్షణముల
శూర్పణఖవలెఁ గావించె నేర్పుమెఱయ. 159

తే॥ క్రౌంచవన మార్గమునవారు కదలునంత
స్థూలశిరసమునీంద్రుచేఁ దూలియున్న
భుజగ బాహుకబంధుండు పొదివిపట్టె
వారు తెగవేసి రాతని బాహుయుగము. 160

ఉ॥ అంతఁ గబంధుఁడా దశరథాత్మజుఁ గన్గొని, యూరుపేరులన్
సంతసమంది, స్వీయము, నసచ్చరితంబునుదెల్పి, తన్ను నా
వంతతొలంగఁ గాల్చుమన, వారును నట్లులచేయ, నప్పుడే
వింతగనిల్చి యిట్లనియె వేడుక రాముని మోముఁగాంచుచున్

చ॥ "సరగున రామచంద్ర! కృప శాపవిముక్తుఁడనైతి, నింక నీ
వరుగుము తూర్పుగా శబరియాశ్రమమున్నది, యందుమీఁదటం
గిరివరమృశ్యమూకమటఁ గ్రిందివనంబునఁ బంపపొల్చు, ని

వ్వరుసనుబోయి చిత్తమునఁబాయుము తాపము, కార్యసిద్ధియా
ఉ॥ చేవతొలంగి వాలికయి చిత్తము లుత్తలపాటుఁజెంద సు
గ్రీవుఁడు, వాని మంత్రులును రేవగ లొక్కటబుష్యమూకమన్
గ్రావమునందుఁ గొల్చెదరు కాంచుమువారిని సఖ్యమేర్పడం
గా, వినుగార్యసిద్ధియగుఁ, గౌతుకమొప్పును జిత్తమందునన్”.

క॥ అని పలికి కబంధుండును
జనియెను సురపురికిఁదనదు స్థానముఁజేరన్
జనిరతఁడు చెప్పుచొప్పునఁ
జనిచని వనమందుఁగనిరి శబరినెదురుగన్. 164

—♦♦♦ శ్రీరాముఁడు శబరికి ముక్తినొసంగుట. ♦♦♦—

చ॥ ఎదురుగవచ్చి యాశబరియింపుదలిర్పఁగ రామచంద్ర! నీ
పదసరసీజముల్గొలుచు భాగ్యముగల్గుట ధన్యనైతి, నిన్,
సదమల తాపసుల్పొగడఁ జాతకమట్లుల కాచియుంటి, నేఁ
డొదవెను నీలనీరద సభోజ్జ్వలరూపముఁ గాంచుభాగ్యమున్.

ఉ॥ స్వాగతముంబొసంగుత, సపర్యనుగైకొని బ్రోవుమయ్య! య
భ్యాగతివీవే, మదాశ్రమము పావనమై పొలుపొందె రామ! నా
యోగము పూర్ణమయ్యె” నని యుజ్జ్వల రుచ్యఫలంబులన్నమ
భ్యాగత పూజలందనిపి యాశబరీసతియోగ ముక్తయై. 166

వ॥ అంత నాభక్తముక్తి సంధాయకుండగు రామచంద్రుండయ్యాశ్రమ
ప్రభావంబు ననుజునకు వర్ణించుచుఁ గార్యాంతర నిమగ్న చిత్తుం
డగుట నందు నిలువఁజాలక ముందునకునడచి, పంపాసరోవర
ప్రాంతంబుఁ బ్రవేశించి, యందలి వనరామణీయకంబునకు మనం

బు కలంగ జానకిం దలంచి విలపించుచు లక్ష్మణున కిట్లనియె. 167

చ॥ "కలకల నాదముల్చెలంగ క్రమతనుద్యతు లొప్పమీఱఁ, గో
కిల శుకశారికల్ మృదుల గీతులు పాడఁగ, లాస్యమాడనె
మ్మలు తమపింఛ ముత్తెఱచి, మూర్ధమునందుఁ బ్రసూనవర్ష
ముల్
లలి వనదేవతాంగనలు రాల్చెడి సొంపునుగంటె లక్ష్మణా!. 168

చ॥ కనుము పులుంగుజోడు తమకంబున ముచ్చట తీఱఁబొల్చు, ని
వ్వనచరకోటియెల్ల సుఖభాజనమై పొలుపొందుచుండు, న
వ్వనజ దళాక్షిసీతఁ బెడఁబాపి వెతల్గొన బ్రాసెనక్కటా!
వనజభవుండు దాశరథి! వానికిఁ జిత్తము లేదొయేమొకో". 169

చ॥ అని విలపించుచుండఁ దన యన్నమనంబు గ్రహించువాఁడు, గా
వున నిటువల్కె నాతనికిఁ "బూజ్యుఁడ! సూర్యకుమారు సఖ్య
ముం
గొనికద కార్యసిద్ధి మనకుంగను మల్లదె ఋశ్యమూకమం"
చనునయ మొప్పఁబల్కి వినయంబునఁ దోడ్కొని యేగముం
దఱఁ. 170

చ॥ కాంచన గోపుర ప్రకరకాంతి విభాసిత శృంగసంగిలా
సాంచిత కిన్నరీకముఁ, బ్రసన్నమునీంద్ర ముఖోద్గతాగమ
ప్రాంచదు పాంతవేదికము, యాగ సమర్చిత దేవలోకముం
గాంచిరి కామనీయక వికాసివనౌకము ఋశ్యమూకముఁ. 171

సుగంధి:—సామగాన భూషితా! ప్రశాంతమౌని పూజితా!
రామనామ విశ్రుతా! విరాధహానన హర్షితా!

కామలోభవర్జితా! ప్రకామ సద్గుణోన్నతా!
శ్రీమనోనురంజితా! నిలింపకోటి వర్ణితా! 172

గద్యము:=ఇది భారద్వాజ గోత్ర పవిత్ర, ఆపస్తంబసూత్ర, రాఘవాచార్య ద్వితీయతనూజ, శ్రీరామచంద్ర కరుణాకటాక్షలబ్ధ కవితావిస్ఫురణ, కాందూరు నరసింహాచార్య ప్రణీతంబైన రామ రాజ్యంబను మహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.

సంపూర్ణము.





—: శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః :—

# ★ రామ రాజ్యము. ★

## (చతుర్థాశ్వాసము.)



శా॥ శ్రీమన్మంగళమూర్తి శోభితు, లసచ్ఛీలుం, బవిత్రాత్మసు
స్థేము న్నిర్మలనీతి విస్ఫురితబుద్ధిన్ సజ్జనప్రేమ స
ద్ధాము న్నిర్జర వైరి రాక్షస విఘాతప్రస్ఫురన్నామము, శ్రీ
రాముం గొల్చెదఁ గార్యసిద్ధికయి రారాజన్ముఖాంభోరుహున్. 1

### —♦♦ వసంత వర్ణనము. ♦♦—

సీ॥ తరులతాగుల్మముల్ తళతళలాడంగఁ
జిగురింపరాగంబు చెన్నుమీఱఁ
బథికాంతరంగ ముల్పరికింతమనియెంచి
కోకిలారావముల్ కూర్మిఁ బెనుపఁ
జిలుకలగముల బల్కులకిలల్ కొమరొప్ప
శుభసమయంబను సొబగుఁ దెలుప
జతఁగొని పులుఁగులు చతురవిలాసము
ల్పచరింప, వనమెల్ల లలిఁ దలిర్పఁ.

తే॥ బరగెనామని, యంతనాపంప చెంత
నరుగు రాముని మానస మడలుకొనఁగ
నిలుపుకొనలేక వేగంబుఁ గలఁతఁజెందెఁ
బ్రకృతి విడుచునె యెంతటిసుకృతికైన. 2

ఉ॥ ఔషధమార్థియందు, ననయంబును నెచ్చెలి కేలియందు, స
ద్భాషిణి మంత్రయుక్తిఁ, గలభాషిణియార్తిని, ధర్మపత్నిశు
శ్రూషల దేవభూసుర విశుద్ధసపర్యల, క్షత్రియాణియా
భీషణయుద్ధమందు, నటవీస్థలిజానకి నాకు లేదుగా. 3

చ॥ మలయగిరీంద్ర సంచలిత మారుత గంధగజంబు, మన్మథో
చ్ఛలితము శాటసారుల వెసన్మథియించుచు, శైత్యమాంద్యము
ల్పొల యనువాసనల్మదముఁ బూన్పఁగ నాపయివ ప్రక్రీడకుం
దలపడుచుండె నేనెటులు తాళుదు జానకి! తోడుసూపవే. 4

చ॥ అని పయికొన్న దుఃఖమున నన్నమునుంగుటఁగాంచి లక్ష్మణుం
డనునయభాషణంబుల నయంబున ధైర్యముపోసి, కాననం
బునఁ జనుచుండ వారిఁగని "మూర్ఖుఁడు వాలిననున్వధింపఁగాఁ
బని పెనటంచు" భానుజుఁడ హార్యము నంబరు వెత్తెభీతిచే. 5

చ॥ అతనియమాత్యులందఱును నాతని వెన్కనయేగి, యొక్కచోఁ
జతికిలఁ గూరుచున్న ప్రభుసంకట పాటు నెఱుంగ వేఁడఁగా
నతఁడు వడంకుచుంబలికె "నయ్యధముండగు వాలి నాపయిం
బతితుఁడు క్రోధమూని యనుపంజను దెంచెడి వారిఁగంటిరే?. 6

ఉ॥ ధీరులు సజ్యకార్ముకులు దిట్టలుయోగి సదృక్షరూపుల
వ్వారలఁ గాంచునంత "ననువంచన నుక్కడఁగింపఁబూని నాఁ

డారయవాలి” యంచుమదిక త్రైఱఁగొప్పఁగ భీతిచేనిటం
బాఱితి, మీరు కన్గొనుఁడు వాలకమంతయు నట్లతోఁచెడున్.

చ॥ అనుటయుఁ బాఱఁజూచి భయమంది యమాత్యులు చెట్టులెక్కఁ గు
ఱ్ఱున గుఱుకొంచుఁ గొమ్మలను లోలత బిఱ్ఱుగ నూపుచుండటా
లునఁ గిచకీచుమంచు, బెదురుం గనుపర్చుచుఁగొమ్మకొమ్మకుం
గొనకొని దాఁటుచుం బలిమిగొమ్మల విర్చుచుఁజూపలమ్మొనన్.

చ॥ నిలుకడలేని చెన్గుముల నిక్కికనుంగొని సంభ్రమించుచుం
బిలపిల కీచుకీచుమని పిల్చుచు నొండొరుఁగూడి యొక్కచో
మలయుచునుండనప్డు హనుమంతుఁడు వారక తేఱిచూచితాఁ
బలికెను వారికిట్లు “తగువారమ యందఱమంచు” నవ్వుచున్. 9

చ॥ “విడిచి మనంబులన్భయము వేగిరపాటుతొఱంగి చూడుఁడ
య్యెడను వినీతవేషులయి, యిద్ధశరాసన పాణులొచు, ని
య్యెడకరుదెంచువారు పరికింపఁగఁ గ్రూరులుకారు, వాలియుం
దుడుకుతనంబుఁ జూపఁడికఁ, దొందఱపాటులు చెల్లునేధరన్.

చ॥ కడువడినేగి నేనిపుడ కన్గొనివచ్చెద వారిమానసం,
బడలఁగనేల మీరు, సుఖమందుఁడు, సేఁగిఁదలంపఁబోలునే
వడిగల వారికంచుఁ”, దగఁబల్కుచు వెంటనె భిక్షుకుండుగా
నడరుచునేగె వారికడకయ్యని లాత్మజుఁడొక్క వ్రేల్మిడిన్. 11

ఆంజనేయుఁడు రామ లక్ష్మణులందెచ్చి సుగ్రీవునితో సఖ్యంబు గూర్చుట.

ఉ॥ ఏగి వచించెనిట్టు “వసుధేశ్వర పుత్రకులట్టులుందు, రి

ద్యోగ నిరూఢరూపముల యుద్యమమెయ్యది? యూరుపేరులు
ద్యోగములెవ్వియో, తమమృదూక్తులఁ దెల్పుమటంచు వేఁడ నా
వేగము ప్రోత్సహించెడిని, వేడ్కవిసంగను దెల్పువారలే''?. 12

వ॥ అంత రామ చంద్రుండు సౌమిత్రిను పలక్షించి తెల్పుమనిన నా
తండిట్లనియె. 13

సీ॥ "దశరథభూజాని తనయులమయ్య! యీ
తఁడు రామభద్రుండు తతయశుండు
పరగజ్యేష్ఠుఁడు ధర్మ పరతంత్రుఁడురుతర
కరుణాపరుండు నిష్కపటమూర్తి
యతని తమ్ముని నన్ను నరయుము లక్ష్మణు
దాసుఁడనై యెప్డు తవిలియుండుఁ
దండ్రియాజ్ఞను, గానఁ దపమొనరింప నీ
తని పత్ని నెవఁడో సీతను హరించి.

తే॥ కొంచుఁబోయిన నాతని కొఱకు నెదకు
కొనుచు రాఁగఁగబంధుండు వినిచెనిట్లు
"రావణుఁడు కొంచుఁబోయెను రామ! నీదు
పత్ని సీతను నాకెను బడయుకొఱకు. 14

తే॥ ఋశ్యమూకంబునందు సుగ్రీవుఁడుండు
నతని సఖ్యంబుచే నీవు సతినిఁగందు''
వనుచుఁదెల్పిన వచ్చితి మతనిఁజేర''
నని వచించుచు వెండియుననియెనిట్లు. 15

ఉ॥ ''శ్రీవిలసిల్లు వాఁడగుచుఁ జేతనవర్గముఁ బ్రోవఁజాలి యి

ష్టీవగఁ గర్మబద్ధుఁడయి యీతఁడు భార్యను గోలుపోయి, సు
గ్రీవుని వానరుంగొలువఁ గ్రించుఁదనంబును నెంచకుందురే
దైవము పోకడల్దలఁపఁ దద్దయుగుండెలు బ్రద్దలౌకటా!! 16

చ॥ అని తలపోయు లక్ష్మణుని యాననముల్ రఘురాముమోమునుం
గనుఁగొని యంజనీసుతుఁడెగాదిగఁ గాంచుచు దివ్యమూర్తి నే
మని తలపోసెనో "రఘుకులాబ్ధి సుధాకర!" యంచు రామునిన్
వినయముతో నుతించుచుఁ బవిత్రమునామము సంస్మరించుచున్.

ఉ॥ భాసురమూర్తిఁగన్గొని ప్రపంచమునంతయు విస్మరించి, క
న్మూసి "పరాత్పరా!" యనుచు ముచ్చెమటల్దిగ జాఱనిల్చె,నా
యాసమొ, భక్తి తత్పరత నందుటొ, రామమయాత్ముఁడౌటచే,
నాసమవాయ మాత్మగతమన్యుల కెవ్విధిఁదోఁచునచ్చమై. 18

వ॥ అట్లు హనుమంతుండు క్షణకాలంబ ప్రాకృతాత్మ విస్ఫురణ సం
జాత కుతూహలుండై. 19

మనోహరము॥ "రామ రామ! సుగుణధామ! రమ్యవామ! శ్రీధరా!
శ్రీమనోజ్ఞ! ఖలవిరామ! చిద్విలాసబ్రోవరా!
సామగాన వినుతనామ! సజ్జనార్తి తారకా!
రామ! రామ! విజితకామ! రామ రాజ్యపోషకా!"

వ॥ అని యిట్లు అనేక ప్రకారంబులస్తుతియించుచుఁ గొంత వడికిఁ
బ్రాకృత స్వభావుండై నిజరూపంబున నిలిచి యిట్లనియె. 21

సీ॥ అంజనీ తనయుండ హనుమంతుఁడనువాఁడ
సుగ్రీవ సచివుండ శోభనాంగ!
బల్మిఁబత్నినిఁగొంచు వాలి సుగ్రీవునిఁ

దఱుమనాతఁడమాత్యవరులుగొలువ
శాపయుక్తుఁడు వాలి చకితుఁడై తరియంగ
వెఱచుట నీధరాధరముఁజేరి
చరియించు వాఁడౌచు దరిఁజేరవచ్చిన
మిముఁగాంచి శ్రీరామ! మేనువడఁక.

తే॥ నతఁడు పంపఁగవచ్చితి నరయమిమ్ము
రామ! శ్రీరామ! కరుణాబ్ధిసోమ! రమ్ము
సఖ్యమొనరింతుఁ, బ్రభువు నీసతినిఁదెచ్చు''
ననుచు భుజమున మోయుచుఁ జనియెనతఁడు, 22

చ॥ చనియొక చోటనుంచి సహజన్ములఁ, వేగమె సూర్యపుత్రునిం
గొని చనుదెంచి సఖ్యమునకుం దగునట్టుల మాటలాడి, య
య్యనఘుల హస్తములలిపి, యగ్నినిసాక్షిగఁగాంచు, నప్పుడ
య్యనఘులు లిద్దఱుం గలిపెనెంతయు సఖ్యమువృద్ధినందఁగన్. 23

తే॥ మొనసి సమవర్తియైన రామునకుఁజెలిమి
లీలవైవస్వతుండు సుగ్రీవునకును,
బరగ, వైవస్వతుఁడు సమవర్తికంత
వేగవాలినిఁ గూర్పంగ విధితలంచె. 24

తే॥ చెలిమి యెసఁగంగ "వాలినిఁజెండి నీకు
రాజ్య రమఁగూర్తునమ్ముము ప్రాజ్యముగను,''
ననుచు సీతావియోగంబు నాత్మఁదలఁచి
వేఁగు రామునిఁగాంచి సుగ్రీవుఁడపుడు. 25

తే॥ రావణుఁడు కొంచుఁబోవంగ రథమునుండి

క్రిందవిడిచిన సొమ్ములముందు బెట్టి
వానిఁగనుఁగొన్న యంతనెవగచి యతఁడు
సలిపె బాష్పాంబువులను బ్రక్షాళనంబు. 26

ఉ॥ సీతనుకాంతి సోఁక ధరణీసుత! వెల్గెడినట్టిభూషణ
వ్రాతము కాంతి హీనమయి పాఁచిమొగంబును బోలెనుండె, నే
హేతువొ పాటువైవ, బ్రతుకేలయటంచు జుగుప్సచెందితో
సీత! వియోగదావమునఁ జిక్కితిఁ గావఁగ శక్తులెవ్వరే. 27

ఉ॥ నీరజలోచనాయత వినిర్మలదృష్టి ప్రసారమింపు సొం
పారఁగఁ గూర్పవేని, మనసారఁగఁ గౌఁగిలిచేర్పవేని, నా
భారమునేఁటితోఁ దొలఁగుభామిని కావఁగరమ్మువేగ, నా
హా! రఘురాముఁడింత వెడఁగయ్యెనె? లోకముచూచియేమనున్

ఉ॥ పావన భాస్కరాన్వయపుఁ బట్టికథీరత పుట్టరాదు, సు
గ్రీవ! వచింపు రావణుని గీవణునిందెగఁ ద్రుంచివైతు, నే
త్రోవనుబోయె? నేమనుచుఁ దొయ్యలివాకొనె? దుర్మదాంధుఁడౌ
రావణుఁజంపి కాకులకు గ్రద్దలకీడ్వక నిల్వనేర్తునే?. 29

ఉ॥ అక్కట! మోసపోతి నడియాసలఁజిక్కితి, భాగ్యలక్ష్మి యిం
కెక్కడనుండుఁ, బ్రాణముల నెన్నఁడొ వీడె హతాశయాచు, నే
నొక్కఁడ జాఁతిగుండె సయియుంటి దురాశుఁడ, దుర్నయుండ" నం
చక్కజమైన తాపమున, హా! సతి! జానకి! యంచు భ్రాంతిచేఁ.

ఉ॥ వచ్చితె జానకీ! ప్రియుఁడువందురిలంగను జూతువేల? నీ
యిచ్చకు నచ్చునమ్మొకము నిచ్చెదఁ, గోపము వచ్చెనేమొ, హా

మచ్చరి రావణాధముని మాయలు వాపక యున్నలోకముఁ
మెచ్చునె నన్ను, నిత్యమయినిల్చునె సుస్థిర రామరాజ్యముఁ.

ఉ॥ పిచ్చియొ, భ్రాంతిజల్పితమొ, ప్రేలుచు నుంటినెకాని యిచ్చమై
ముచ్చటఁదీర్చునా చెలువమో మొక యించుక కాననైతి నే
నెచ్చటికేగువాఁడ, దయనీయుఁడ, రాఁగదె ప్రోవరాదె, యం
చచ్చపు మోహముగ్ధుఁడయి హా! యని కుత్తుకనెత్తి యేడ్చెనఁ

తే॥ అపుడు లక్ష్మణుఁడన్నకు నంచితముగ
"వీరపురుషుఁడ! ధైర్యంబు వీడఁదగునె"
యనుచుఁదెలుపుచు నిలువ రాముని మొగంబుఁ
గనుచు ముదమొప్ప సుగ్రీవుఁడనియెనిట్లు. 33

చ॥ "వనరఁగనేల రామ! రఘువంశ కులాంబుధిసోమ! నీసతిం
గనుఁగొని యెందునున్నఁగడఁకం గొని వత్తురు వానరోత్తముల్
పనిపెద దిక్కుదిక్కుల కవారిత వీర్యబలాతిరేకులఁ
వినుము మదీయ వాక్యముల, వీడుము జానకిఁగూర్చి శోకముఁ

వ॥ అంత రామచంద్రుండు బలాన్నిరుద్ధశోక సంతాపుండై వాలి తోడఁ దనకుంగల విరోధకారణంబు వివరింపుమనిన సుగ్రీవుండు దీనాననుండై యిట్లనియె. 35

సీ॥ మహితాత్మ! రాఘవ! మాయావిదానవుం
డోకనాఁడు వాలిపై నుత్సహించి
యుద్ధంబునకుఁబిల్వ నుద్ధతుండగుచు నా
తఁడు పోరు సల్పఁగాఁ దాళలేక
యొకబిలంబును దూఱి యురగలోకముసేర

వాలి యాతనివెంట వడిగనేగి
రాకుండఁ దడయుట రక్తప్రవాహంబుఁ
గాంచి హతుండు గానెంచి యపుడు.

తే॥ బిలము శిలమూసి, పురిఁజేరి, పేర్మినన్ను
రాజు నొనరింప మంత్రులు తేజమీఱఁ
బాలనము సేయుచుండంగ, వచ్చి యతఁడు
పురము వెడలంగఁదఱిమె నాపాలఁతిఁగొనుచు. 36

తే॥ తప్పునాయెడ లేదని చెప్పుకొంటిఁ
గాని మూర్ఖుఁడు క్రుద్ధుండుగాన నతఁడు
వినఁడు నామాటఁ దనపట్టు వీడఁడఃట!
నిలిచి యిచ్చటఁ బ్రాణముల్నిలుపుకొంటి. 37

చ॥ అతఁడిట రాఁగఁ దావెఱచునయ్య! మతంగమహర్షి చెంతక
త్యతుల లులాయకాయమున నంచితు దుందుభిఁజంపివైవన
య్యతివరుఁడు గ్రుఁడ్డొచ్చు, దురహంకృతి వాయశపించెఁగాన,దు
ష్టత మెయికొన్నవాఁడగుటఁ జంపఁగఁజూచును నందుచిక్కనన్

చ॥ కనుకనె మిమ్ముఁగన్గొనుచుఁ గాతరచిత్తుఁడనై వడంక, ని
వ్వన చరమూర్తి శూరుఁడు ప్రభంజన సూనుఁడు తేర్చి మీగుణం
బును గొనియాడి, చేర్చి, సుఖముంబొనరించె, ముదంబుచేకుఱెఁ
వినతుఁడఁదీర్పఁ దాపములవేఁడెద రాఘవ! చిత్తగింపవే? 39

వ॥ అంత శ్రీరామమూర్తి సుగ్రీవుంగాంచి యిట్లనియె. 40

ఉ॥ "వాలి మహాంధు దుర్ణయుని వారకచంపుదు, రాజ్యభారమున్

శ్రీలడరంగ నీభుజముఁ జేర్చెద, నమ్ముము నాదువాక్కు, నీ
వాలినిఁగూడి పేర్చెదవు, న్యాయపథంబునువీడి దుష్టుఁడై
లోలత ధర్మసౌఖ్యములరూపఱఁజేసిన నోర్వవచ్చునే?. 41

ఉ॥ నీవిఁకఁ జింతఁబాసి మదినిశ్చలతందనరంగవచ్చు సు
గ్రీవ!" యటంచుఁ గాల్బొటన వ్రేలను మీటఁగ దుందుభిన్మహా
గ్రావముపోలెఁ బై కెగసిగ్రావము నవ్వలఁగూలె, నంతటం
భావమునందుఁ దృష్టిఁ గొలుపంగను వాఁడి శిలీముఖమ్మునన్.

చ॥ గుఱిగొని తీవ్రవేగమునఁ గొట్టఁగ నొక్కటనేడుసాలముల్
ధరఁబడిపోయె, బాణమది తద్దయునవ్వలి కొండఁగూల్చినం
దరుచరనాథుఁడప్పుడు ముదంబును బొందుచు రామునాజ్ఞ సు
స్థిరతరబుద్ధియై యరిగె దిట్టతనంబున వాలిమీఁదికిన్. 43

తే॥ వాలి సుగ్రీవులిరువురు పౌరుషమునఁ
బోరుచుండంగ రాముఁడు పొంచియుండెఁ
గాని గుఱుతొక్క యింతయుఁగానకుంట
నూరకుండెను, సుగ్రీవుఁడోర్వసడలి. 44

తే॥ పాఱివచ్చుచు "శ్రీరామ! భంగపడితి
నింతసేతువటంచును నెంచనైతిఁ
గుడిచికూర్చుండి యుండక కోరిచెడితి
నమ్మువారలఁజెఱుచుట న్యాయ్యమగునె?. 45

వ॥ అనివగర్చుచు వగచి వగచి దీనాననుండై తలవాంచి చింతించు
చున్న సుగ్రీవుంజూచి రామభద్రుండు. 46

చ॥ "చెదరకుమయ్య! నేగుఱుతు చిక్కకయుంటిని నంతెకాని, యే

బెదురునులేదు, నీమెడనువేయుదు హారముగుర్తుపట్ట, ని
య్యదనునఁబొమ్ము వాలిపయికంచు" వచింపఁగ, రామునాజ్ఞస
మ్మదమునఁబోయి పోరఁబొదమాటుననుండి వధించె వాలిని౯.

—: వాలి రామబాణహతుండై రామునిం దూలనాడుట. :—

ఉ॥ అప్పుడు వాలినేలపయినార్చుచు వ్రాలితపించెనిట్లు "నీ
చెప్పినయట్లె తార! విధిచెయ్దము దాఁటనశక్యమయ్యె, నే
చొప్పున నంగదు౯ సుతునిఁజూచెదొ, యెంతటి శౌర్యశాలికిం
దప్పుకొనంగరాదుగద! దైవము గీచినగీటు దాఁటఁగ౯. 48

మ॥ పుడమింగూల్చెను నెవ్వఁడో యధముఁడొప్పంజొప్పఁ
బాటింపకా
గడముల్బుద్ధికిఁ దోఁచవొక్కొ, యవురాకాల ప్రభావంబు, తుం
దుడుకుల్వాలినిఁ జెందెనన్న మదికిందోఁచుంగదే "తాడిఁద
న్నెడు వాఁడే౯ దలఁదన్నువాఁడుగలఁడం"చెంచంగ నౌనా
నుడుల్. 49

ఉ॥ ధీరుఁడవైన మూర్ఖ! వినుతింపఁగనిల్చి, యెదుర్చి, పోరదు
ర్వార పరాక్రమంబడర బాహుబలంబును జూపరాదె? దు
ర్వీరుఁడ వౌచునిట్లు తరువీథులచాటున దాఁగనేల? ని౯
దూఱఁగ మానవుల్దరణి దొంగతనంబునఁ జంపనేటికి౯. 50

చ॥ అడలను నేను జావునకు, నంగదపుత్రుఁడు చిన్నవాఁడటం
చుడుకుదు సంతెకాని, ప్రియమొప్పఁగఁ బెంచినవాఁడుగాన, నే
యెడరున కోర్వలేఁడు, తగవెంతయుఁగల్గెడువాఁడు నట్టియా
కొడుకునుబాసి యెట్లుమదికుందుఁ దొలంగుదుఁ బాపిదైవమా!.

వ॥ అని యనేక ప్రకారంబుల విధి విధానంబునకు వగచుచున్న వాలి కడకు శ్రీరామచంద్రుండరుగుదెంచిన నతని మొగంబుఁ జూచి యిట్లనియె. 52

ఉ॥ రాముఁడు సజ్జనుండు, జనరంజకుఁడుత్తమ ధార్మికుండు ని
న్నీమ గుణాభిరాముఁడని చెప్పఁగ వింటినిఁ దెల్లమయ్యె, ని
న్నీమహియెల్లఁ బేరుకొన నిట్లనిమిత్తమనన్నుఁ గూల్చుటల్
రామ! తలంతు నిట్టులనె రంజిలునంచెద నీదురాజ్యముల్. 53

ఉ॥ పోరుట యన్నదమ్ములకుఁ బొత్తుననుండుట పాడియౌను, న
వ్వారల పోరుకొల్పి, తగుపార్థివ లక్షణ లక్షితుండవై
కారణమేమిలేక, యవుఁగాదని తెల్పక, ధర్మమౌనె, య
వ్వారల నొక్కసిందునుము, వాఁడొనరించిన నేరమెట్టిదో?. 54

చ॥ పనిచిన నెట్టికార్యముసపాయముతో కొనరించియుందు, నా
ఘనతర బాహువీర్యమును గన్గొనియుండదె లోకమెల్ల? న
య్యనఘుల సార్వభౌములకు నిట్టియధర్మము చెల్లునెట్టులం
చనయము దూఱుచుండ విని యారఘురాముఁడు వాలికిట్లనెన్.

చ॥ "సుజనులు పోలె దుర్జనులు చూపునకొప్పుచు దుష్టబుద్ధులై
గజిబిజిపర్చి సాధువుల గందరగోళ మొనర్చుచుండ, ది
గ్విజయముచేసి దుష్టులను గీటడఁగించుటపాడి, యంతదాఁ
కజగమునందు నెవ్విధి సుఖంబులు ధర్మమువృద్ధిఁగాంచెడున్.

చ॥ అదిగద రామరాజ్యమగు నార్యులకిచ్చుట ధర్మసౌఖ్యముల్
పొదలును, నెందుసజ్జనులు పూజ్యులు; సంపదలెందుఁబొల్చు, నే
కొదవలులేక భూజనులు కోరిభజింతురు ధర్మమార్గమి

వ్విధముగ దుష్టసంతతుల వేఁచక యెవ్విధి ధర్మరాజ్యమా. 57

ఉ॥ నీవొక ధర్మమార్గమును నేర్పెడువాఁడవె, తమ్ముఁడైన సు
గ్రీవుని భార్యఁబట్టుకొని, కీడుతలంచుచు వేగనాతనిన్
బావులు చెట్టుగుట్టలకుఁ బాఱఁగఁదోలుట ధర్మమో? నీ
భూవలయంబుఁ బ్రోచుటకు భూపతికొప్పదె దుష్టుఁజంపఁగన్. 58

ఉ॥ ధర్మముఁ జక్కనిల్పుట, యధర్మమడంచుట రాజధర్మమా
నిర్మలచిత్తుఁడైన ధరణీపతినెట్టులఁ జెందనేర్చు దు
ష్కర్ముల రాజదూషకులఁ జంపిన పాపము, మూఢ! విన్మ నీ
కర్మమె నిన్నుఁగూల్చె, ననఁగాననునిందితుఁజేయఁబాడియే?. 59

ఉ॥ నిన్నెదురించి పోరనగు నిర్ణయమున్నదె? దుష్ట సత్త్వముల్
గ్రన్ననమాటునెట్టిగద కాలురు, దుష్టమృగంబవై ననిన్
సన్నుతిసేయ సజ్జనులు చంపితిఁ జాటుననుండి నేను, నీ
పున్నెముమంచిదయ్యె నఘపుంజము వీడితి రాజుశిక్షచేన్". 60

మ॥ అనుచుందెల్పిన వాలి రాము ముఖమత్యానంద పూర్ణాక్షులం
గనుచుంబల్కెను "రామ! బాణహతి సన్నాథంబుగా నొంపనిన్
గనుఁగోఁజాలక తప్పు పట్టితిననున్గావంగ మన్నింపు" మం
చనుచుంజేతులు మోడ్చిమ్రొక్కె రఘువీరా! యంచుఁ బ్రా
ర్థించుచున్. 61

తే॥ అంతలోనన కిష్కింధకరిగె వార్త
సరగఁ దారయునంగదుండరుగుదెంచి
నేలపై వ్రాలియున్న యావ్వాలిపైన
వ్రాలి విలపింపఁ దొడఁగిరి జాలిఁగొలుప. 62

వ॥ అంత సంతతాశ్రు నిష్యందకలుషిత తరతారయగు తార ప్రియును
త్తమాంగంబుఁ దనయంక తలంబున నిడుకొని, వింటికొప్పునఁ
గేలూని చెంత నిలిచియున్న రామునింగాంచి యిట్లనియె. 63

తే॥ "రామ! చల్లని నీదయారసమదెల్లఁ
బాఱిపోయెనె నా పాప ఫలముచేత?
శీతకరుఁడుష్ణకరుఁడౌచుఁ జేతనాళి
మాడ్చుచుండుటఁ గందుమే మనుజనాథ!. 64

ఉ॥ ధర్మమునిల్పి నీవు కడుధన్యుఁడవౌటకు నెంచెదేని, దు
ష్కర్ములనెల్లఁ గూల్చుటయ,కార్యము,నేఁబ్రియుఁబాసినిల్చుదు
ష్కర్మను, నన్నుఁగూల్చి ప్రియుసంగతిఁజేరిచి నిల్పుమయ్య! నీ
ధర్మము రామచంద్ర! యిలఁదాటకహారక! శ్రేయమయ్యెడిన్.

చ॥ మృగయునకున్నె జాలి? పుడమిన్ మృగరూపిణి నన్నుఁగూల్పఁగాఁ
దగవగు నీకు భూపతికిఁ, దాటకనే, ప్రథిత ప్రభావుఁడై
యగచర నాథుఁడై పొలుచునట్టిఁడు వాలినె, వజ్రమానసన్
జగమున రామచంద్ర! ననుఁజంపక నీవెటు ధన్యవయ్యెదో. 66

ఉ॥ చంపితి వాలినంచుఁ గదసంభృత చాపుఁడవైతిగాని, రా
ణింపుచునుండె నామదిని నిశ్చలుఁడై ప్రియుఁడొప్పమీఱ,యో
జింపరు రాజసూను లొకయించుక మాధ్యవిధానులౌట, నన్
జంపినఁగాని నీమదికి సంతస మబ్బదురామ! కంటివే. 67

ఉ॥ తిట్టఁగ లేదు నిన్నుఁ దరితీపులు చూపఁగలేదు నీపయిన్
బట్టి వధింపఁ గారణలవంబును లేకయ చెట్టుచాటునం
జెట్టిడుపోలెనిల్చి ప్రియుఁజెండితి విట్టిదె పౌరుషంబు? నా

యట్టుల నీవు నీప్రియకునై విలపించెదుగాక రాఘవా! 68

చ|| అని శపియించి రాఘవుని, నర్కజు మోమునఁ జూడ్కి నిల్పి యి
ట్లనియెను ''నగ్రజుం దునిమి యారడ మందితి వింక నేలుకో
మ్మనయము రాజ్యముం దారుమను, నంగదుఁ డొక్కఁడ నవ్యర్థుఁ డయ్యె, నే
ననుగమనంబు సల్పి ప్రియునంకముఁ బాయక యుల్లసిల్లెదన్. 69

వ|| అని వివిధభంగుల విలపించుచుఁ సహగమన పరాయత్త చిత్తయై యుండులకు గమకించుచుండ, నత్యంత శోకాకులిత మానసుండై యంగదుండు బాష్పాకులిత లోచనంబులఁ దల్లిదండ్రులవంకఁ జూచుచు నిశ్చేష్టుండై నిలిచియుండ నప్పుడు వాలి తారాసః శ్వాసాశ్వాసితుండై లబ్ధసంజ్ఞుండుంబోలె నున్మీలితాక్షుండగుచు ననేక హితవచన నివారిత పత్నీసహగమన ప్రయత్నుండయి, శోకావనతవదనుండగు సుగ్రీవునకుఁ గంఠహారంబు నొసంగి, యప్రమత్తుండవై రామాజ్ఞానుసారంబుగ రాజ్యంబుఁ బాలింపుమనుచు హితవుపదేశించి, యంగదుం జేరఁదీసి చేదోయినమర్చి శ్రీరామున కర్పించి రక్షింపుమనుచుఁ గన్నులుమూసి యసువులంబాసిన, వానరసహితుండై యతండగ్ని సంస్కారంబాదిగాఁగల యంత్యక్రియలనెల్ల నిర్వర్తింపఁజేసి యనంతరంబ. 70

చ|| సచివులు పౌరులెల్లరును సమ్మతిఁ దెల్పఁగ నర్కసూతికిన్
సుచరితుఁడైన రాఘవుఁడు సొంపుగఁ బట్టముఁ గట్టి, యంగదున్
బ్రచుర వినీతుఁ జేసి యువరాజుగ రాజ్యము నప్పగించి, తా

నచలము పాంతమందు వినయాన్వితు లక్ష్మణుఁగూడి యుం
డఁగఁ. 71

—♦♦ వర్షఋతు వర్ణనము. ♦♦—

ఉ॥ కర్షకలోకముల్ల సిలఁగా నుఱుముల్మెఱు ముల్చెడిల్లుమర్
ఘర్షణ నింగియూడి పయికప్పలఁగూల్చెడు భంగినార్భటుల్
ధర్షణసేయ నాకసముఁగ్రమ్మఁగ నంతట మేఘమాలికల్
వర్షపుఁ గాలముంబటు జవంబున వచ్చెను బ్రీతిఁగొల్పుచున్.72

సీ॥ గిరి శృంగములఁదాఁకి కరులువ్రకీడ
సలుపునట్టుల మేఘ సమితియడర
మిన్నుచిల్లులు వడ్డమెయిఁ దోఁపఁగార్మొగుల్
కురియధారావృష్టి తటిమి తటిమి
చలువలు పఱచిన చందమై యేఱులు
చెరువుకుంటలు నిండి పరువులిడఁగ
సస్యంబునకు మంచిసమయంబు మేలుకొం
డను విధంబునఁ గప్పలఱచుచుండఁ.

తే॥ గారుకొని కాననావళుల్ గ్రాలుచుండఁ
బచ్చికబయళ్లు కనుల పర్వంబుసేయ
నింతుసంపదఁపులఁదూఁగు దండిగృహిణి
పోలెనప్పుడు భూదేవి పొలుచుచుండె. 74

ఉ॥ చున్నచునుండి రొప్పగను, దున్నినభూముల విత్తుచుండిర
భ్యున్నతి కాముకుల్బువికి నుజ్జ్వల సస్యసమృద్ధి సాధకుల్
పన్నుగ రైతులత్తఱినిఁబాటు వడంగని మెంచిరెల్లరున్

"సన్నుతిసేయ భూమిగను సత్సుతులౌదురు వీరె" యంచెదన్.

చ॥ పొలుపుగఁ గాంచి కాంచి వడఁబోసిన వెండిద్రవంబునాఁగని
ర్మల జలపూరముల్గిరి శిరంబులనుండి ధరాతలంబునం
దొలయఁగఁబాఱ, శీకరసముల్లసదంచిత వాయుపోతముల్
పొలయు వియోగిచిత్తదవముల్ రగులించుచు దుర్భరంబుగన్.

ఉ॥ నెమ్మలకేక లుద్దవిడి నెమ్మలఁ రేప వియోగి చిత్తముల్
క్రమ్మపయోధరార్భటులఁ గంతుఁడు రేఁగి కదంబసూనవా
రమ్ముల నమ్ములంగొని సురాధిపువిల్గొని వెంబడింపఁగా
నిమ్మలులేక విల్వఁదపియించుచు దిక్కుఱి చొక్కుచుండెడున్.

వ॥ ఇట్టిధంబున వర్షాగమంబు శతమన్యు శరాసన శారతర తారా పథంబును, మేఘగర్జన ముఖరిత దిగంతకుహరంబును, నీపవన పవన సంచార నిరాడంబర కలహంస నికరంబును, శిలీంధ్రసం బంధ బంధుర వసుంధరంబును, వికచ కుటజకుసుమ నిచయకవచిత మహారణ్యంబును, నిరంతర ధారాపాత ప్రపూరిత నదీపూర నిరుద్ధ జనసంచారంబును, అను దినోపచీయమాన విజయోత్సాహ నిరుత్సాహక దుర్దినంబునునై పరగుచుండ రామచంద్రుండు లక్ష్మణుంగాంచి యిట్లనియె. 77

తే॥ "కనుము లక్ష్మణ! శంకరు గళముపోలె
నలుపుమించిన జలదంబు లలముకొనుచు
నలరు యువకుల ధైర్యంబు నడఁచివైవఁ
జెప్పశక్యమె విరహుల చిత్తవికృతి. 78

తే॥ చల్లఁగను వర్షపవనముల్ జాలిఁగొలుప

నంగజుని కాహళధ్వనులొప్పంగ ననఁగఁ
గేకికేకారవంబులు కేకరింప
నిలువఁజాలునె విరహుల నెమ్మనము సి. 79

క॥ జలధి సలిలంబుఁ గ్రోలుచు
దెలియక బడబాగ్ని మ్రింగి తికమకపడుచున్
లలి మెఱపు తీఁగ నెపమున
వెలిఁగ్రక్కెడు మేఘపంక్తి వీక్షించెదవో?. 80

తే॥ మిన్నులు తళుక్కుమంచు నె మెఱుఁగుఁబోఁడి
సుదతి, జానకి, ప్రేయసి, సుందరాంగి
ముందునకువచ్చి నిలిచిన చందమౌను
గలికి మఱి గాంచు భాగ్యంబు గలుగునొక్కొ"?.

మ॥ అని చింతింపఁగ లక్ష్మణుండనియె "నార్యా! నీవె చింతింప నే
మని సామాన్యజనుల్దలంచెదరు? నీకై వానరానీకముం
బనుపంజూచును నర్కసూనుఁడు లసత్ప్రజ్ఞుండు వర్షాగమం
బును దాఁటందగ వెంచి కార్యమునకుం బూనంగ యోజించెడిన్

ఆ॥ వె॥ అనుచు నిట్లు రాముఁ డాశ్వాసితుండయి
కాలయాపనంబు నోలిసలుప
వానకాలమరిగె వచ్చెను శారద
సమయమపుడు దెసలు చాలవెలిఁగె. 83

వ॥ అత్తఱినక్కడఁ గిష్కింధాపురంబున. 84

ఉ॥ భావజ బంధురార్చనల భావము నన్మఱపొందియుండ సు
గ్రీవుఁడు, పావమాని తగురీతివినమ్రతఁబల్కెనిట్లు "సు

శ్రీవిలసిల్లు రాఘవునిచేఁ జిరసంచిత పుణ్యసంపదన్
నీవిటురాజ్యపట్టమును నెమ్మదిఁబొందితి విస్మరింతువే?. 85

మ॥ అల కిష్కింధ సఖుండు కార్యముల సత్యంతాప్తుఁడై కూర్చునం
చలఘుండా రఘువీరుఁడొప్పి మదిలో సంతోసముంజెంద, ని
ట్టులు కార్యంబు తెలుంగు బోవిడువమూఢుండయ్యె నంచెంచి
యాకులచిత్తంబునఁ గోపమూనఁడె? కృతఘ్నుంటంచు దూషింపఁడే?

శా॥ నిన్నున్మెత్తురె నీతికోవిదులు "నిన్నేనమ్మి శ్రీరాముఁడ
ట్టున్నంగానక, కాంత కౌఁగిళులలో లోలుండవై యున్న, నీ
పున్నెంబొప్పఁగ మిత్రుకార్యమునకై పూనంగఁ బ్రార్థింతు, లే
కున్నం ద్రోహముగాఁదలంచి యతఁడుగ్రుండైన మేలున్నదే"?

మ॥ అనుచుండెల్పఁగ నంజనీ తనయు వాక్యంబర్థిఁజేకొంచు న
య్యిన పుత్రుండు, నయ ప్రవీణుఁడయి యెంతేఁగూర్చు నీలుం
గనుంగొనుచుంబల్కెను "వానరోత్తముల దిక్కుల్ సూచిరాఁబంపు" మం
చును, దానంతటనేగె నంతి పురికింజుల్కంగ వీక్షించుచున్. 88

వ॥ అత్తటి నక్కడ శ్రీరామచంద్రుండు సీతావియోగ తాపదందహ్య
మాన హృదయుండై లక్ష్మణుంగాంచి యిట్లనియె. 89

శ్రీరామ ప్రేరితుండై లక్ష్మణుండు కిష్కింధకరిగి సుగ్రీవుని
మందలించుట.

సీ॥ "నడులింపుగాఁదేటె నలువలంకులువెల్గె

ఘన ఘనావళుల పెన్గర్జలుడిగె
కమనీయసస్యముల్ కలమవర్ణముఁదాల్చెఁ
గాశ పుష్పగణంబు గ్రాలుచుండె,
విమలమై చెలువొందు వినువీధి శీతాంశుఁ
డతుల నిర్మలకాంతి నలరుచుండె,
విజయ యాత్రలుసల్పు వేడ్కలు పురికొల్ప
నరవరుల్ చెలరేఁగి నడవఁబూని.

తే॥ రేలకో వాలి తమ్ముఁడు చాలతడసె
మానినీ వశ్యుఁడై నన్ను మఱచెననొ
తొడరికోరికఁ దీర్పఁగా దుష్టుఁడగుచు
నన్నుమఱచుట వీనికి న్యాయమగునె. 90

ఉ॥ అక్కఱ తీఱెనంచుఁ దనయంగనలంగవఁగూడి భోగము
ల్చిక్కెనటంచు నర్కసుతు చిత్తము రంజిలె నంతెగాని, యీ
చక్కికి మోముచూపఁడ, యసభ్యులమార్గమె పట్టుచుండెఁ బెం
పెక్కిన కామముగ్ధుఁడగు నిట్టిఁడు కార్యము నిర్వహించునే?.91

ఉ॥ తమ్ముఁడ! యేగి కామపరతంత్రుఁడు వానికి బుద్ధిసెప్పి, వా
క్యమ్ములఁ దెల్పునాఁటివి, ప్రియాంగనఁ జూడఁగ మేలుకొల్పు,గ
ర్వమ్మునఁ బల్కకున్నఁ దగఁబల్కుము "రాముని వాఁడికోలలో
క్కుమ్మడి వాలిచన్న యెడకుంజన దారినిఁజూప వచ్చెడిన్. 92

ఉ॥ అన్నము పెట్టువానిఁ, గరపుంచిత విద్యలనేర్పువాని, నా
పన్నతఁ బ్రోచువానిఁ, దలవంపుల కడ్డముసొచ్చువాని, స
భ్యున్నతిఁ గోరువానిఁ, దలపోయని దుష్టులకీజగంబునఁ

దున్నె సుఖంబు, వాఁడు పడకుండునె పాపపుఁగూపమందునన్"

చ॥ అనుటయు లక్ష్మణుండు భుజగాధిపుచాడ్పునఁ గ్రోధదీప్తుఁడై
వినిచెను నన్నకిట్లు "కడువేగమె వీనిని దుంచివత్తు, నా
కనుమతినిమ్ము, సీతకయియవ్వలఁ జూతము, ద్రోహబుద్ధులం
జనునె యుపేక్షసేయ జనసన్నుత! రాఘవ!" యంచుఁబల్కినన్.

చ॥ "కనలకు లక్ష్మణా! మనది కార్యము, తొందఱపాటు సెల్లునే?
చనియటఁ గీశనాయకుని చందముఁ గన్గొని, హెచ్చరించి, నే
ర్పునఁ బనిదీర్పవర్గ్గమగు పూన్కిఁ గొడంబడునట్లు సేయఁగా
ననువగుఁ, గానిచో నవలనయ్యెడు చందము కార్యవేద్యమా. 97

మ॥ అనుచుం దెల్పిన యన్నమాటలకుఁ దానాజ్ఞాను సంధాయియై
చనియెం జాపముఁ గొంచు వేగమ మహాసంరంభి కిష్కింధకుం,
జని ద్వారంబున నిల్చిచారులను నాచారంబుఁ బాటించుచుం
బనిచెన్వచ్చిన వార్తఁ దెల్పుటకు సంభావించి సుగ్రీవుతోన్. 96

ఉ॥ చారులుపోయి తెల్పుసుమసాయకు క్రీడలఁ బారవశ్యముం
గూడినవాఁడు గానఁగనుగూర్కుచు నొప్పరికింపుతోడ నొ
య్యారము గుల్కఁగా వినుచు, హాఁయని, హూఁ, యని హె
చ్చరించుచున్
దారముఖంబుఁ గన్గొనుచుఁ, ద్రాగినవాని తెఱంగుతోఁపఁగన్.

చ॥ వదరుచునుండ నత్తఱిజవంబున నంగదుఁ డేగుదెంచి "యి
య్యదవద పల్కులన్విడువు మార్యుఁడు రాముఁడు పంపఁ గ్రుద్ధుఁడై
కదియఁగవచ్చె లక్ష్మణుఁడు కాలుఁడుపోలెను దగ్రుఁడౌచు, నిన్

సదయతఁబ్రోచు రాఘవుని చానకునై వెదకంగఁజూచితే?. 98

ఉ॥ ద్వారమునందు లక్ష్మణుఁడుదాత్త ధనుర్ధరుఁడై చు నిల్చె, ని
స్సారపు భోగవశ్యతను సజ్జన సఖ్యముమాను టొప్పునే?
ధీరుఁడు రాఘవుండతని తేజముఁగానవె మున్నటంచు'' గం
భీరముగానతండు వినుపించఁగ వీనుల సోఁకకుండఁగన్. 99

ఉ॥ మెకపుఁగప్పుచే నొడలి మాంద్యమువీడక తూఁగుఁ గొల్పఁగన్
కేకలు వెల్లురేఁగఁ బురిఁగీశనికాయము బెగ్గడిల్లుచుం
బ్రాఁకెను గోపురంబులను బ్రాఁకె నగంబుల వృక్షపంక్తులన్
భీకర నాదముల్ సెవికి బెట్టుగసోఁకఁగఁ గన్నువిప్పుచున్. 100

తే॥ లేచి కూర్చుండి దిక్కులు సూచుచుండ
నంగదుఁడు లక్ష్మణుని వార్త నట్టె తెలుపు
నంతలోనన యాలస్యమగుట కలిగి
వెల్లుమ్రోగించె సౌమిత్రియల్లెత్రాడు. 101

తే॥ జ్యారవంబునఁ జిత్తంబు సంభ్రమింప
గారణంబేమొ యనుచును గనుఁగొనంగఁ
దారఁబంపెను నచటి కుదారబుద్ధి
నాకె యెదురేగి యాతని కనియెనిట్లు. 102

క॥ "ఇనజుఁడు వాసెను వ్యసనము
మును రామునివలన, నిపుడు పుష్పాస్త్రునిచే
మనమున నెక్కొను వ్యసనము
జననుత! యదివాసె నీదు జ్యాఘోషమునన్. 103

తే॥ ఆర్య! నీకోపకారణం బరయలేక

దిగులుపడి దిక్కుదెలియక వగచుచుండె
నర్కతనయుండు సుగ్రీవుఁ డతనియందుఁ
గలుగు దుర్వృత్త మెద్దియో తెలుపవయ్య"!. 104

చ॥ అని వినయంబుతోడఁ గడునంచిత పద్ధతి విన్నవింప, ల
క్ష్మణుఁ డధికాగ్రహంబడర మానినితోఁ గనులెఱ్ఱఁజేసి యి
ట్లనియెను "రామచంద్రుఁ డనయంబు సతీవిరహాగ్నితప్తుఁడై
వనరఁగ నర్కసూతి తనపత్నికవుంగిట నుల్లసిల్లెడున్. 105

చ॥ సకుఁడట రామభద్రునకు జానకిఁ దెచ్చెదనంచుఁ జెప్పి, తా
నకుటిలమూర్తి వోలె వినయంబును జూపుచుఁ బట్టభద్రుఁడై
సుకములమున్గి రామునిపనిసుంత తలంపకయుండె ద్రోహియై
ప్రకటిత వీర్యమై పరశురాముని యమ్మది మొక్కవోయెనో?.

ఉ॥ వానలు మెండుకొన్న తఱి వానరకోటికి బాధయేల యం
చూనెను శాంతి నెమ్మదిని నూర్పులు పుచ్చుచుఁ గాలవశ్యుఁడై
గాని, శరద్వికాసములఁ గైకొనెఁగాలము పేశుసేయుచున్
వానరరాజు మైమఱచె, వాలికిఁదోడుసనంగ నెంచెనో?. 107

చ॥ చెలిమియెసంగు వాఁడనుచుఁజేర్చి ప్రియంపడ మేలుగూర్చి నం
గలిమికిఁ ద్రుల్లి మత్తిలుచుఁ గామవశుండయి ద్రోహియౌచు, దు
ర్మలినపు వృత్తిఁజేకొనిన మాయలమారిని నమ్మవచ్చునే?
ఖలులకుఁ బాలువోసి తమకంబునఁ బెంచినబుద్ధి మానునే"?.

మ॥ అని యుద్రేకము పొంగ, రోషమడరన్, జ్యానాదమున్మీఱ, ల
క్ష్మణుఁడవ్వేళఁ గృతాంతుభంగి నిలువంగాఁజూచి యాతార, యి

ట్లనియెఁ, "భానుకులావతంస! యినజుండజ్ఞుండు, సైరింపుమా
తని యందొక్కటి తప్పులేదు వినుమా! తండ్రీ! తగంబ్రోవుమా!

ఉ॥ పెట్టిన దీపమై జగతిఁ బేరుఁబ్రతిష్ఠనునిల్పి, పెక్కులి
క్కట్టులఁబాపి పొల్చిన నఘాత్ముఁదలంపక విస్మరించువా
డెట్టి కృతఘ్నుఁడో నొ వచియింపఁగ శక్యమె? యక్కసూతికాఁ
డట్టి కృతఘ్నుఁడంచుఁ గరుణాకర! తెల్పెద శాంతిఁగొందుమా!

ఉ॥ కాలకృతంపు దోషములఁ గై కొని ద్రోహియటంచు దూఱఁగాఁ
జాలుదురయ్య! యుత్తములు, జాల్మఁడె యీతఁడు, భృత్యుఁ
డౌచు మీ
మేలె తలంచి నిచ్చలును మేల్లతనంబులు సేయుచుండు, ని
క్కాలము చాలిరాకునికిఁ, గొంతల పొందుననుంట దోషమే?.

మ॥ పరగన్వానర వీరులంబిలిచి సంభావించి నానాదిశాం
తరముల్ సూడఁగఁ బంపువాఁడగుచు యత్నంబప్పుడే పూనె, నే
ర్పరులం బిల్వఁగఁబంచె, నాతనిమొఱం బాటింతువే లోపముల్
సరగన్ గార్యము చక్కనయ్యెడునిఁకన్ శాంతింపు
రామానుజా"! 112

మ॥ అనుచున్ లక్ష్మణు శాంత చిత్తుఁడగునట్లగ్గించు నాలోన గ్ర
క్కున సుగ్రీవుఁడువచ్చి కేల్మొగిచి యుగ్రుండైన రామానుజున్
వినయంబొప్పఁగ మ్రొక్కుచుంబలికె "సర్వోనాథ పుత్రుండ! స
జ్జన పూజ్యుండ! క్షమింపవయ్య! జరిగెన్ సన్నాహ మెల్లం
దగన్. 113

ఆ॥ వె॥ ఆలసించితినని యాగ్రహంబు మాని

కృప వహింపుమయ్య! నృపకుమార!
వానకాలమగుట వనచర యూధంబుఁ
బనుప ననువు పడక భంగపడితి. 114

తే॥ అనుచుఁ బలుకుచు లక్ష్మణునననయించి
యతనితోఁగూడ శ్రీరాము నాశ్రయించి
కరయుగంబును ముకుళించి పరమభక్తిఁ
బదములంటుచు నతనితోఁ బలికె నిట్లు. 115

ఉ॥ "నీదయచేత రాజ్యమున నిల్చితి, వాలిచెఱం దొలంగితిన్
వేదనలెల్లఁబాసి కడువేడుక లొప్పఁగ నుల్లసిల్లితిన్
గాదని తప్పుత్రోవలను గైకొన నాకిఁక ముక్తియుండునే?
గాదిలి భృత్యుపై నలుగఁగారణ మొక్కటియున్నె రాఘవా?.

చ॥ తెలుఁగుఁ దొలంగి నేనడువ దివ్యపదంబుల సాక్షిగాఁగ, ని
న్నరయని దొక్కనాఁడయిన నార్యజనస్తుత! సున్నయైనసుం
జరిగెను గాలయాపనము చాలఁగఁగాలమె హేతువౌట, వా
నరులిఁక వేగనేగుదురు, నన్నుక్షమింపుమ! రామ! సత్ప్రభూ!"

సీ॥ అని పల్కుచుండఁగా నలబలంబులు రేఁగఁ
గపి సైన్యములు వచ్చెఁ గడిమిమెఱయ,
వచ్చి రాఘవు పాదపద్మంబులకు మ్రొక్కి
నిలుచుండెఁ గేల్మోడ్చి నిశ్చలముగ
నిలుచున్న కపివర నివహంబులను గాంచి
శ్రీరామ చంద్రుండు చెలఁగి మదిని
నర్కసుతుండాప్పి యాలింగనముచేసి

పనుపుమనుచుఁ బలికెఁ బ్లవగపతుల.

తే॥ నంత సుగ్రీవుఁడానంద మతిశయింపఁ
బ్లవగ పతులెల్ల బీరముల్వలుకుచుండఁ
గడఁక విభజించి నాల్గుభాగములు గాఁగ
నానతులొసంగె జానకి నరయనిట్లు 118

-◆◆◆ సుగ్రీవుఁడు వానరులను సీతను వెదుకఁబంపుట, ◆◆◆-

ఉ॥ "రావణరాక్షసుండు రఘురామునసతింగొనిపోయె దొంగయై
యేవగ నెందు నాసతిని నెక్కటిదాఁచెనో చూచి వేగమే
రావలె నేర్పులన్మెఱసి రాముని యుల్లము పల్లవింప, సు
గ్రీవునియాజ్ఞయా వినుఁడు జెక్కులు విర్గను జుల్కఁజూచిరన్.

ఉ॥ తూరుపు దిక్కునన్వెదకి తొయ్యలి జానకి జాడఁగాంచి, వే
సారక వేగరమ్మనుచు సమ్మతిచే వినతున్వనౌకసుల్
కోరిభజింపఁగాఁ బనిచెఁ గోయను కేకలు పెల్లురేఁగ న
వ్వీరులు జానకీ పతికివీఁక జయంబని పల్కుచేగిరన్. 120

ఉ॥ మానిత సచ్చరిత్రు హనుమంతుని జాంబవదంగదాదులం
బూనిక దక్షిణాశకయి పోవఁగఁబంచిన, జై నినాదముల్
వీనుల విందుఁగొల్ప రఘువీరుని నెమ్మది సంస్మరించుచున్
వానర యూధముల్వొగడ బారుగఁబోవఁగ సాగిరత్తఱిన్. 121

ఉ॥ చేవఁదలిర్చు మారుతినిఁ జేరువకుందగఁబిల్చి రాఘవుం
డావనజాక్షికిం దెలుపుమంచు రహస్యపు వార్తఁదెల్పి, యో
పావని! యానవాలిదిగొ భామినికిందగఁ జూపుమంచు స
ద్భావముతోడ నుంగరము భాసుర నామముఁ జేతికిచ్చినన్. 122

చ॥ శిరమునఁదాల్చి యుంగరము శ్రీరఘురాముని నామముద్రితం
బరుదుగ రామ! రామ! యని యాడుచుఁ బాడుచు గంతులేయుచుం
బోరిఁ బోరి సంతసించుచును బోయెను దక్షిణ దిఙ్ముఖుండుగా
నరిగిరి జాంబవత్ప్రభృతులాతని వెంబడిఁ జెంగలించుచున్.

చ॥ పడమటిదిక్కు నంబనిచెఁ బ్రాజ్ఞ సుషేణుఁగపీంద్రయూథపుం,
గడుకొని యుత్తరంబునకుఁ గాఁబనిచెంగపినాయ కోత్తముల్
విడువక కొల్వఁగా శతబలింగడు శూరుని వాహినీ పతిం
గడువొక మాసమంచుఁ గడఁకందగ నెల్లరఁబ్రోత్సహించుచున్

—: వానరులు నానాదిశల సీతను వెదకుట. :—

ఉ॥ కొండల గుట్టలంగుహలఁ గూరిమిఁ బెంచువనాంతరంబులన్
మండిత సౌధ రాజముల మాన్యపురోపవనంబులందు బల్
దండితనంబు మీఱ నరుదారు పురంబుల గోపురంబులన్
నిండిన పౌరుషంబడర నేర్పునఁజూచిరి కాంచరెయ్యెడన్. 125

వ॥ అంతఁ బ్రాక్పశ్చిమోత్తరంబుల కరిగిన కపినాయకులు చింతించుచుఁ గొంతకాలంబు తిరిగి తిరిగి, వెదకి వెదకి, వేసరి విధివిధానంబునకు వగచుచు, భూనభోంత రాళప్రదేశంబుల నెందును జానకింగానక నిరాశాహతులై యనుల్లంఘనీయంబగు సుగ్రీవు నాజ్ఞకు వెఱచుచు, విధిలేక గడువులోపలఁ దమ ప్రభువుంజేరి తమ తమ వృత్తాంతంబుల నివేదించి మిన్నకుండి రక్కడ దక్షిణంబున హనుమజ్జాంబవదంగదాదులు. 126

చ॥ వెదకుచుఁబోయి పోయి యటవీస్థలు లెల్లనుదాఁటి యొక్కచోఁ

బదములిడఁగ రాక ఫలపల్లవ పుష్పవితానశూన్యమై
పొదలు వనంబుఁ, గంధముని పుత్రవినాశముచే శపింపఁగాఁ
గదలుడులేని దానిఁగని, కాదని యవ్వలదాఁటిపోవుచున్. 127

చ॥ కనిరొకచోట ముందరిగి కానన సీమనిశాటునొక్కనిం
గని మదినెంచి రావణునిఁగా, నతనిన్మథియింతమంచు మే
కొని యపుడెల్లరు న్మిగుల కోపముఁబూనుచుఁ బోరుసల్పఁగన్
గొన కొనుచుండ నంగదుఁడు కూల్చెను నిష్ఠుర తాడనంబునన్.

చ॥ అలపు జనింప నొక్కయెడ నందఱు వృక్షతలంబుఁజేరి, భూ
తలమున విశ్రమింప, విదితంబొనరించెఁ బ్రభంజనాత్మజుం
"డిలఁగల యెల్లదేశముల నెందును జానకిఁగాంచమైతి మె
ట్టులు మనపోక యర్కసుతుఁ డుక్కడఁగింపఁడె యిట్టె
పోయినన్. 129

ఉ॥ వచ్చెడు నాఁడు బీరములు పల్కితిరెల్లరు, వ్యర్థమయ్యె, నిం
దెచ్చటఁజూచినంగనమ యింతిని జానకి, నేమిసేయనొఁ
గ్రచ్చఱ నర్కజుండిడినకాలము మీఱెడు నింతలోన, నే
నిచ్చటనుండి ప్రాణముల నీఁగెద నేగుఁడు మీరె తెల్పఁగన్."

మ॥ అనఁగం బల్కెను నంగదుండతని "కయ్యా! యేల చింతింప, నె
మ్మనమందుంబటు ధైర్యముంగొనఁగ, వమౌనెట్లు కార్యంబు, లి
మ్మనన భూగోళ ఖగోళములలుపు నేపుల్ శౌర్యములల్లు మి
మ్మెనయంజాలునె బీఱువోవుటలు, మేలే ధైర్యమున్వీడఁగన్".

మ॥ అని యుత్సాహముఁ గొల్పఁగా ననిలజుండానందముప్పొంగఁడాఁ
జనఁగన్ముందఱ నందఱున్వన చరుల్సాగంగ, వింధ్యాద్రి చెం

తను బోల్పొందు వనంబులందిరిగి సీతంగాంచఁగాలేక యి
ట్లని చింతించిరి చెట్టుమూలమున వింధ్యంజేరి సానుస్థలిన్. 132

ఉ॥ "అన్నము నీరులేక కలయంగనుఁగొంటిమి గాని, జానకిన్
సన్నుత సచ్చరిత్రఁగను జాడలు బుద్ధికిఁ దోచవయ్యె, నే
మున్నది యింక నీ బ్రదుకు లొప్పునె, యాఁకలి దప్పిలెక్కుడై
చెన్నుతొలంగె మేనులును, జేయునదేమొకొ దైవమా! యిటన్"

వానరులు వింధ్యాద్రి గుహందూఱి స్వయంప్రభను గాంచుట.

చ॥ అని దిగులొంది చింతిలఁగనయ్యచలంబున నొక్కచోట జ
ల్లున జలపక్షులుద్దవిడి మోగుచు, లేచుచు, వ్రాలుచుండుట
లనుఁగొని యంజనీసుతుఁడు "రాజిలునందు జలాశయంబనన్"
విని చని కెల్లరచ్చటికి వేగఁ బిపాసఁ దొలంగు కోరికన్. 134

ఉ॥ భూరుహ పంక్తులింపొసఁగఁ బొల్చెడు నొక్క మహాబిలంబునన్
దూఱి చనంగఁ జీఁకటెనిఁ దోవఁగనుంగొనలేక చింతలం
గూరి యొకళ్లొకళ్లు తమకుంగతి యెయ్యది యంచు దైవముం
దూఱుచు నేగ నొక్కయెడఁ దోఁచెను దెల్లని వెల్గుకంటికిన్.

చ॥ అదిగని సంతసంబడర నచ్చటికేగి స్వయంప్రభాహ్వయ
న్మదితనుగాంచి, యప్పుడతి మోదముతోఁ దనవృత్తమెల్లనె
మ్మదిగను దెల్పి, యాఁకళులమాన్పి, బిలంబును వెల్వరింప, నా
సదయనుతించుచున్నొడలి జానకిఁగానమికిందలంకుచున్. 136

ఉ॥ అంగదుఁడప్పుడయ్యగచరాధిపులంగని పల్కెనిట్లు "లా
యంగన జానకింగనక యర్కజునొద్దకుఁ బోవఁజాల, మా
నంగలవాఁడ జీవితము, నాకయిచింతనువీడి మీర లే

గంగ సహించునర్కజుఁడు, కార్యము చొప్పడఁజేరఁదీసెడున్

ఉ॥ ఇచ్చల నొప్పరేనిచన, నీబిలమందునడాఁగి యుండినన్
వచ్చెదు వారులేరిటకు, వానరరాజు ఘోరంగరాము, మీ
మెచ్చు తెఱంగులెయ్యవియొ, మేలని త్రోఁచెడినాకు నిత్తెఱం
గచ్చుపడంగ, నొక్కయత్నమైనఁ గదల్పను, రిత్తవోవుటే? 137

చ॥ గడువుకు లోపలన్వెదకి కన్గొని రమ్మని యానతిచ్చె, నా
గడువును దీఱుచుండెఁ, దగుకార్య ధురీణులమంచుఁ బంపఁగాఁ
గడిమి తొఱంగి జానకినిఁ గానమటంచును దెల్పఁబోయినం
గడుసు దనంబుచేనతఁడు గ్రక్కున నాతలఁద్రుంపకుండునే?

ఉ॥ అన్నను వాలిఁజంపి, యనయంబున నాతని భార్యఁజేకొనెన్
బిన్నను నన్నుఁజేవిడక పెంచెనటన్నది రామునాజ్ఞచే,
నున్నదె వాని చిత్తమున నొప్పగు ధర్మపథంబు? నేనులే
కున్ననెగాని సంతసిలఁ డుర్విజనుల్కడు మత్సరుల్సుమీ. 140

ఉ॥ కావున నేను రానుబొసఁగంజని మీరలుపడ్డపాట్లు సు
గ్రీవునకొప్పఁజెప్పి, మదికెక్కఁ జరింపుఁడు, రాము కార్యమున్
భావమెలర్పఁగా జరిపి, భాగ్యములంది యశఃప్రతిష్ఠలన్
నేవహియింతు నన్మతియు నిక్కము నీఱయిపోయె నేఁటికిన్.''

వ॥ అనుచు ననేక ప్రకారంబుల వగచుచున్న యంగదుం గాంచి హను
మంతుఁడిట్లనియె. 142

ఉ॥ ''దూఱి బిలంబున స్వరల ద్రోహముగాదొకొ యంగదా!
యిటుల్
నూరి జనుల్ నుతింపఁ దగు శూరుఁడవై పలుకంగఁ జెల్లునే?

యేరికినైనఁగాని విధి ప్రేరణ యొక్కటె దిక్కుగాని, య
వ్వీరుఁడు లక్ష్మణుండలుగ విశ్వమునందెటనున్న వీడునే? 143

ఉ॥ క్రోవలనుండి యిందనుక రేవగలెక్కుడు కూర్చునట్టి సు
గ్రీవునివీడ నామదికి గిట్టద, యొంటిగనుందువే! చల
ద్భావులు తక్కువానరులు వాసి, కపీంద్రునె యాశ్రయింపఁగన్,
భావన సేయుమయ్య! బలవంతుల పల్కులె పథ్యమయ్యెడిన్.

వానరులు ప్రాయోపవేశంబుసేసి సంపాతిచే సీతా వృత్తాంతంబరయుట

వ॥ అని యిట్లు హనుమంతుండు నానా ప్రకారంబుల హితవులు ప
లుకుచుండనంగదుండు నిశ్చల మనస్కుండై దర్భాసనంబునఁ
బ్రాయోప వేశంబునకు సమకట్టినఁ దోడి వనచరులెల్లరు నాతని
చుట్టు ప్రదక్షిణంబుసేసి యేకమనస్కులై ప్రాయోపవిష్టు
లగుచు, రామ వనవాస ప్రకారంబును, రావణాపహృత సీతా
వృత్తాంతంబును, సుగ్రీవ సఖ్యంబును, తాము సుగ్రీవాజ్ఞచే
సీతాన్వేషణంబునకై వచ్చి పడుచున్నపాట్లను నొండొరులకుఁ
దెలుపుకొనుచున్న యవసరంబున జటాయువు సీతకై రావణు
నడ్డగించి యాతనిచే నిహతుండగుటయుఁ దడవిననది విని. 145

సీ॥ వింధ్య పర్వత గుహాన్వోలువడి సంపాతి
వానర యూథంబు వరలునెడకు
వచ్చి వారల యోగవార్తల నరయుచున్
జింతించి తమ్ముని నిధనమునకు
నాతని సద్గతి నరసి నివాపంబు
లర్పించి. వారితోననియెనిట్లు

"మున్ను సేవించెని మూర్ఖుఁడు రావణుం
డాసీతఁగొనిచనె ననెడువార్తఁ".

తే॥ గాన దిగులొందఁ బనిలేదు కడఁగి మీరు
లంక కరుగుఁడు జానకీ రమణిఁగాంతు
రనుచుఁదెలిపి, నిశాకర మునివచించు
వాక్యములుఁజెప్పి పలుచి యప్పక్షియరిగె. 146

తే॥ సంతసించుచు వానర సమితియంతఁ
గడఁగిలంకకుఁ బోవంగఁ గదలియెల్ల
రెదుర భీకర పాథోధిఁగదియనరిగి
నిర్వేదం జెంది గిరిమీఁద నిలిచిరపుడు. 147

—: సముద్ర వర్ణనము :—

సీ॥ నీరదచ్ఛన్నమౌ నింగి భూమికిడిగ్గి
పర్వెను నాస్వరూపంబు మెఱయ
బడబాగ్ని తప్తమై పైకినుప్పొంగెడు
కరణిఁ దరంగ ముల్కడు రహింపఁ
బైకిరేఁగు తరంగపంక్తి "యత్యుచ్ఛ్రియః
పతన హేతువ" టన్నపగిది నడఁగ.

తే॥ వెక్కసంబుగఁ దాఁగిన విషము నెడలఁ
గ్రక్కునట్టుల నురువులఁ గ్రక్కుచుండ
భీకరమునపారరత్నాకరమ్ముఁ
గాంచి కపివరులెదలంచుఁ గ్రాఁగిరిట్లు. 148

తే॥ "లంక యెక్కడ? జానకీ రమణియేడ?

తలలు వంచినఁ గనుఁగొని తరుచరులను
దారకుమరుఁడు పలికెను ధీరమతిని
"సాగరముదాఁటి వెరవరుల్బాగుఁగనుఁడు". 149

తే॥ అనుచుఁ బలుకంగ నొండొరు లాత్మబలము
లుగ్గడించుచుఁ "దరమౌనె యుదధినూఱు
యోజనంబుల పొడవయి యున్నదాని
దాఁటి మఱిరాఁగ మావంటి తరుచరులకు". 150

వ॥ అని తమ తమ బలంబుల కొలఁదులు నిరూపించుచు నిరుత్సా
హులై పౌరుష హీనుల యట్లు పలికిన నంగదుండు. 151

ఉ॥ "మించిన పౌరుషంబడర మీరె సమర్థులటంచు నెంచి, తాఁ
బంచిన నొప్పుకొంచుఁ దలవంచినఁ గార్యము సాగునెట్లు సా
ధించినఁగాదె కార్యము నుతించును లోకము, నిల్చు పౌరుషం
బంచిత శూరతంజలధి యద్దరికేగెదఁజూచి వచ్చెదన్. 152

ఉ॥ జానకిఁ గాంతుమంచు మనుజాధిపుతోడను దెల్పుకున్ననా
భానుజుఁడెట్టులోర్చు, మనపంతము లెట్టులనిల్చు, నూరకే
మానముపీడి యర్కజుని మన్ననఁగోరి భజించుకంటె నా
జానకిఁ గాంచమేని మనసారఁగసంబుధిఁ బడ్డమేలెగా. 153

చ॥ నెఱవక యుండుఁడిందుఁ గడువేగమువచ్చెద" నంచుఁబల్కనా
తరుచరులెల్ల నంగదుని తత్త్వముఁగన్గొని "నాథ! మీరటుల్
పఱచిన మేమనాథులము పాయక చెట్టుకు గుట్టకొక్కఁడై
పఱచి యనేక బాధలకుఁ బాల్పడకుందుమె, కార్యమొప్పునే?"

చ॥ అనుటయు జాంబవంతుఁగని యంగదుఁడిట్లని విన్నవించె "నో

యనఘ! రఘూద్వహుండలరు నస్వైర వొప్పఁగఁ దెల్పునాకు,ని
వ్వన నిధిఁదాఁటి జానకిని వారక కన్గొని వార్తఁదెల్పు వా
నినిఁగనుఁగొమ్ము, నన్నుఁగరుణించి తరింపఁగఁ జేయుమాపదల్''

ఆ॥ వె॥ అంత జాంబవంతుఁడంజనీ తనయునిఁ
గాంచి యిట్టులనియెఁ గడఁక మీఱ
"నిఖిలలోక పూజ్య! నీ పరాక్రమమెల్ల
లోకములకుఁదెల్లమేకదయ్య!. 156

ఆంజనేయుని సముద్ర లంఘనంబునకుఁ బ్రోత్సహించుట.

చ॥ పరగఁ బ్రభంజనాత్మజుఁడవై ప్రభవించితి, వర్కమండలం
బరుదగు పండటంచెగిరి యందుకొనంగ మకించి, మింటికిం
బఱచుచుఁ జండభాను ప్రభవంగు తాపముఁదాళలేక, క్ర
మ్మఱఁబడి కొండమీఁద హనుమంతుఁడవైతిటు, లింతవాఁడవే?

ఉ॥ భూరి పరాక్రమంబు పొలుపొందిన వాఁడవటంచు నమ్మి నీ
కా రఘురాముఁ డుంగరము నాసతికిమ్మని యిచ్చిపంప, నీ
వారిధిదాఁటఁగల్గి యిటు వానరవారము పొక్కుచుండ, నీ
వారినిఁబ్రోవఁ జాలి పెరవాని తెఱంగున నూరకుందువే?. 158

ఉ॥ వారిధి లంఘనంబు జరుపంగల శక్తియు, భక్తి, శౌర్యముల్
జాఱెనె నీయెడల్ హనుమ! చాలదె ధైర్యము చిత్తమందు? ని
ర్ధారణచేయుదేని చతురంత విశాలపు విశ్వమెల్ల దో
స్సార మెసంగ వాలమున సమ్మతిఁజుట్టఁగఁ జాలుదిట్టవుల్.159

ఉ॥ కార్యము నీపయిన్నిలిచెఁ, గాదనుమాటలు లోకమందు ని
ర్వీర్యుల పోకడల్, పరగ వీరులకయ్యవి చెల్లునొక్కొ? బల్

ధైర్య విలాస భాసుర విధాన సమర్థుఁడవయ్య! నీవు దో
ర్వీర్యముఁజూపి రామునపని వేగమతీర్పు, శుభంబు నీకగుః. 160

ఉ॥ అంతట మేనుపెంచి యరుదంద మహేంద్ర గిరీంద్రమెక్కి, ని
శ్చింతలనుండుఁడంచుఁ దగఁజెప్పి కపీంద్రులు సంతసింప, స
త్సంతతి చిత్తమందలర ధన్యత్రివిక్రముఁడోయనంగ, ధీ
మంతుఁడు వార్ధిఁదాఁటు హనుమంతుఁడు నిల్చెను నిట్లుపల్కుచుః

చ॥ "వననిధి దాఁటివచ్చెద జవంబున సీతసుజాతఁగాంచి, రా
వణు సహితంబు లంకఁగొనివచ్చెద వ్రచ్చెద రాక్షసాళి, నా
ఘన భుజసారమున్మెఱయఁ గాంచెద జానకి నెందునున్న, మీ
మనములఁ జింతఁబాపెదను మత్సుచరిత్ర జగద్ధితంబుగాః. 162

ఉ॥ రావణుఁడెంతవాఁడు రఘురామ పదాంబుజ నిత్యనిష్ఠ స
ద్భావుఁడనైన నాకుఁ, ననుఁబంచిన వ్రేల్మిడి ముజ్జగంబులః
జేవఁదలిర్చు వాలముననిల్పి రఘూద్వహుముందు నిల్పనో,
యీవనధిందరింపఁబరువే? యిదినాకు నిమేషకార్యమౌ. 163

చ॥ జయజయ రామ! రామ! దనుజాంతక! యంచు నెదఁదలంచి, ని
శ్చయ మొదవంగ నిల్వ, మది సంతసమొప్పఁగ నంగదాదులుః
భయములుమాని యప్పుడు ప్రభంజన సూనునిఁ బ్రోత్సహించుచుః
నియత మనస్కులై గిరిని నిల్చిరి వేడుక సాగనంపఁగః. 164

=♦♦♦ ఆశ్వాసాంతము. ♦♦♦=

తోటకవృత్తము:=శ్రీయుత మూర్తివి, చిన్మయరూపా!
ధ్యేయ గుణోన్నత! దివ్యవిలాసా!

న్యాయపథప్రియ! యంచితరామా!
పాయక కొల్చెద, భవ్యచరిత్రా!. 165

గద్యము:—ఇది శ్రీభారద్వాజ గోత్ర పవిత్ర, ఆపస్తంబసూత్ర, రాఘవాచార్య ద్వితీయతనూజ, శ్రీరామచంద్ర కరుణా కటాక్షలబ్ధ కవితావిస్ఫురణ, కాండూరు నరసింహాచార్య ప్రణీతంబైన రామ రాజ్యంబను మహా ప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము.

సంపూర్ణము.





—: శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః :—

# ★ రామ రాజ్యము. ★

## (పంచమాశ్వాసము.)



ఉ॥ శ్రీవిభవంబులుల్లసిలఁ జేయఁగఁ జాలెడు భద్రమూర్తియై
కేవల కల్పితాకృతిని గ్రీడయపోలె జగద్విలాసముం
దావహియించి మానవుల ధర్మప్రవృత్తికి మార్గదర్శియై
జీవుల తత్త్వముల్దెలుపు శ్రీరఘురాముని సంస్మరించెదన్. 1

—♦♦♦ ఆంజనేయుఁడు సముద్రమును దాఁటుట. ♦♦♦—

ఉ॥ అంత మహేంద్ర పర్వతమునందుననుండి ప్రభంజనాత్మజుం
డెంతయు వేడ్కయుప్పతిల నేడ్తెఱవేగము నూలుకొల్పి, క
ప్పింత యెసంగఁ బైకెగిరె బెట్టు గిరీంద్రము క్రుంగిపోవ, న
త్యంత భయాకులంబులయి యందలి జంతువులెల్లఁ బాఱఁగన్. 2

సీ॥ జలజల ప్రవహించు సెలయేటి మొత్తముల్
కన్నీటి ధారలుగాఁగ వరల
నిటునటు పరువెడు పటు జలదావళుల్
శీర్ణ ధమ్మిల్లంపుఁ జెలువుఁ దెలుప

వెఱపునఁ బరువిడు ద్విరదయూథంబులు
నిట్టూర్పుగములొంచు బిట్టులెనర
భీతమృగోద్ధూత ధాతురాగంబులు
తరలెడు శోణితధారలనఁగ.

తే॥ తర్జిత ప్రబుద్ధ కేసరి గర్జనములు
పరగ నాక్రందనధ్వని ప్రకరమనఁగఁ
జరణ నిష్పీడనాక్షమాచలము తనరె
బవన తనయుండు కుప్పించి బలిమినెగుర. 3

ఉ॥ వేగముతోడ నప్డు వినువీధికి మారుతి యేగమారుతో
ద్వేగముతోడ వెందవిలి, వీడి, పయోనిధి వ్రాలిచాలుగం
జాగిలె వృక్షపంక్తి కపిసైన్యము కట్టెడు సేతుమార్గసం
యోగము సూత్రితంబగుట యొప్పఁగ నాఁటినశంకుపంక్తిగాన్. 4

ఉ॥ గంటకు వేయిమైళ్లు పడిగంజను దొడ్డ విమానమోయన
న్మింట వెలుంగుచుం జలధిమీఁద ఖగేంద్రుఁడుపోలె నొప్పుచుం
దంట సమీరణాత్మజుఁడు దక్షిణ దిఙ్ముఖుఁడై చనేగె, నా
తుంటరి రావణాధముఁడు తోడ్కొని యేగిన సీతఁగానఁగన్. 5

ఉ॥ ఆకసమంటిపోవునెడ నయ్యనిలాత్మజుఁగాంచి యబ్ధి, మై
నాకునిఁబంప, వాఁడు పయనంబున కడ్డపి యల్గివేగను
ద్రేకముతోడ వాని శరధింబడ ఱొమ్మునఁ గూలఁద్రోసి, బల్
వీఁకఁ జనంగ నిట్టులని వేడ్కొనె నద్రివరుండు మారుతిన్. 6

చ॥ "అలుగకుమయ్య! నాపయి హిమాద్రిసుతుండ, హిరణ్య

నాభుఁడన్

సలిల నివాసినై యిపుడు సాగరుఁడంపఁగ విశ్రమింతువన్
తలఁపున వచ్చినాఁడను నెదంబరికింపు సపక్షుఁడన్ సుమీ
తొలిసురరాజు ఱెక్కలను దుంపఁగ మీఁజనకుండు కాచుటన్

ఉ॥ కావున విశ్రమించి చనఁగా నినువేఁడుదు వాయుపుత్ర! సం
భావనసేసి నామనవిఁ బక్వఫలాదులఁదృప్తిఁబొంద, నా
భావము నిర్మలంబగును, భాగ్యముపండును, నీప్రయాణముం
బావన రామచంద్రునకు భామినిఁగూర్ప సమర్థమయ్యెడిన్". 8

క॥ అనుటయు మైనాకంబును
గనుఁగొని ముదమంది కరయుగంబున నతనిన్
జనవున నిమురుచుఁ "బోవలె
నను నిల్పకు మలపులేదునాక" నిచనియెన్. 9

క॥ సురపతి మైనాకునిఁగని
కరువలి కొడుకునకు రాముకార్యార్థికినై
పరువుగ సాయము సలుపఁగఁ
దిరమగు కోపంబుమాని తిరుఁగఁగనిచ్చెన్. 10

క॥ హనుమంతుఁడు చనుచుండఁగఁ
గనుఁగొని సురసంఘమపుడు కనుఁగొన బలమున్
జనుముని సురసను బంపిన
వినువీధికి నెగసినోరువిచ్చె గ్రసింపన్. 11

క॥ తనువును బెంచెను బెద్దగ
హనుమంతుఁడు, దాని మ్రింగననువౌ నటులన్
దననోరు దెఱచె సురసయు

మునుకొని బహుయోజనముల పొడవయియొప్పఁ.

ఆ॥ వె॥ అంతసూక్ష్మరూపియయి హనుమంతుఁడు
వదన గహ్వరంబు వడిగదాటి
వెడలి వెలిఁగెఁగడుఁద్రివిక్రముఁడోయన,
నాగమాత సురసవేగ నరిగె 13

ఆ॥ వె॥ సురలువాని శౌర్యమురు తరంబనియెంచి
సంతసించి రపుడు సన్నుతించి
గాలికొడుకువేగ గగనంబు నెగఁబ్రాఁకి
పోవుచుండెఁ గార్యమునుదలంచి. 14

ఆ॥ వె॥ జలముపైననుండి ఛాయనుగ్రహించి
కదలకుండఁ జేయఁగడఁగునట్టి
సింహికాఖ్యఁబట్టి చీల్చుచు నఖములఁ
జెలఁగిహనుమయేగె జలధిదాఁటి. 15

ఆ॥ వె॥ జలధితీరమందు వెలయు సువేలాఖ్య
శిఖరిఁజేరి యందుఁ జింతమునిఁగి
సూక్ష్మరూపియగుచుఁజూచి నల్గడలను
గలవరించెనిట్లు పలు తెఱఁగుల. 16

తే॥ "అధిక విస్తృతమైనట్టి యబ్ధియేడ?
దానిఁ దరియించు శేడ యత్రరుచరాళి?
దాఁటెఁ బోలంకఁ జేరునన్మాటయేడ?
అన్నివిధముల రాముఁడెవ్యర్థుఁడయ్యె. 17

తే॥ ఇంతదూరంబు శ్రమియించి యీమహాబ్ధి

దాఁటివచ్చితి ఫలమున్నె దానవాకు?
సీత బ్రతికెనో విడిచెనో జీవితంబు,
నెట్టినె తిని దెలియక వెనుకముందు. 18

తే॥ తరులతాగుల్మవితతిలతాంతశోభి
తోపవనములఁ, గొలఁకుల, దుర్గములను,
నావృతంబయి శత్రుభయంకరంబు
నయినయిప్పురిఁ జేరఁగానగునె మాకు?. 19

తే॥ చూడఁజూడంగఁగను దోయిసొగయుచుండె
నీమహానగరంబున నెట్లు సొరఁగ
నగును? ననుఁగన్న రక్కసులగుడుపఱచి
పట్టి బంధింపకుందురే కొట్టితిట్టి. 20

సీ॥ అతుల సౌధ విచుంబితాంబరంబనుదిన
జాల కాంకిత సూర్యచంద్రపదము
గజ ఘటాశ్వవిభూతి కలిత శృంగాటకం
బాయుధ పాణి నిశాటనిబిడ
ముత్తుంగ గోపుర ప్రోల్ల సద్విభవంబు
దృఢవప్రప్రాకార దీపితంబు
దుస్తరాతి విశాల దుస్సాధ దుర్గంబు
క్రీడాచలోద్దీప్త కేళివనము.

తే॥ అలకనమరావతిని మించు నధికవిభవ
శోభితారామ ప్రాసాద సుందరంబు
దైత్యకోటి విజృంభణ దారుణంబు

కపులు సాధింపఁగలరె లంకాపురంబు. 21

సీ॥ అని యిట్లు చింతించు నంతలోనన సూర్యుఁ
డస్తగిరింజేరి యలసు రేందుఁ
డయ్యగస్త్యుని యొద్ద ననువుగ దాఁచిన
చాపంబునకు మంచి సమయమబ్బె
నని ప్రచేతసునకు వినిపింపనోయన
నస్తంగతుండౌచు నబ్ధిమునిఁగె
నంత లంకాధిపునపయశంబనునట్లు
చీఁకటి దిశలెల్లఁబ్రాఁకుచుండె.

తే॥ పట్టపగలునఁదిరుగుట పనికిరాద
టంచు నెంచెడు హనుమంతుఁ డంచితముగ
సంతసించుచు నుండంగఁ జంద్రబింబ
ముదయగిరి శృంగమందు సముద్భవించె. 22

వ॥ శృంగార జీవితుండును, దమస్తమాల కాంతారకుఠారుండునైన శశలాంఛనుండు గగనాంగణంబున విరాజిల్లుచుండఁ, దమోనిరుద్ధంబులైన యాతనికరంబులు కొలఁకునందు శైవాల సంఛన్నంబులైన బిసాంకురంబులుంబోలెఁ బ్రకాశించుచుండ నయ్యవసరంబునఁ దన కార్యారంభంబున కనుకూలించునని తలంచి. 23

=♦♦♦ హనుమంతుని లంకాపుర ప్రవేశము. ♦♦♦=

చ॥ చతురత నంజనీసుతుఁడు జానకి యిక్కనెఱుంగనెంచి, సూక్ష్మతర శరీరుఁడై పురము సందులు గొందులుచూచు వేడ్కని శ్చితమతి ద్వారరంగమునుజేరె బుధుల్మది సంతసింప, స

ద్విత్రితుఁడయి సూచ్యఫక్కిఁ దెలుపన్నవనాటక సూత్రధారుఁడై

ఉ॥ ద్వారమునందు నిల్చి తలపన్ హనుమంతుఁడు దాఁటిపోవ, గం
భీరతరాకృతిన్ యువతి భీకరరూపిణి యడ్డి యాతనిన్
"వీరుల కేని యిప్పురము వేగఁ జొరంగన శక్యమైన, నీ
వారయఁగోఁతిమూతివయి యవ్వలి కెట్టులనేగువాఁడవో? 25

ఉ॥ ఎవ్వఁడవోరి! వానరుఁడ! యిచ్చోడ కేగ నిమిత్తమేమి? నీ
వెవ్విధి లంకఁజొత్తునని యెంచితి, లంకిణి పోటెఱుంగవే?
కొవ్వునఁ గన్నుఁగానవొకో, క్రోఁతికి రాజపురంబు లేల! నా
చివ్వకు నిల్వ నిన్ను పుడఁ జేర్చెద నంతకు సన్నిధానమున్". 26

చ॥ అనుటయుఁ గ్రుద్ధుఁడై హనుమయన్నగరేశ్వరి లంకతోడ ని
ట్లనియెను "నేను వానరుడ, నద్భుత మిన్నగరంపు సొంపుఁగ
న్గొనఁగను వచ్చినాఁడ నిటకు, న్నను నడ్డఁగఁ జాలుదే నిఁక
న్గొనుమిది"యంచుఁ బేర్చి పిడిగ్రుద్దున ఱొమ్మగలంగ మోఁదినన్

చ॥ వెనుకకు భూమిపై దొరలి వెక్కసమంది విరించి పల్కుల
న్మనమున సంస్మరించి హనుమంతునితో వచియించె నిట్లు "లో
యనఘ! యథేచ్ఛ మిన్నగరమందుఁ జరింపుము లంకవైభవం
బునుజను కాలమయ్యెనిఁక భూరిబలాఢ్యుఁడ! పొమ్ము చూ
డఁగన్". 28

వ॥ అని యిట్లు లంకాధిదేవతానుమత యథేచ్ఛావిహారుండును, న
త్యంత సంతుష్టాంతరంగుండు నగు నాంజనేయుండు సీతాన్వేషణ
తత్పరమతి యగుచు. 29

చ॥ చెంగున గోడపై కెగిరి, చిందులు ద్రొక్కి నిమేషమచ్చటం

బొంగుచు రామమూర్తిఁ దనబుద్ధిఁ బాయక, రాజవీధులు
తుంగ విశాలసౌధములు తోరివలుసూచుచు నేగియేగి చూ
చెంగమనీయభాసుర విశిష్ట మణీమయ సౌధరాజమున్. 30

చ॥ అదియగు రావణాధముని యంతిపురంబని నిశ్చయించి మే
లొదవ నిశాకరుండడరియొయ్య సహాయకుఁడై వెలుంగ, స
మ్మదమున నొక్కటొక్కటిగ మందిరముల్వెదుకంగఁబూనె, నే
ర్పొదవఁగ నంజనీ తనయుఁడోరిమిమీఱ వెలందులున్నెడన్. 31

ఉ॥ కొందఱు వైకృతంబుగను గొందఱు వస్త్రముఁ బాయు మేనులం
గొందఱు మర్మబంధములఁ గొందఱు గాఢపుఁగౌఁగి లింతలం
గొందఱనంగసంగర వినోద విశీర్ణక చాళులన్మహా
నందముతోడ నందఱు ఘనంబగు నిద్దురఁగూరి యుండఁగన్. 32

ఉ॥ కంటిని బ్రహ్మచారినయి కాంతలనియ్యెడ భోగశీలలం
దుంటరి యంచుసద్గతికి దూరముసేయవె పుణ్యలోకముల్
బంటను రామకార్యమిది, భామిని సీతకునై చరింప, నా
కంటఁబడంగఁగామినులు కాముకుఁడంచురె? దోషినౌదునే? 33

వ॥ అని నిశ్చిత మనస్కుండై భయంబుఁ బాసి. 34

ఉ॥ తిన్నగ నొక్కరొక్కరిని దేఱికనుంగొని యందునెందునున్
సన్నుతసచ్చరిత్రయగు జానకిఁగాంచక విన్నఁబోవుచున్
గ్రన్నన నప్సరోంగనలు గ్రమ్మఁగ హాయిగ గాఢనిద్రమై
నున్నయొకర్తుఁగాంచి మదియుల్లసిలంగను జేరెయక్కడన్. 35

ఉ॥ కాంచనచేలమున్నెఱయఁగామిని యొక్కతె రావణాసుర
ప్రాంచదుపాంతమందు సురభామతెఱంగునఁ దోచునంత, మః

భ్రాంతిత చిత్తుఁడై హనుమ యక్కట! రాక్షసుశయ్యఁజేరునే?
కాంచెద, సీతగాదు, సురకాంతయొ, రావణుధర్మపత్నియో? 36

వ॥ అని విచారించి, సమీపించి, యానారి మండోదరిఁగా నిరూపించి, "అక్కటా! భ్రాంతచిత్తుండనై పాపంబు శంకించితి, అగ్నిఁ జెదలంటునే? పాపంబు శాంతించుఁగాక, అయోనిజ, [illegible]పరావతార, జనకరాజపుత్త్రి, దశరథ రాజేంద్రుకోడలు, లోకోత్తర సౌందర్యశాలియు, సకల సద్గుణ విశాలుండును, అపార పరాక్రమ విలసితుండగు శ్రీరామచంద్రుని ధర్మపత్ని పరమసాధ్వి సీత చరాచరంబులు తల్లక్రిందైనను నన్యపురుష సంస్పర్శనంబున కోడంబడునన్న నిఁక ధరాతలంబున స్త్రీజాతికి నొక నియతనిర్మల ధర్మగతియనునది యుండునే? ఇయ్యధముండప్పరమ కల్యాణి నెందుదాఁచి యుండునో? ఇప్పురంబుననే వెదకనిచోటు లేదు గదా? ఇంతదూరంబు నారాక వ్యర్థంబగునేమొ? ఓ యిష్టదేవత లారా! నాప్రార్థనం బంగీకరించి నామనోరథంబుఁ బూరింపుఁడు మీకు నమస్కారంబు. ఇదిగో యియ్యశోకవనంబు వెదక మఱచితి. చూచెదఁగాక." యనుచుఁ బ్రాకారంబు లంఘించి యశోక వనికం బ్రవేశించె, నయ్యది 37

సీ॥ నాగపున్నాగముల్నారంగ కేతకీ
చంపక చాంపేయ చందనములు
తాలహింతాల తమాలకపిత్థముల్
కురవక మరువక కుటజములును,
సరళ వంజుళనీపసంతాన కింశుక

స్యందన పాటల కుందములును,
తిలక వేతససాల తిందుకామలకముల్
కతకలవంగ మాకందములును.

తే॥ గలిగి చెలువొందుచుండును లలితమగుచు
నందునందందు వెదకుచు నాంజనేయుఁ
డాకసంబంటు శింశపానోకహంబుఁ
గాంచువేవేగదానిపైఁ గడఁక నెక్కె. 38

తే॥ కడఁగి తత్పత్రి సంఛన్న గాత్రుఁడగుచు
వాయుపుత్రుండు కదునొప్పెఁ బ్రాభవమున
వటపుటంబున వరలెడు వనజనాభు
చందమున, వానినెఱుఁగంగ శక్యమగునె?. 39

ఉ॥ జిల్లెడు చెట్లయందిడిన చెన్నగుమల్లియ తీఁగవోలె, శో
భిల్ల స్మశానమందిడినపేర్చుసుమంబుల మాలయట్లు, భా
సిల్లఁగ నాశ్రమస్థలినిఁ జేటొడఁగూడఁగఁదెచ్చి రావణుం
డుల్లములేని వాఁడచటనుంచిన జానకి, దీనయైతఁగన్, 40

తే॥ జలధరావృత చంద్రమండలమువోలె
దేహ సంస్కారముల నెల్లఁదెగడి కరము
చింతమునుఁగుచుఁ జెలువేదు సీతమోముఁ
గాంచి హనుమంతుఁ డిట్టులఁగలవరించె, 41

ఉ॥ చందురుఁడుండవచ్చుఁ దనచంద్రిక వీడియు రాత్రియందుఁ, గా
నం, దనఛాయవీడి దినినాథుఁడు నుండిన నుండవచ్చు, నే
మందుము, సీతవీడి యనఘాత్ముఁడు! రాముఁడు! ప్రాణధారి వై

యుందువటన్నఁ జిత్రమగు, నోరిమినీయది యెంతగొప్పదో. 42

చ॥ తరుశిఖరాగ్ర పర్ణముల దాఁగిన మారుతి పెక్కురీతులం
ధరణిజఁగూర్చి చింతిలుచు దానవ నారులు కాపుకాచుటన్
సరవినిఁ దన్నుఁదెల్పుకొను సందొక యించుక చిక్కకుంటచే
దురపిలుచుండెనందె, వడిఁ దూర్పునరేఖలు తెల్లవాఱఁగన్. 43

—♦♦♦ రావణుఁడు సీతకడ కరుదెంచుట. ♦♦♦—

ఉ॥ అప్పుడ దివ్వటీల్మెఱయ దద్దశకంఠుఁడనంగతప్తుఁడై
చప్పున సీత చెంగటికిఁ జానలు పెక్కురు కొల్వవచ్చె, నా
చొప్పుఁగనుంగొనంగ బహుచోద్యపు టుత్సవమట్లు తోఁచెఁగన్
జెప్పఁగ శక్యమానె విధిచెయ్దము లీడ్చెడి వారివైఖరుల్. 44

ఉ॥ కావలియున్నవారు కడకేఁ బహు సంభ్రమ మొప్పలేచి, యా
త్రోవనునిల్చి మ్రొక్కలిడి స్తోత్రముసేయుచు దారిఁజూప, నా
రావణ దుర్జనుండు మదిరారసపాన విలోలనేత్రుఁడై
భావజరాగ ముట్టిపడఁబోవని జానకిఁ జేరవచ్చెనన్. 45

ఉ॥ అంగములెల్ల ముడ్చుకొని యజ్జనకాత్మజ భీతచిత్తయై
వంగి రఘూద్వహున్మదినిఁ బాయక చింతిలుచున్న యంతలో
నంగజరాగమత్తుఁడగు నద్దశకంఠుఁడు డగ్గఱిల్లి "నీ
సంగముఁగోరు రావణుఁడు చానరొ చూడనె" యంచుఁ
బల్కుచున్. 46

మ॥ అతులైశ్వర్య సమృద్ధిచే జగమునం దాహాయనంబొల్చి, స
మ్మతి దేవేంద్రముఖామరావళికి సమ్మాన్యుండనౌ నన్ను దు
ర్మతివై యల్పనరాధముండయిన యారామున్మదిన్నిల్పి బ

ల్వెతలంగుందుచుఁగుందఁ జేయఁదగవే చెలీ! సుఖంబొల్లవో?.

ఉ॥ కాయలు కూరలుం దినుచుఁగాననముల్చరియించునట్టి య
ల్పాయువు మానవుండవిలి, యభ్యుదయంబులు పంచఁజేర, న
న్యాయమటంచుఁ బోవిడువ న్యాయమె, ప్రాయముసుస్థిరంబె, యీ
కాయమునేల మాడ్చెదవు కామిని! నీతలఁపింకఁ జెల్లునే?. 48

ఉ॥ చూచితి నిన్నినాళ్లు మనసుంగని రంజిలి చేరఁదీసి, నన్
బ్రోచెదవంచుఁగాని, తగవుంబరికింపవు, భావజుండున
న్నేఁచఁగ నోర్తునెట్లు తరుణీ! యిఁకఁ బీడుము రాముచింత, నా
యేచిన భోగముల్గనిన నిందునిభానన! రామునొప్పుదే? 49

ఉ॥ ఎక్కడి రాముడింక నతఁడిక్కడకెట్టుల రాగనేర్చు, పెం
పెక్కిన పంక్తికంధరుని యీశ్వరివై మనుటొప్పునీకు, నేఁ
జిక్కిన దానవౌచుననుఁజేరక తప్పుకొనంగ నౌనొకో,
చక్కని ముద్దుచిల్క! ననుఁజయ్యనఁ గౌఁగిటఁజేర్చి కావవే!.

చ॥ సతతము సేవసల్పి బరిచారిక లెక్కుడు కూర్చువారలై
ప్రతత సమస్తభోగములఁబట్టపు రాణివనంగఁబొల్తు, వా
కృతక తపస్వి, రాము, విధికింకరుఁజేరు తలంపు మానుమా,
బ్రతికెనొ, చచ్చెనో, యతని భావమునందిడి పొక్కనేటికే. 51

ఉ॥ చొక్కితి మన్మథార్తి మెయిసుందరి! తేర్పు, దురంతమౌ వెతం
జిక్కితి నీదుకౌఁగిటికిఁజేర్చి తరింపఁగఁజేసి కావుమా
చక్కని మందయాన! సరసంబగు పల్కులఁదన్పరాదొకో.
స్రుక్కఁగ నేను నిప్పగిదిఁ జూడఁగ నీకిది యెట్టులొప్పునే?. 52

—♦♦♦ సీత రావణునిఁ దిరస్కరించుట. ♦♦♦—

మ॥ అనుచుంబల్కిన పల్కులయ్యువిదకత్యంతాగ్రహోద్రేకముం
బెనుపన్, జివ్వున గడ్డిపోచఁగొని "నీమేలెంతు కామాంధ! య
య్యనఘుండగ్గటి రామ! రామ! ననునయ్యా! కావుమం" చన్నని
న్నన యంబోఁతడు గాచురాఘువుఁడె, గాకన్యుల్దగన్ శక్తులే?

మ॥ అతులైశ్వర్య సమృద్ధియున్ సుఖకరాత్యానంద సంధానము
న్మతి నూహింపఁగ నీ తృణంబులు జగానన్మాకు గ్రాహ్యంబులే
యతి లోకుండగు రామచంద్రుడుగుణమే యాహ్లాదసంధాయిగాఁ
బతియేదైవమనంగఁ బొల్చునతులన్ బాధించి జీవింతువో?. 54

ఉ॥ కాయలు కూరలుందినక కండలు పెంచిన జ్ఞానహీనుల
మ్మాయకులొంగి, పొంగి, యవమానము, మానము లెక్క
సేయక
ల్పాయువులొచుఁ బాపములకంగలు చాఁపగ నుక్కడంచి, దు
ర్మాయలు బాఁపువాడయిన రాముఁడు మానవమాత్రుఁ
డయ్యెనో. 55

ఉ॥ నమ్మిన ప్రాణనాథుఁడు వనమ్మున వందురెలంగఁజేసి, నీ
వమ్మెయి దొంగవై యబలనైన ననుంగొనివచ్చి యిమ్మెయిన్
సమ్మతిఁగొల్పఁ జెల్లునొకొ, చానకు నాథుఁడులేని సంపదల్
వమ్మగుఁ, బ్రాణమానములు,ప్రాయమునన్నియు నాతఁడౌటచేన్

ఉ॥ చూచితి నిన్నినాళ్లు మనసున్మరలించి, సుబోధశాలివై
నీచగుణంబుమాని; ధరణీశుని రామునిఁజేరె కొల్తువం
చేచిన కండకావరము శ్రీరఘురామ ధనుర్విముక్తనా

రాచములొక్కఁ బెట్టునను గ్రమ్మోడుదాఁకను వీడునేనిర్గా. 57

ఉ॥ నిత్యము నిర్మలంబయిన నీరజనాభుని సన్నిధానమే
సత్యమటంచు నమ్మి, మునిసన్నుతు రామునిఁగొల్చునట్టిమా
కత్యనుతాప హేతువయి యల్పములైన సిరుల్ రుచించునే?
స్తుత్యము రామనామమది, ధూర్తుల కెట్టుల గోచరంబగుగా. 58

మ॥ సకలంబైన చరా చరాత్మక జగత్సంధాన శీలుఁడు, మా
మక హృద్ధాముఁడు రామచంద్రుఁడు జగన్మాన్యుండు నెవ్వేళఁ
దా
నకలంకస్థితి నొప్పువాఁడగుట సత్యంబా మహాత్మ్యంబు, బా
యక యిచ్చోటికి వచ్చు వేగనపుడీయార్భాటములెల్లనో?. 59

శా॥ తుచ్ఛుండై నినుఁజంపి సంగరమునందోర్వీర్య మొప్పార, బల్
స్వేచ్ఛాచారుల దుష్టరాక్షసులనుద్వేగంబుతోమాడ్చి, దే
వేచ్ఛాపూరకుఁడౌచు ధర్మము నిలంబెంపొందఁగాఁజేసి, సా
ధ్విచ్చోల్లాసములొప్ప రాముఁడిఁక నెంతేఁ బృథ్విఁబాలించెడిన్.

ఉ॥ నిన్నొకమాటచేతఁ దరణీందుల సాక్షిగఁగూల్చు దాననై
యున్నను, రామ శౌర్యమునకున్నతిఁ గోరుచునుందునంతె, వే
గన్ననుఁ గొంచుఁబోయి "వెడఁగన్ననుఁ గావుమట"ంచు
వేఁడు, లే
కున్నను రామచంద్రు విశిఖోర్మలు పర్విన సర్వనాశమా. 61

ఉ॥ అగ్గియటంచుఁ దానెఱుఁగ కార్యసతింగొనివచ్చి లోకముల్
భగ్గుమనంగఁ జేయఁదనపాత్రిణము, మానము, చెల్వమూడఁగగా
మగ్గుయశస్సు, లోకమవమానము సేయును, సర్వనాశమా

నెగ్గులు పల్కనేల యిఁకనేగుము నోరుమెదల్పకిమ్యేడన్. 62

వ॥ అని యనేక ప్రకారంబులఁ దృణప్రాయునింగాఁదలంచి తిరస్కరించి పల్కిన నయ్యధముండగు రావణుండు రోషభీషణ ఘూర్ణమాన తామ్రాక్షుండగుచు జానకి నుపలక్షించి యిట్లనియె.

ఉ॥ "జానకి! నీయహంకృతికిఁ జక్కని శిక్షయయర్హమౌను, గానీ నినునింక రెన్నెలలు నిల్పెద, నవ్వలఁబట్టువీడవే
బ్రాణముఁదీసి మాంసమును బక్షులకుందగఁబంచి యిత్తుఁ, గాదేని మహానసంబునకు నిచ్చెదఁబాకముసేసి కుడ్వఁగన్". 64

వ॥ కావలియున్న ఘోర వికృతాకారలగు రాక్షస భామినులంగనుంగొని చతురుపాయంబుల తెఱంగు నిరూపించుచు. 65

చ॥ "వినుఁడు మదీయవాక్యములు వెంగలి యాచిగురాకుఁబోఁడికిన్
సునిశిత వాక్ప్రమత్కృతులఁజూపి ననుంగవయంగఁ జేయుఁడ
ప్పని కొడఁబాటులేక తనపాటనె పాడిన వెన్కముందులన్
గనుఁగొన కట్టెచంపి మదిఁగాంక్షలుతీఱ భుజింపుఁడింపుగన్".

మ॥ బలిమింగావలి మూకకిప్పగిది సంప్రాప్తాగ్రహోదగ్రుఁడై
తెలుపన్ ఖేచరవర్గముల్బెదరి యెంతే దుఃఖముఁంజెంద "నీ
పలుకుల్ సెల్లవు, కొంచుఁబోవునను, నిన్భంజించి రాముండు"న
న్వాలఁదిన్ సీతను గుఱ్ఱుగుఱ్ఱుమని తావీక్షించుచుంబోవఁగన్. 67

ఉ॥ చీఁకటి వాసె, నద్దెనలఁ జెల్వయివెల్గులుతేజరిల్లె "నక్షత్రకలఁబెట్టు రావణుని హంకృతిగాఢ తమంబునిట్టులే
తేఁకువఁబాపు రాముఁడ"ని తెల్పెడు భంగిని బాలభాస్కరుం
డాకసమందుఁదోఁచె నపుడాసతి జానకి భీతిఁబాయఁగన్. 68

చ॥ పదపడి రాక్షసాంగనలు పంక్తిముఖుందలపోసి, జానకిం
గదుముచు, బుద్ధిలేదనుచుఁ, గాఱియనెప్పుచు, బీతుగొల్పుచున్
గొదవలుతీర్చి నిన్గొలుచుఁ గోమలి! యేల సుఖంబులొల్లవో
సదయుఁడు రాక్షసాధిపుఁడు సమ్మతిఁ జేకొనుమంచుఁదెల్పుచున్

చ॥ చిదిమెదనంచు నొక్కతయుఁ జీల్చెదనంచు నొకర్తువల్క ని
మ్ముదితనుగోసి తిందమని ముగ్గురు నల్గురు ఱంపుసేయ, ని
య్యదను కొలందిగాదనుచునయ్య నిలాత్మజుఁడూరకుండ నా
పదలు దలంచి సీత తన భర్తనుగూరిచి యిట్లు చింతిలెన్. 70

చ॥ "అడలఁగ నాదువృత్తమును నంతయునెర్గు జటాయువప్పుడే
విడిచెనొ యేమొ ప్రాణములు, వీరుఁడు నాథుఁడెఱుంగ కుంటచేఁ
దడసెనొ, లేక రాక్షసులు తంత్రములల్లఁగ నందుఁ జిక్కె,నన్
దడవుటమానెనో ప్రియుఁడు, దైత్యులమాయలు సన్నపాటివే?

ఆ॥ వె॥ అడవినుండి నన్ను నపహరించెడు నాఁడు
రాము మనమునుండి ప్రేమఁగూడ
నపహరించెనేమొ యధముండు రావణుం
డట్లుగాక యున్న నతఁడురాఁడె? 72

=: సీత రామునిం దలంచి విలపించుచు మూర్ఛిల్లుట. :=

చ॥ ధరణికిఁబుట్టి యజ్జనక ధార్మికశేఖరు పుత్రినై, నయో
త్తరుఁడగు రామచంద్రునకు ధర్మవిధింబరిణీత పత్నినై
యిరవుగఁగానలంబడితి, నిద్దురితాత్మునిచేతఁజిక్కితిన్
సరసిజగర్భు చెయ్దముల చాలుగనుంగొన శక్యమేయిలన్. 73

ఉ॥ నిందితురాలనైతి ధరణీశసుతుం బెడఁబాసి. యివ్విధి
న్వొందురిలంగఁజేసె విధి, పాపికిఁ గర్మఫలంబు తప్పునే?
సుందరమూర్తి రాఘవునిఁజూచెడు భాగ్యము లేదయేమొ, నా
యందను రాగమున్న,నను నాతయ కొప్పరికించునే యిటుల్ .74

వ॥ ఛీ! ఛీ! యిఁక జీవితాశ నిరర్థకంబు జాగుసేయుట యధిక దుః
ఖాకరంబు, ప్రియుని మనంబున కెక్కని బ్రదుకువలనఁ బ్రయో
జనంబెయ్యది? కట్టా! దైవంబెంత నిర్దయంబు. కోరిన యప్పుడ
ప్రాణంబులఁ బాయననువు కల్పింపఁడయ్యె. గరళ భక్షణాదుల
బ్రాణంబుల హరియించుట మహాపాతకంబు. అయినను నయ్య
ది యిందు దుర్లభంబు. ఉరిపోసికొందమన్నను సాధనంబులు
లేవు. ఇయ్యతి దీర్ఘ వినీల కేశపాశంబున కయ్యదియ ప్రయో
జనంబగునేమొ? హా! రామచంద్రా! తుదుకు దిక్కులేని దాన
నైతినే". అని యనేక ప్రకారంబులఁ బలవించుచు మూర్ఛ
మునిఁగి నేల కొరఁగునంత. 75

చ॥ త్రిజట తటాలున న్నిదుర దేఱఁగ దిగ్గనలేచి యందఱన్
సుజనతఁ జేరఁజీరి తనచూచిన స్వప్నముఁదెల్పఁ గోరుచున్
గిజ గిజలాడ నెమ్మనము క్రేవలఁజూచి వడఁకుచున్న "హా
విజయము రామచంద్రునకు వేగిరపాటు లడంగి యుండుఁడీ. 76

ఉ॥ సేతువుఁగట్టి వార్ధిపయి శ్రీరఘురాముఁడు లంకఁజొచ్చి యా
ఘాతుకు రావణాసురునిఁ గయ్యమునంబడఁగూల్చి సీతతో
బ్రీతిగ శ్వేత ఛత్రమునుబట్టఁగఁ బట్టపుటేనుగుమీఁద ని
త్యాతత మంగళ ప్రథితుఁడౌచు నయోధ్యకు నేగఁగంటినేన్ .77

చ॥ ఉరుతర రక్తవర్ణకుసుమోత్కర దామము కంఠమందు భా
సుర మగుచుండ, రక్కసులుచుట్టి విలాపము సేయుచుండ, ము
ష్కరుఁడగు రావణుండు చనఁగన్ ఖరవాహనుఁడంతకాశకుం
బరువఁగ నెల్లరాక్షసులు పంక్తిముఖుండును నీల్గఁగంటినేన్. 78

చ॥ సదయుఁడు రావణానుజుఁడు సజ్జన శేఖరుఁడవ్విభీషణుం
డుదితశుభోదయుండగుచు నుజ్జ్వలమాసిత పుష్పదామచే
ముదమున నొప్పఁగా సచివముఖ్యులు గొల్వఁగఁ గంటి నిద్ర, నే
నిది కలయైన నిక్కమని యెంచెద, జానకి నేలనొంతురే''?. 79

చ॥ అని వచియింపఁగా నిశిచరాంగనలంతటనుండి జానకి
న్మన మలరించు పల్కులను, మంచితనంబునుజూపు చేష్టలం
దనుపఁగనెంచియుండ, వసుధాసుత రాముని సంస్మరించుచున్
బనవుచు నేలమీఁదఁబడి పల్వగలందుచునుండె నంతలోన్. 80

=♦♦♦ హనుమంతుఁడు సీతకుఁ బ్రత్యక్షంబగుట. ♦♦♦=

ఆ॥ వె॥ చెట్టుమీఁదఁజెట్టు చివరికొమ్మను డాఁగి
యున్న హనుమ యింక నూరకుండఁ
దగదటంచునెంచి దగ్గఱికొమ్మకు
జేరి పలికెనిట్లు సీత వినఁగ. 81

సీ॥ "దశరథభూజాని తనయుండు జ్యేష్ఠుండు
రామచంద్రుఁడు ధర్మరతుఁడు, కైక
వరమున నడవులఁబరమమునుల్గొల్వఁ
బరమ తపస్వియై వరలుచుండ
నతని సాధ్వియు సీత, యనుజుండు లక్ష్మణుం

డారాము సేవింప ననుదినంబు
వారల వంచించి వసుధాత్మజను సీత
లంకాధిపతియైన రావణుండు.

తే॥ కొంచుఁబోయెను లంకలో నుంచెననుచు
వినిన రాముఁడు సుగ్రీవువేగఁజేరి
సఖ్యమొనరించి జానకి జాడఁగనఁగఁ
బంప వచ్చినవాఁడను బవనసుతుఁడ. 82

తే॥ జలధినవలీల దాఁటిన చతురుఁడనయి
లంక నిశ్శంకఁ జొచ్చిన రాముబంటు
సాధ్వి! నిన్నిందు నరసితి సంతసంబు
సేమమున నున్నవాఁడ యారాముఁడంబ''. 83

తే॥ పంక్తి కంధరునిశిత వాగ్వజ్రములను
బుండు కావింపఁబడిన యాపూతచరిత
చెవుల కప్పల్కులమృతంబుఁ జిలుకరించు
భేషజములౌచుఁదోఁప నవ్వింతకలరి. 84

తే॥ నలువలంకులు మఱిమఱి కలయఁజూచి
యేమియును దోఁచకుండిన నామెయంత
మోముపై కెత్తి చూచి యమ్మొగుద గనియెఁ
జెట్టుకొమ్మను నడఁగిన చిట్టిహనుమ. 85

వ॥ అంతనివ్వెఱ పాటొదవ సీతవ్యాకుల చిత్తయై యిట్లు చింతించె.

ఉ॥ "అక్కట! మర్కటంబు నహ హా! కలఁగంటిని జెట్టలెవ్వియో?
తక్కక రామభద్రునకుఁ దమ్మునకుణ్ శుభమౌత, నేనిటుల్

పొక్కుచునుంటి నిద్దుర యేఱుంగుదునే? యిది స్వప్న మెట్టులా
నుక్కువుఁడైన రావణుని యుత్కట మాయయయౌను నిద్ది
యయ్యె". 87

ఉ॥ నెమ్మదివీడి భీత హరిణేక్షణయై కలఁగుండుఁ జెందఁగా
గొమ్మనువీడి వాయుజుఁడు కోమలి! సొమ్మసిలంగనేల? నీ
యుమ్మలికంబు మానుమిఁక నొప్పుగ రాముఁడు నిన్నుఁగాంచువే
గమ్మున వచ్చువాఁడు ననుగాదిలి దూతనుగాఁగ నమ్ముమా!. 88

తే॥ నీదు వెనువెంటఁ గల్యాణి! నెమ్మనంబు
పాఱుటను నీ వియోగంబు భరముగాఁగఁ
గోసలేంద్రుని పుత్త్రుండు శోకమట్లు
కడపు రాత్రిల, నడిగె నీకౌశలంబు. 89

తే॥ పలికె సౌమిత్రి నీకభివాదనంబు
వానరాధిపుఁడడిగె నీభద్రమంబ!
నన్ను నొరుఁగాఁగ నెంచకు నమ్ముమార్య!
రాఘవేంద్రుని దూత నమోఘబలుని. 90

వ॥ ఇవ్విధంబున విశ్వాసంబుఁ బుట్టించ సతీమతల్లియగు సీత భయం
బుమాన నాంజనేయుండు వాలి మరణ కారణంబగు సుగ్రీవు
సఖ్యంబును నివేదించుచు సంతత సన్నిహిత రామనామ మంగ
ళంబగు నంగుళీయకంబు నొసంగిన. 91

ఉ॥ అత్తఱి జానకీరమణి హర్షము పొంగెను మేఱ మీఱ, వీ
రోత్తముఁడైన రాఘవు సముజ్జ్వల పాణిగ్రహించునాఁటి య
త్యుత్తమ హర్షసంపదకుఁ దుల్యముగాదది, వేయిరెట్లు, లో

కోత్తర హర్ష విస్మిత మృదూక్తుల నాయమపల్కె నిట్టులన్. 92

ఉ॥ "మారుతి! విశ్వసింతు నను మానము వాయఁగఁ దెల్పు నాకు, న
వ్వీరుఁడు రామచంద్రుఁడట పీస్థలి నెవ్విధినుండు, రూపమే
తీరు, మహావిశుద్ధమతి ధీరుఁడు లక్ష్మణుఁడెట్టివాఁడు, న
న్నారవి వంశశేఖరులహార్యబలుల్గొని పోవనెంతురే?. 93

వ॥ అనుటయు జానకీ విశ్వాసార్థంబు హనుమంతుండిట్లనియె. 94

ఉ॥ "నీరదవర్ణ శోభితుఁడు నీరజనేత్రుఁడు దీర్ఘబాహుఁడం
భోరుహ చిహ్నితాంఘ్రి యుగముం, గురుపీన విశాలవక్షముం
జారునిశాకరుం దెగడు చల్లని మోమును గల్గువాఁడు, పం
కేరుహ పాణిపల్లవుఁడు గేయచరిత్రుఁడు రామభద్రుఁడే. 95

చ॥ సతత కృపాప్రపూరితుఁడు, సత్యధురీణుఁడు, దుర్జయుండు, నా
శ్రిత జనవత్సలుండు, శుభశీలుఁడు నిత్యబహుశ్రుతుండు, సం
తతపితృభక్తిపూర్ణుఁడు విధాన సమర్థుఁడు, మానిపూజ్యుఁడా
యతగుణ సత్త్వవర్ధనుఁడహర్పతివంశ్యుఁడు రామచంద్రుఁడే.

ఉ॥ తమ్ముఁడు లక్ష్మణుండతఁడు ధార్మిక శేఖరుఁడంతవాఁడ, ని
త్యమ్మెడఁ బాయ కన్నకడ నంచిత వృత్తిని సేవసల్పు, వా
రిమ్ములనున్నవారు తరుణీ! ననుఁ బంపిరి నిన్నుఁగానఁగన్
నమ్ముము నాదు వాక్యములు, నాకయి యంగదుఁడంగలార్చె
డిన్". 97

ఉ॥ అంత విదేహరాజసుత యాహనుమంతునిఁ బాఱఁజూచి, య
త్యంత ముదంబునం బలికెనయ్య! నిశాచరచక్రవర్తి, న
న్నింతయు మూర్ఖుఁడౌచుఁ గరుణింపఁడు రామునకప్పగింప, నా

వంతయు మంచిలేదతనియందపమృత్యువు లాగుచుండుటన్. 98

చ॥ అనల విభీషణాత్మజయునట్టుల పల్కెను దల్లి పంప, నా
తని కడనొందుపాయములు దండము దక్కఁగఁ జెల్లకుండు, రా
మునికయి యెన్ని నాళ్లిటుల మూర్ఖుని బాధలనోర్చుకొందు, నే
మనివచియింతునయ్య! యొకమాసమె ప్రాణము నిల్పఁజాలు
దున్. 99

వ॥ అనుటయు దయమాన హృదయుండై మారుతాత్మజుండు సీతా
దేవింగాంచి చేతులు జోడించి సాంత్వ వచనంబులనిట్లనియె. 100

శా॥ “తల్లీ! యుల్లము వల్లవింపఁగనికం ధైర్యంబుఁ బాటింపు మా
తుర్విల్లుంబోతునుజంపి రాఘవుఁడు నిందోడ్కొంచుఁ బోనున్నవా
డుల్లాసంబున నిప్పుడేకొనఁగ నేనున్నాను సిద్ధుండనై
యుల్లంబొప్పనో, యొప్పదోయెఱుఁగ రాకుంటన్నిరీక్షించెదన్.

వ॥ ఇంత చిన్నవాఁడు నన్నెట్లుకొంచుఁ బోఁగలండు. అపారపారా
వారంబు తరియించు నప్పుడు తూలి జలంబులంబడిన దిక్కె
వ్వరు? భయంకరాకారులగు క్రూరరాక్షసు లడ్డగిలినఁ దప్పిం
చుకొన నుపాయంబెయ్యది? అని సందేహింపఁబనిలేదు. నిర
పాయంబుగఁ బారావారంబు నవలీల దాఁటంగలవాఁడ ననుట
నీకుఁదెల్లంబ. రాక్షసులడ్డగింతురేని గద్దతోఁ బెల్లగించి లంకా
పురంబును రావణ సహితంబుగ శ్రీరామసన్నిధిం బెట్టువాఁడ.
తల్లీ! యనుమానింపకుము. శ్రీరామభద్రుని కరుణా విశేషంబున
నెంతపనియైనంజేయ సమర్థుండ. నిదిగో చూడుము నా స్వరూ
పంబు అన్విత్రి విక్రముండువోలె భూనభోంతరాళంబులునిండి యే

కాకారుండై నిజరూపంబుఁ జూపిన నజ్జనక నందన సంతుష్టాంత రంగయై "మహాత్మా! సంతసించితి. నీవతి సమర్థుండవు. నీక సాధ్యంబులేదు. ఈరూపంబుపసంహరింపు" మని వెండియు నిట్లనియె. 102

చ॥ పరపురుషుఁ స్పృశింపఁదలఁపఁ సతికంచిత ధర్మమౌనె? సం
బరమునఁ బాతివ్రత్యమహిమం దశకంఠునిఁ మన్మఁజాలియుఁ
బరగఁగ రాముబాణములు పారణసేయుట లెస్సయంచు, నే
నరసితి వాయుపుత్ర! వినుమయ్యది యొప్పదె వీరధర్మమై. 103

చ॥ అనుటయు నంజనీసుతుఁ "డహా! సతికెంతయు నొప్పునీకు" నం
చునుగొనియాడి "సాధ్వి! ననుఁజొప్పడఁబంపుమ యానవాలుగై
కొని చనువాఁడ వేగనిటఁ గూడదు నిల్వఁగ జాగుసేయఁగాఁ
జనదిఁక వానరోత్తములు సంద్రము నవ్వలఁగాచియుండఁగఁ.

చ॥ వినుసతి! రామలక్ష్మణులు వేగమ యిచ్చటనుండువారు, న
న్ననుపుము ధీరచిత్తవయి యార్యుని రాముని జేరఁబోయినే
వినిచెద నీదువృత్తమును వీనులు రంజిల సాధుశీల! యా
తని పనికంతురార్పణ విధంబొడఁ గూర్చుచుఁ బోయివచ్చెదఁ"

వ॥ అని ప్రార్థింప జానకీదేవి నిట్టూర్పు విడిచి హనుమంతుంగనుం గొని యిట్లనియె. 106

ఉ॥ "వాసిగఁ జిత్రకూటమున వర్తిలుచుండఁగ నొక్కనాఁడు కా
కాసురుఁడేగుదెంచి మదమ్కై నను నొవ్వఁగఁజేయుచుండ, నా
భాసురమూర్తి రాఘవుఁడు పంకజసూతి శరమ్ముగాఁగ పుల్
సేసి విడన్మహార్తుఁడయిచేరి 'శరణ్యుఁడ! కావుమం'చనఁ. 107

ఉ॥ కాచితిఁబొమ్మటంచు నొక కన్నుతొలంగఁగఁ జేసిపంప, నా
నీచుఁడుపోయె, రాఘవుని నెమ్మదికెక్కఁగఁ దెల్పుమిద్ది, నే
డాఁచు శిరోమణింగొనుము దాశరథిప్రియ! యంచు నీయఁగాఁ
జూచి ప్రభంజనాత్మజుఁడు చొక్కుచుఁ జేతులుమోడ్చి
మ్రొక్కుచున్. 108

ఉ॥ చుట్టు ప్రదక్షిణించి మనసున్ రఘురాముని మీఁదనిల్పి, బ
ల్దిట్ట తనంబుమీఱఁ జనుదెంచెద మాతరొ! యంచుఁ బల్కనా
చిట్టి సమీరణాత్మజుఁడ! చేరి రఘూత్తముఁబల్కు మీవునా
గట్టి నమస్సు, లాతనికిఁగా బిగఁబట్టితిఁ బ్రాణమంచునున్. 109

ఉ॥ తల్లినిఁబోలె నన్నుఁ దనతండ్రినిఁబోలెను రామచంద్రునిం
జల్లఁగ జూచుకొంచు, మనసారఁగఁ గొల్చుచునుండ దుర్మతిం
దల్లడపెట్టి లక్ష్మణునిఁ దత్ఫలమందితి మారుతీ! యతం
డుల్లమునందునొచ్చ కొనకుండ ననుంగృపఁజూడఁ దెల్పుమా!.

వ॥ రామలక్ష్మణ సుగ్రీవాదుల కుశలంబడిగితి ననుము, పోయిరమ్ము
నీకు భద్రంబగుఁగాతమ''ని దీవించిపంపిన నమ్మారుతసూతి సీతా
సతి వీడ్కొని చనువాఁడై తనరాక రావణాసురున కెఱిఁగింప
నిశ్చయించి. 111

—: లంకాపురంబున నాంజనేయుని వీరక్రియలు. :—

మ॥ తనజాతీయతఁబూని యవ్వనమునం దంత్రజ్ఞుఁడై భూజముల్
మునివేళ్లాడఁగఁ బీకివైచి, ఫలముల్పుష్పంబులం ద్రుంచి, చ
ల్లినఁ దద్రక్షకులుగ్రులై యెదురు రాలీలంబడన్మోఁదిసం
జనిరవ్వారలు కొల్వులోఁ దెలుపఁగన్ సత్రాసముం జెందుచున్

వ॥ చని పేరోలగంబున నున్న రావణుం గనుంగొని. 113

మ॥ "అరయన్వానర మొక్కఁడెక్కడిదొ యయ్యా! తోఁటలో దూఱి మ
మ్మురయంబుద్ధతి మీఱమోఁది పెలుచన్ భూజంబులం గూల్చి, య
త్తరు శాఖంబులఁదుంచి వేయఁదొడఁగెం దాదవ్వులందీఁగలన్
వరుసంబువ్వులరాల్చి, చీల్చి, నెడఁగై భంజించుచుండెన్వెసన్.

ఉ॥ దగ్గఱఁజేర నీఁడు భయదంబగు వాలముఁద్రిప్పి మోఁదుచు
న్నగ్గుగఁ జేతుమిమ్మని యనుంబెదరించును దుర్నివార్యుఁడై
ముగ్గుఱ నల్వురం జఱిమి మోములు రాచుచు నెక్కిరించుఁదా
డిగ్గునఁ జెట్టుపై కెగిరి తేఱి కనుంగొను వింతతోఁపఁగన్". 115

చ॥ అది విని రావణుండపుడ యంతకు కింకరు లట్టులుగ్రులై
మదమునఁబొల్చు కింకరుల మానుగఁ బంపఁగ జంబుమాలితో
నిది యొకలెక్కయేయనఁగ నిద్ధబలుండగు మారుతాత్మజుం
డదురక తోఁకఁజుట్టి వడినందఱనంతకు ప్రోలికంపుచున్. 116

చ॥ వడిఁజని చైత్య తోరణముఁబ్రాఁకి పరీక్షణసేయుచుండె నె
వ్వఁడొ యిఁక వచ్చువాఁడని, జవంబునఁ గావలివారలేగి య
క్కడి చరితంబుఁదెల్ప, నెడఁగా! నినువీడఁగరాదటంచు బల్
దుడుకుల మంత్రులైదుగుర దోర్బలశాలులఁజేరి యిట్లనన్.

తే॥ "విడువకుఁడు కోఁతి జీవముల్వోడలనీకుఁ
డట్టె బిగఁబట్టి మెడ త్రాడుగట్టితెండు
ద్వారమున వానిఁగట్టెంతు, వచ్చువారు

పోవువారలు ఛీయని పోటుపోడువ". 118

చ॥ అని పనుపంగ మంత్రులట కై దుగు రేగినఁ దోరణస్థలిం
గనుఁగొని పావమాని గడెఁగ్గై కొని త్రిప్పుచు రాముబంటుతో
నని యొనరింప నచ్చితి రె? యంతకు వీటికిఁ బంపువాఁడరం
డని యొకరొక్కరిం బడమినార్చుచుఁ గూలఁగనేసె వీరుఁడై.

వ॥ అంత లంకాధి నాథుండు విదిత వృత్తాంతుండై యాశ్చర్యపరీత చేతస్కుండగుచు నిగ్రహంబునఁగాని వానగుని దౌష్ట్యాపుడంగ దని నిశ్చయించి, సమరతంత్ర కోవిదుండును, శత్రునిగ్రహాతి చతురుండును, నిజకుమారుండునగు, నక్షకుమారుంగాంచి యి ట్లనియె. 120

ఉ॥ "చూడఁగఁ గ్రోఁతియై ప్రబలశూరుల నుక్కడఁగించుచుండె నె వ్వాఁడొ కుమార! వీనినిఁకఁ బ్రాణముతోడను విడ్వరాదు, నీ వాఁడి మగంటిమిన్నెఱపి వారకచంపుము, లెమ్ము, పొమ్ము,"
నా

వాఁడు శరాసనమ్ముఁగొని వాయుజుఁ దాఁకఁగనేగె నంతటన్.

ఉ॥ దూరమునుండి చూచి పటుదోర్బలశాలి యెవండొ వీఁడుబల్
శూరుఁడనంచు వచ్చెడిని జూచెదఁగాకని పొంచి పొంచి, యా
తోరణమందె వాయుజుఁడు ధూర్తుఁడుపోలెఁబవరి లంగ న
వ్వీరకుమారుఁడక్షుఁడు బిభీషికఁగొల్ప శరమ్ములేసినన్. 122

చ॥ శరములు ఫాలభాగమున జల్లున నెత్తురుగాఱ నాఁటఁగన్
సురగరుడోరగ ప్రముఖశూరులు వింతగొనంగ నంజనీ
వరసుతుఁడాకసంబునకుఁ బ్రాఁకెను దానిపిఱు దనక్షుఁడుం

బరగరణంబుసేయఁ బరవం, బవమానసుతుండుక్రుద్ధుఁడై. 123

చ॥ వడిఁదనముష్టిఘాతమున వానిరథంబును బిండిసేసి, యె
క్కుడు పవమానవేగమున 'కోబలి' యంచును గాళ్లుపట్టివేఁ
బుడమికి నేగుదెంచి భుజముల్ శిరమంగములెల్లనుగ్గుగాఁ
గడిమినిమోఁది చంపి వడిగల్ యమునొద్దకుఁబంపె నాతనిన్.

తే॥ తొల్లికూర్చుండి యుండిన తోరణంబు
స్తంభమును ద్రిప్పి యగ్గిచే దగ్ధపఱిచి
వేఱుప్రాసాద మొక్కటి వేగనెక్కి
కూరుచుండెను మారుతి గుఱుతుగాను 125

చ॥ అదివిని రావణాసురుఁడహంకృతి మీఱఁగనుగ్రుఁజూచు, వి
ద్యాది యొక యద్భుతంబనుచు, నక్కట! యిక్కపియెంతసేసె, దు
ర్మద మడఁగింపకున్ననిఁక మానము దక్కనె యంచునెంచి, స
మ్మదమున నింద్రజిత్తను కుమారునిఁగన్గొని పల్కెనిట్టులన్. 126

తే॥ "అమరపతి గెల్చి యింద్రజిత్తనఁగఁబరగి
సమరమున నిల్వనిన్నని యమరవరులు
పరుగులిడుచుండ నీశౌర్యగరిమకడలి
యిజ్జగంబున నీకెదురెవ్వరయ్య! 127

ఉ॥ చాలుదు ముజ్జగంబులను జాతురిగెల్వఁగ మాయలాఁడవై
కేళియపోలె నీకుఁబరికింప రణమ్మొనఁగూడెనేని, దు
ష్టీలుఁడు కోఁతియెంత, వననీమను బట్టుము, కట్టితెమ్ము, నా
కాలయులబ్బురంపడఁగఁగయ్యము గల్గినఁబందువేగదా"? 128

చ॥ అని వినుతింప నింద్రజితుఁ డంబరమంటఁగ నుత్సహించి, స్యం
దనమున నిలిపెంపెసఁగఁ దండ్రికిఁ బ్రీతిగ బైలుదేఱి, య
వ్వనమునఁ దోరణస్థలిని వాయుజుఁగన్గొని యార్భటింప, న
వ్వన చరుఁడంత దిక్కులు నభంబును మ్రోఁగఁగగర్జచేసినన్.

చ॥ గుఱిగొని వేయుబాణములు గొబ్బునఁ బ్రక్కకు జాఱిపోవున
ట్లురు దగులీల సంధిలఁగ నాడుచు మారుతి నిర్వికారతం
బరగుచునుంటఁజూచి బలవంతుఁడు రాక్షసరాజ సూనుఁడ
చ్చెరువుదలిర్పఁ జిత్తమునఁజింత యెసంగఁగనిట్లువాకొనెన్. 130

చ॥ "ఇతఁడొక యద్భుత ప్రకృతి యెవ్వఁడొ చూడఁగఁ జోద్య
మయ్యె, నా
తత శరజాలముల్ తెగెఁ,. దాఁకద యొక్కటియేని నాతనిన్
వితయగు నాదుపౌరుషము వీనినడఁపక యున్న నేఁడు. నా
మతికితఁడొనవధ్యుఁడసమాన బలోన్నతుఁడై యజయ్యుఁడున్.

చ॥ అతులనియెంచి వీని దురహంకృతిఁబాపక యుండుటెట్లు? నా
పటుతర శౌర్యముద్రయది పాడయిపోవదె? యింద్రజిత్తనన్
దటతట గుండెలందడలు తట్టఁగ దేవతలుర్కుచుండ, నీ
చటులవనేచరుంబలిమిఁ జయ్యనఁబట్టుటనాకసాధ్యమే"? 132

తే॥ అనుచు నభిమంత్ర పూర్వకముజ భవుని
యస్త్రమేసినఁ బెనుమంటలశరనదియు
నాంజనేయుని బంధించె, నంతనతఁడు
బ్రహ్మవరమును దలపోసి పట్టువడియె. 133

తే॥ కాని బ్రహ్మాస్త్ర మంత్రంబుఁబూని జపము

సేయనయ్యాది సడలినఁ జిత్తమందు
నలరి బంధితుఁడై నట్టులభినయింప
రక్కసులు తాళ్ళఁగట్టిరి ఱెక్కలకును. 135

తే॥ పట్టికట్టిన శణవల్క పాశబంధ
మబ్జభవు నస్త్రబంధంబు నడఁచివైచి
చెరనుఁబడియున్న దేవతా స్త్రీలబంధ
ములను విడిపింప హేతువై వెలసెనపుడు. 136

—: హనుమంతుని రావణుని కొలువునకుఁ గొనిపోవుట. :—

ఉ॥ ఱెక్కలు విర్చికట్టి తమఱేనికిఁ జూపఁగ నేగురాక్షసుల్
చిక్కితి వింకఁగ్రోఁతి! నినుఁజీల్తుము రమ్మని నెత్తిమొట్టు, మీ
పక్కలు విర్గునింక ననుభావముతోఁ దలనిక్కఁబెట్టి న
ల్దిక్కులు సూచుచుందనకు దిక్కెవరన్నగ నాతఁడేగఁగన్. 137

ఉ॥ వీధులకెక్కి కొందఱును వేగమమేడలనెక్కి కొందఱున్
సాధువుగాఁడు వీఁడితనిఁజంపక వీడకుఁడంచుఁ దెల్పఁగన్
బాధలు పెట్టఁగేకలిడు బాలకులందఱు గుంపుసేర, ర
క్షోధిపురాజ వీధులను జూచుచు మారుతియేగె వారితోన్.

చ॥ కొలువుననుండె రావణుఁడు, కోవిదులైన యమాత్యులెల్లరున్
వలపటి భాగమందితర పౌరులు దాపటి యాసనంబులన్
వలయముగాఁగ నొప్పుచునవారిగ ఱేనికి రాజ్యతంత్రముల్
దెలుపుచు నుండునంత నరుదెంచిరి మారుతితోడ రాక్షసుల్.

ఉ॥ చూచెను మారుతాత్మజుఁడు సొంపుదలిర్పఁగ సింహపీఠిపై
నేచిన నీలశైలమున కీడయిపొల్చెడు రావణాసురున్

వీచుచు వీవనల్గొనుచు వేల్పుపడంతులు సేవసల్ప, స
దోగ్ర్రచులు పర్వనల్గడలఁ దోయదమట్టుల నెల్గుచుండఁగన్. 140

తే॥ నలువలంకులఁ దేజంబులలముకొనఁగఁ
బదియు మోములు నిరువది బాహువులును
గలిగి చెలువొంది గాంభీర్యకలితుఁడగుచు
భీకరుండైన రావణు జోకఁగాంచి. 140

తే॥ మనమునందునఁ దలపోసె హనుమయిట్లు
“త్రిభువనంబుల నేలెడు ప్రభువనంగఁ
బరిబలకుండునె యీతండు ఘోరఫీమీఱఁ
గడిఁది రాక్షసభావంబు గలుగకున్న”. 142

తే॥ అపుడు వీక్షించి రావణుఁడాంజనేయు
విస్మయావిష్ట చిత్తుఁడై నెఱఁగుదోఁప
శంకరుని శైలమెత్తంగ శాపమిడిన
నంది చనుదెంచెనని యెంచె డెందమునను. 143

వ॥ అంత రోష భీషణాకారుండై ప్రహస్తుంగాంచి యీతని వృత్తాం
తంబు విచారించుమని నియోగించిన నాతండు. 144

ఉ॥ “ఎవ్వఁడవీవు వానరుఁడ! యేమి పనింగొనివచ్చినావు, ని
న్నెవ్వరు పంపిరిచ్చటికి, నేమికతంబున రాక్షసాలితోఁ
జివ్వకుఁబూనుకొంటి, విసిసీ, వనవాటికఁ దుగ్రింపనేల, వా
క్రువ్వము సత్య, మిట్లు కనుఁగొంటిమె, వానరులింతవారలే”?.

వ॥ అని ప్రశ్నించుటయు నలక్ష్యభావంబున నాతనింజూడ నొల్లక రా
క్షసరాజుంగనుంగొని గంభీరంబుగ హనుమంతుం డిట్లనియె. 146

చ॥ “వినుమిటు నేను వానరుఁడఁ, బేరునను హనుమంతుఁడందురినిం
గొనకొని చంకఁబెట్టి వడిఁగొంచు సముద్రములెల్లఁ ద్రిప్పు న
వ్వనచరువాలిఁ జంపి, మొగివచ్చిన నీఖరదూషణాదులన్
రణమున నొక్కఁడే నిలిచి రాణనుజంపిన రాముబంటనేన్.147

ఉ॥ శైలము నెత్తఁ జేయుదుము శంకరుచాపము రెండుతుంటలై
ప్రీలఁగఁ ద్రుంచి, గర్వమునవేగమ తాఁకినఁబట్టి, కట్టి, నిన్
ప్రేలఁగ బంధమూడ్చుకృతపీర్యుని పుత్రునడంచు రామునిన్
లీలఁబరాభవించి ధరణీస్థలిఁ బేర్చిన రాముబంటనేన్. 148

ఉ॥ రాముఁడరణ్యవాసమున రంజిలుచుండఁగ దుష్టబుద్ధివై
భామను సీతఁ గైకొనుచు వంచనఁబాఱితి వంచెలింగి, యా
భామినిఁ గూర్చి రాఁగ వినుభాస్కర వంశ్యులకయ్యె స్నేహమో
కామమదాంధ! రాఘవుని కాంతను దెచ్చుట నీవు దక్కుదే?.149

తే॥ ప్లవగ రాజైన సుగ్రీవ ప్రభుఁడు నన్నుఁ
బనుప వచ్చినవాఁడను బవనసుతుఁడ
సీత వెదకుచు వచ్చితిఁ జేరికంటి
నీపురంబున నాసతి నిర్మలాత్మ. 150

చ॥ నినుఁగని పోవఁగా నుపవనింగల భూరుహపంక్తిఁ గూల్చితిన్
నను నడఁగింప రాఁగఁగలనంబొలియించితి నాత్మరక్షకై
ఘన భుజులైన రాక్షసులఁ గన్గొని యేఁగఁగఁ “గట్టుపడ్డవాఁ”
డని తలపోయఁ జిక్కితిని నంతియు, రాముని బంటుచిక్కునే?.

తే॥ అర్కతనయుండు నీభ్రాత యడిగె నిన్ను
గౌశలంబును, ధర్మార్థకలితమైన

వాక్యములుపల్కి, ధర్మ సంవర్ధనముగ
సజ్జనులు మేలె తలంతురు సంతతంబు. 152

చ|| తపములొనర్చియుం జపముఁ, దప్పక, ధర్మము లెర్గువాడవై
చపలతఁబూని యంధతమసంబునఁగూలఁగ వంశనాశకం
బపమృతి సాధనంబయిన యార్యసతీహరణంబు సేయుటే?
కుపితునిఁజేసి రాఘవునిగూలక యుండఁగ నీకు శక్యమే?. 153

వ|| ధర్మార్థ తత్త్వంబెఱింగిన నీవంటి బుద్ధిమంతులు అధర్మ కార్యంబులయందుఁ బ్రవేశింపరు. పరదారాపహరణంబునకు మించిన యధర్మంబెద్దిగలదు? ధర్మ విరుద్ధంబులైన కార్యంబులు బహ్వాపాయభూయిష్ఠంబులై మూలచ్ఛేదంబుఁగావించు, రామచంద్రునకుఁ గీడుఁదలంచి జీవించి సుఖించువాఁడు ముల్లోకంబులలేఁడు. ఇందుఁనింతటివాఁడు రామున కపకారంబెంచి బ్రదుకఁజాలఁడనిన నీవెంతవాఁడవు? చక్కఁగా నాలోచింపుము. శ్రీరామ చంద్రుండు సాక్షాన్నారాయణాంశ సంభూతుండు. అతండు ధర్మ సంరక్షణార్థంబవతరించినవాఁడు ఇట్టి యధర్మంబులింకఁ జెల్ల నేర్చునే? నీకు హితవుపదేశించితి. నాపలుకులు తలంచి జానకిని నారామభద్రున కర్పించి తప్పు క్షమింపుమని యాతని శరణువేఁడి సుఖంపదుము. ఆతఁడు శరణాగత రక్షణ బిరుదాంచితుండు. త్వరపడుము. లేదేని. 154

చ|| ఘనతర కార్ముకోచ్చలిత కాండచయంబులు పర్వులక్ష్మణుం
డనితర సత్త్వశాలియయి యన్నకుఁదోడుగ నిల్చనంగరం
బొనరుప ముజ్జగంబుల సముద్ధతులై యొనరించునట్టి నా

రినిఁ బరికించి నాకు వివరించుము చూచెద నెట్టివారలో. 155

ఉ॥ వచ్చెడువారు వానరులు, వారికి నాథుఁడు రాముఁడున్న రుం
డచ్చుగ నీవరంబునకు నడ్డొక యించుక లేకయుండు, నీ
మెచ్చునధర్మమున్విడిచి మేలగు మార్గముఁబట్టకున్న నీ
చచ్చుట నిక్కమౌను, దగజానకి రామునకిమ్ము రావణా!. 156

చ॥ తలఁచితినేని నేనొకఁడఁ దత్క్షణమియ్యొకలంకలంక, ను
జ్జ్వలతర సౌధసంభరితఁజారు మణీమయ గోపురాన్విత
న్విలయము సేయఁజాలుదును, వీరప్రతిజ్ఞకు భంగమేలయన్
తలఁపుననుంటి, రాఘవుఁడెదందలపోయును ధర్మయుద్ధమున్.

ఉ॥ నీకడనున్న సీతసతి, నీగళపాశము, కాళరాత్రి, నీ
పీఁక నడంచు పన్నగియు, వేగమ రామునకప్పగించి య
ఆఁకటఁబాపు కొమ్మవని నభ్యుదయంబు తొలంగకుండఁగా
నీకు శుభంబు సౌఖ్యమునునిల్చును రావణ! రామునత్కృపన్.

వ॥ అత్తఱినమ్మారుతి మాటలు కాలచోదితుండైన రోగికమృత
ప్రాయంబైన యౌషధంబేని రుచింపక విసుఁగుఁ గలిగించునట్లు
ద్రేకంబుఁ బురికొల్ప రావణుండు. 159

ఉ॥ భీషణ రోషదీప్తుఁడయి వేగమయిక్కపిఁజంపుఁడంచు దు
ర్భాషలనాడుచున్నిశిచరావళిఁగన్గొని హెచ్చరింప, స
ద్భేషజమట్లు డగ్గఱి, విభీషణుఁడన్నకుఁ దాపమార్చి, సం
తోషముఁగల్గఁజేయు ఫణితుల్దగఁబల్కెను నివ్విధంబునన్. 160

ఉ॥ "దూతలు వధ్యులేపుడమి దుర్జన వృత్తమురాజధర్మమే?
యీతని వాక్యదోషముల కెవ్వరొ బాధ్యులెఱుంగకుండదు

ర్తితి పనుండవై యితని నిల్వునఁజంపుట దూష్యమయ్యెడిఁ
ఖ్యాతిగమంచి చెడ్డలను గన్గొని దండవిధాన మర్గమూ". 161

తే॥ అతని మాటలు వినఁగ సయ్యాతుధాన
చక్రవర్తి యుంబలికె రోషంబుమీఱఁ
"బాపులను జంపఁగలదె పాపంబుజగతిఁ
గానిప్పాపిఁ జంపుదు మానకిపుడు. 162

తే॥ వినఁగ నవ్మాటఁబలికె విభీషణుండు
"అకట? యిది ధర్మమార్గమే, యార్యమతమొ?
వినుము లంకాధినాథ! కోపింపకయ్య!
దూతహననంబు సజ్జన దూష్యమీలను. 163

తే॥ తలఁప దూతకు దండముల నరుఁబెక్కు-
లుగ వైరూప్యమేని, కశాభిఘాత
మేని, నంగంబు ఖండించు టేనిగలదు
గాని చంపుట యెందును గానమధిప!. 164

తే॥ కపినిఁజంపిన ఫలమొందుగలదె మనకుఁ
బరులమాటలు పలికినవాఁడ యితఁడు
సాధువైనను బరగనసాధువైనఁ
బలుకు ధర్మంబు 'దూతయువధ్యుఁ'డనుచు. 165

తే॥ ఇతనిఁజంపిన మఱేమ్ముకండితనిఁబోలు
ఖేచరుండున్నె మదిఁబరికించిచూడు
ధర్మగతి నీకుఁదెలియని మర్మమున్నె
కనఁక నీవెట్లు నరులను నడఁప గలవు?. 166

వ॥ ధర్మాధర్మ విదుండవైన నీవు కోపంబునకుం జోటీయందగునె? కో
పంబునడంచుట సత్త్వసంపన్నుల లక్షణంబు. ధర్మవాదంబునం
గాని, లోక వృత్తంబునం గాని, శాస్త్ర గ్రహణంబునం గాని,
నీతో సమానుని మఱియొక్కనిని ముల్లోకంబులం జూపుము ఈ
దూతను జంపుచో సమస్తమైన యాపదలు నిన్నుం జుట్టు
ముట్టును గదా? లోకాపవాదము తప్ప మిగులునది యేముండును?
ఇట్టి దూతను బంపినవారెవరో వారిని సంగరంబునం జంపం బ్రయ
త్నించుట యుక్తంబుగాని, సకల సురాసురులకజయ్యుండ
వైన మహావీరునకు నీకు వార్తాహరుండైన దూతం బరిమార్చుట
హేయంబుగాదె"? అని యుపదేశింప విభీషణు వాక్యంబు లంగీ
కరించి రావణుం డిట్లనియె. 167

ఉ॥ "దూత యవధ్యుఁడన్న నుడి తోఁచును యుక్తమయంచుఁ గాని, దు
ర్నీతి పరుండు గానఁ గరుణింపఁగ యుక్తముగాదు కావునం
గ్రోఁతికి వాలమే ప్రియము, కోకలు చుట్టుచు, నగ్గి పెట్టుచున్
హేతువుఁ జాటుచుం బురిని నిక్కపిఁ ద్రిప్పుఁడు, వీడుఁ డవ్వలన్"

మ॥ అని యాదేశ మొసంగ నద్దెసలఁ గ్రవ్యాదుల్ కపింబట్టి తోఁ
కను బల్కోకలు చుట్టి, తైల పరిషిక్తంబౌనటుల్ సేసి, య
గ్గిని నూల్కొల్పఁగ వాయుజుండు పొలిచెం గీర్తింపఁగా రాఘవుం
డనయంబెత్తిన ధర్మదీపకలితాయామధ్వజస్తంభమై. 169

## ♦♦ లంకాదహనము ♦♦

ఉ॥ మూఁగిరి రాక్షసాధములు. మ్రోఁగెను దుందుభికాహళధ్వనుల్

సాగిరి వీధి వీధికిని జాటఁగ, నప్పుడు మారుతాత్మజుం
డేగుచునుండె వెంబడిని నేమి యొనర్చిన నోర్చుకొంచుఁదా
మూఁగయుబోలె రాక్షసుల మూఁకలు పెక్కులు చేరునంతకున్

చ|| "జయరఘువీర! భూభరణ! జానకినాయక! చిత్తగించవే,
భయమును బాపవే, యనుచు వాలముఁ ద్రిప్పుచు మూఁగు మూఁకలుం
భయమున నార్చుచుం బరప బంధవిముక్తిని నందియుక్తి, ని
ర్భయముగ రక్షకావళులఁ బట్టి వధించె విజృంభితాత్ముఁడై. 171

వ|| అప్పుడు కొందఱు రాక్షసులు పఱతెంచి సీతతో, "అమ్మా! ఇంతకుమున్ను నీతో ముచ్చటించిన వానరునిఁ బట్టుకొని రాక్షసులు తోఁకకు బట్టపేలికలుచుట్టి నిప్పంటించి" రని చెప్ప నాయమ బహుదుఃఖితయై యుపస్థాన పూర్వకంబుగా నగ్నినిఁ బ్రార్థించి యిట్లనియె. 172

చ|| "సురగరుడోరగాదులును, సూర్యుఁడు, చంద్రుఁడు సాక్షిగాఁగ, నే
నిరతము సత్ప్రవృత్తనయి నిర్మలచిత్తత భర్తృసేవయే
పరమవ్రతంబుగాఁ దలఁచి భక్తిపరాయణనై తలిర్తునేన్
వరలెడు నంజనీతనయు వాలముఁ గాల్పక యగ్నిచల్లనై". 173

చ|| అనుటయు వాయుసూనునకు నగ్నిభవంబగు తాపమించుకేఁ
గనుపడకుండ నాతఁడును గర్జిలి మేడలు గోపురంబులున్
వనములు వాహనంబులును, వారక దుర్గములెల్ల చోటులుం
గొనకొన్ని యంటుపెట్టెను నకుంఠిత దీప్తులు మిన్నుముట్టఁగన్.

ఉ॥ పాఱిరి దిక్కుదిక్కులకు బాలురు వృద్ధులు దిక్కులేని వా
రై రిది యేమిఘోరమని యార్చుచు హాసుత? హాపితా! యటం
చౌర! యితండు వానరుఁడె, యారయమృత్యువె, లంకఁజొచ్చెనీ
ఘోర వినాశహేతువగు క్రోఁతి నెపంబున నంచునేడ్చుచున్.

తే॥ పలువురొక చోటఁగూడి యప్పవన తనయు
చెయ్దమును గూర్చి చింతలు సేయుచుండ
లంక నిశ్శంక నల్వంకరగులుకొల్పి
తోఁకఁ జల్లార్చెలవణాబ్ధివీఁక హనుమ. 176

తే॥ వెనుకకును దిరిగిచూడ నవ్వీటనొక్క
చోటు మిగులక యుండంగగాటముగను
బొగలు మంటలు మిన్నంటిరగులుచుండ
సీత తలఁపునఁదట్టంగఁ జింతమునిఁగి. 177

తే॥ అకట! యెంతటిమోసంబు నరయనైతి
వెనుకముందులు చూడక విశ్వమాత
సీత నాహుతిచేసితిఁ జిచ్చునందుఁ
గనలు చిత్తమునకు వివేకంబుగలదె?. 178

తే॥ రతనమును జూడ వెదకితి జతనమొప్ప
దైవ కృపచేతనదియులబ్ధంబుగాఁగ
నిలుపుకొనలేక నెట్టినె తొలఁచుకొంటి
నింతమూఢుండుగలఁడె యీయిలనునరయ?. 179

తే॥ ఎవరి కొఱకై ప్రయత్నించి యిన్నిపాట్లు
పడితి వారలఁగోల్పోయి ప్రజ్ఞలేక

పడితి గోతను నీఁకనెట్లు పరువునిలుచు
జాతికోలఁదియబుద్ధియఁ ఖ్యాతితప్పె?. 180

ఉ॥ ఇవ్విధి మూలఘాతినయి యేగిననాకు శుభంబుగల్గునే?
యెవ్వగ రామచంద్రునకునే వినిపించెద నిట్టివృత్తముఁ
నిర్వ్యాజపాటు సంధిలఁగ నీల్గరఘూద్వహుఁదొట్టి యెల్లరు
న్నవ్వుల కాకరంబయిన నాబ్రదుకేలకో యిజ్జగంబునఁ. 181

ఉ॥ లంకనుగాల్చునప్పుడు నిరంకుశ దీప్తులఁబెల్లురేఁగి న
ల్వంకలఁజుట్టుముట్టి, నను, వాలముఁ, గాల్పక యున్నయగ్నిని
శ్శంకతఁనెట్లు డగ్గఱిలు జానకి సాధ్వీద్రిలోక పావనిఁ
సంకట మొందనేల విలసద్రఘు వీరు కటాక్షముండఁగఁ”.182

తే॥ అనుచుఁ జింతించు నవ్వేళ నాకసమున
జారణులు సీతనిరపాయ సాధ్వియనఁగఁ
బవనతనయుఁడు సంతోష భరితుఁడగుచు
నామెఁగనుఁగొని యేగఁగా నచటికరిగె. 183

తే॥ హనుమ యేమయ్యెనోయని యడలుచున్న
జానకికి శుభవార్తను సరమదెలుపు
చున్నయంతన మారుతసుతుఁడురాఁగఁ
జూచి కడుసంతసించె నానుదతియపుడు. 184

మ॥ అకలంకంబగు సత్వ్యమున్మెఱయనయ్యా! మారుతీ! నీకు న
శ్శకమా కార్యములేదు ముజ్జగములఁ సంతోష సంధాయివౌ
టకు వేగంజని రామ లక్ష్మణులతోడన్వచ్చి యాలోకకం
టకునిం దున్మచునన్ను రాఘవుని నెంటంగొంచుఁబోనొప్పదే?.

ఉ॥ అనుటయు నంజనీతనయుఁడమ్మరో! రాముఁడువచ్చువేగన
వ్వనచర వాహినీయుతుఁడు వారక శత్రువునుక్కడంచి నీ
మనమున సంతసంబడర మానిని! తోకొని యేగువాఁడు, న
న్ననుపుముదేవి! నీకివె ప్రణామములంచును వీడుకొల్పఁగన్.186

—: హనుమంతుఁడు తిరిగి కిష్కింధ కరుగుట. :—

చ॥ చెలఁగుచు సింహనాదమును జేయుచు మారుతి నింగిఁగన్పడం
జలనిధి తీరమందు బలుసంబర మొప్పఁగ నంగదాదులుం
గిలకిలలాడుచుంగరము కేకలువేయుచు మూఁగునంతలోఁ
బలుకుచు సీతఁగంటినని వాలెను మారుతి వారిముందఱన్.187

ఉ॥ వాలిన జాంబవత్ప్రముఖ వానరవీరులు సంతసించుచున్
లాలన సేయుచున్మనసు రంజిల వన్యఫలంబులిచ్చుచుం
జాలితి వబ్ధిదాఁటఁగను సాటియెవండని యుబ్బఁబల్కుచుం
బోల మహేంద్ర పర్వతము పొంతనుజేరిరి నృత్తమారయన్.

చ॥ అడుగఁగ నాంజనేయుఁడును "నబ్ధిని దాఁటుచునేగి లంకలో
నడుగిడి తిరిగితిరిగి యరయంగ నశోకవనంబునందుఁజే
డ్పడెడు విదేహరాజసుతఁబావని సీతనుఁగాంచి యంతటం
గడుకొని రాక్షసాధములు కయ్యముసేయఁగ వారిజంపుచున్.

ఉ॥ చూచితి రావణాధమునిఁ జొప్పడఁబల్కితి నోలగంబునన్
నీచుఁడు తోఁకఁగాల్చుటకు నిర్ణయముంబొనరింప రాక్షసుల్
గోచులుచుట్టి కాల్పఁగను గోపమెసంగఁగలంకఁ గాల్చితిం
జూచితి సీత భద్రయట సొంపుగవచ్చితి వార్తఁదెల్పఁగన్".190

వ॥ అని సముద్రలంఘనంబును దొరకొని జరిగిన వృత్తాంతంబంతయు

సవిస్తరంబుగా, నివేదింప నంగదాదులు పరమానందకందళితాం తః కరణులై వేగమపోయి రామ సుగ్రీవులకవ్వార్త వినిపింప వలయునను సంతోషంబున నక్కడినుండి బయలుదేఱి యెగు రుచు, దుముకుచు, గంతులిడుచుఁ, గేకలిడుచు, నొండొరు లఁగౌఁగిలించుకొనుచు, ముచ్చటం పడుచుఁ, బరుగులిడుచుఁ, వచ్చువారు మార్గమధ్యంబున నందన వనసదృశంబును, సుగ్రీవ ప్రేమ పాత్రంబును, దధిముఖ పాలితంబునైన మధువనంబుం గాంచి యందుఁ బ్రవేశించి. 191

చ॥ మధువులఁగోలి పెల్లడరిమర్కట చేష్టలఁజిందులాడఁగం
దధిముఖుఁడన్వనేచరుఁడు తద్వన సీమకు రక్షకుండు పె
న్గదఁగొని యడ్డురాఁగఁగడుగర్వితులై పరిహరించి పంపఁగ
న్మధువన పాలకుల్బెదరి మండుచుఁబాఱిరి ఱేనిచెంతకున్. 192

వ॥ రామలక్ష్మణుల చెంతనున్న సుగ్రీవునకు సాష్టాంగ ప్రణామంబు లాచరించి గడగడ వడంకుచు గద్గదస్వరంబుల దధిముఖు ము న్నిడుకొని యిట్లని విన్నవించిరి. 193

ఉ॥ చేవఁదలిర్చు వానరులు చెంగట నంగదుఁ డాంజనేయుఁడున్
భావములందు నుల్లసిల భానుజ! నిర్భయులై వనంబునం
దాఁవుచునుండఁగా మధువు దండ్యలు మీరని యడ్డుచెప్పఁగం
జావఁగమోఁది పంపిరిటు సంబరముల్తలకెక్కమత్తులై. 194

క॥ వారింపఁడంగదుండును
వారింపఁడ వాయుసుతుఁడు వారిదుడుకులన్
వారింపఁబోవ మమ్మును

ఘోరంబుగఁ బట్టి, కట్టి, కొట్టిరి ప్రభువా॥. 195

వ॥ అని దధిముఖ పురస్సరంబుగ వనపాలకులు వెక్కివెక్కి యేడువ సుగ్రీవుండు దధిముఖున కభయంబొసంగి, లక్ష్మణు మొగంబుఁ గాంచి "ఆర్య! వింటివిగద వృత్తాంతంబు. దక్షిణ దిశకుం బోయిన వానరవీరులు జానకిం గనుఁగొని వచ్చుచున్నవారు. అట్లు గానిచో వీరు నిర్భయంబుగ యథేచ్ఛా విహారంబులకుఁ గడంగుదు రెట్లు? ఆంజనేయుండొక్కరుండ సీతాన్వేషణ సమర్థుండు. అంగద హనుమంతులు పట్టిన కార్యంబు వ్యర్థమగునె॥? అనిన విని రామలక్ష్మణులు ముదంబంది రంత సుగ్రీవుండు వెండియు దధిముఖుంగాంచి, అయ్యా! నీకు భయంబులేదు. జానకీ సందర్శన సంతుష్టాంతరంగులగు వానరుల కార్యంబు లెట్టివైనను వగవం బనిలేదు. నీవు వేగమ యరిగి వారల నిందుఁదోడితెమ్ము॥నిన వాఁడు సని యంగదునకు నమస్కరించి, తన యవివేక కృతంబును క్షమింపవేఁడుకొని వానరరాజు సందేశంబు నివేదింప. 196

ఉ॥ అంగదుఁడాంజనేయునకు నయ్యది తెల్పఁగ, నిల్వరాదుపో
వంగలవారమంచు వడిఁబొలుచువచ్చిరి చెంగలించుచుం
జెంగట రామ లక్ష్మణులు సీత తెఱంగది యెట్టిదొక్కొ, నే
యంగల కార్యమేమొ యని యర్కజుతోడను మాటలాడఁగన్

వ॥ అప్పుడు హనుమంతుండెల్లరు విన నెలుంగెత్తి యిట్లనియె. 198

ఉ॥ కంటిని జానకీరమణిఁ గంజదళాక్షిని శోభనాంగి, నా
తుంటరి రావణుండు తనతోఁపున శింశపమూలమందుదు
ష్కంటకులైన రక్కసులు కావలి కాయఁగనుంచి చేయుండఁగాఁ

గంటికి నీరు వెట్టుచును గాంతుని రాకకు నేడ్చుసాధ్విని౯. 199

తే॥ తీర్పు పరికింపఁగా లేని తీఁగవోలె,
సన్నవస్త్రంబులకు లేని యనదవోలె
బీడు పడియున్న యందంపు మేడవోలెఁ,
జెలువు తొలఁగిన సాధ్విని సీతఁగంటి. 200

వ॥ అంత సముద్ర లంఘనంబును, లంకాపుర ప్రవేశంబును, సీతా సందర్శన సంభాషణ సందేశంబులను, అశోక వనభంజనంబును, రాక్షసహననంబును, రావణ సభాప్రవేశంబును, లంకాదహనంబును, సీతా కౌశలంబును, మొదలుగాఁగల వృత్తాంతంబంతయు విన్నవించుచు, ఆనవాలుగ జానకి యొసంగిన శిరోమణినిఁ బ్రణామ పూర్వకంబుగ శ్రీరామ చంద్రునకు సమర్పించుచు, “రామభద్ర! త్వరపడవలయు. జానకీమాత కడుంగడుఁ గలవరించుచున్నయది”. ఒక్కమాసంబ గడువు. అవ్వల నసువులంబాయనున్నయది”. అని తెలియంబలికిన నతండు లక్ష్మణుం గౌగలించుకొని దుఃఖంబాపుకొనఁజాలక యేడ్చుచు. 201

ఉ॥ జానకి ధన్యురాల యనుజా! యొకమాసము నిల్వఁగల్గిన౯
నేను నిమేషమాత్రమును నిల్వఁగఁజాలను, దైవ దుర్విపాకానకు లొంగి, కాసఁబడి కాంతను బాసితి, శోకని దలం
బూని సహింపఁగావలసెఁ, బూర్వభవంబునఁ గర్మమెట్టిదో?.

తే॥ ఘనుఁడ! హనుమంత! నన్నిట్లు కడఁక సీత
కడకుఁగొనిపొమ్ము వేఁడుదుఁ గపివరేణ్య!
సాధ్వి యేమని పలికెను జనక తనయ?

తెలుపుమని పెద్దపెట్టునఁ దలఁచియేడ్చె. 203

తే॥ పరగ సౌమిత్రియును నేడ్వఁబావురనుచు
హనుమదాదులు సుగ్రీవుఁడఁడలుదీర్చి
విజయమగు నీకు రాఘవ! వెతలవిడుము
విజయ యాత్రాప్రయత్నంబు వేగజరుగు. 204

క॥ అని యూరడిల్లఁబలుకుచుఁ
జని మంత్రులతోడనెల్ల సన్నాహములం
గనుకని సలుపఁగఁ దెలిపెను
ఘనుఁడగు సుగ్రీవుఁడంతఁగపివరులెలమిన్. 205

వ॥ రామ కార్య నిర్వాహ పరాయత్త చిత్తులై ప్రవర్తిల్లు చుండిరంత.

—♦♦♦ ఆశ్వాసాంతము. ♦♦♦—

తోటక వృత్తము:—కామిత వాంఛలు గల్గఁగఁ జేయన్
వేమరు మ్రొక్కెదఁగ వేఁడఁగ రామా!
భూమిజనుల్నినుఁ బూనిభజింపన్
నీమది నిల్పితె నిర్మలనామా! 207

గద్యము:—ఇది శ్రీభారద్వాజ గోత్ర పవిత్ర, ఆపస్తంబసూత్ర, రాఘవాచార్య ద్వితీయతనూజ, శ్రీరామచంద్ర కరుణా కటాక్షలబ్ధ కవితావిస్ఫురణ, కాండూరు నరసింహాచార్య ప్రణీతంబైన రామ రాజ్యంబను మహా ప్రబంధంబునందుఁ బంచమాశ్వాసము.

సంపూర్ణము.



—: శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః :—

# ★ రామ రాజ్యము. ★

## (షష్ఠాశ్వాసము.)

ఉ॥ శ్రీవిజయోత్సవోల్లసిత చిత్తులుగాఁగ, విజృంభణంబు, సు
గ్రీవుఁడు లక్ష్మణుండడరికీశనికాయముఁగూర్చి తెల్పఁగాఁ
బావని జానకీరమణి భవ్య చరిత్రము సంస్తుతింప స
ద్భావ విరాజితైయిలకు భద్రతనెంచెడు రాముఁగొల్చెదన్. 1



—♦♦♦ శ్రీరాముని విజయయాత్రా ప్రయత్నము. ♦♦♦—

మ॥ రణయాత్రోత్సవమంచు నద్దెసలసత్ప్రారంభముద్దెల్పు ని
స్స్వనముల్మ్రోఁగఁగ, దిగ్దిశాంతరములన్నందేశముల్చాటుఁగ
న్వన భూమీధ్రదిశావకాశములలో నానాప్రదేశంబులం
జన వొప్పన్విహరించు వానరులు బల్సంతోష మొప్పారఁగన్. 2

ఉ॥ గుంపులు గుంపులై యచటఁగూడఁగ నర్కసుతుండుగాంచి, బ
ల్తెంపులు నెక్కొనంబలికె "దిట్టతనంబులుమీఱు మీరు, రా
ణింపఁగఁ దోర్వలుంగిరులు నేర్పులెసంగఁగఁ జక్కఁజేయుఁడీ,
పెంపున వాహినుల్నడవ వేగనొనర్పుఁడ" టంచు నంతటన్. 3

ఉ॥ అంగద జాంబవంతులను నాహనుమంత సుషేణనీలుల౯
సంగత కార్యనిర్వహణ సన్నహనంబున నూలుకొల్పి, వే
గంగఁ బ్రయాణముల్సలుపఁగాఁ గపివాహిని దక్షిణాశకుం
బొంగుచుఁ బైనమైకదిలె భూమి సమూలము సాగినట్లుగ౯. 4

ఉ॥ రాముని నాంజనేయుఁడును లక్ష్మణు నంగదుఁడొప్పమీఱ, సు
స్థేమతనంస భాగములఁ జేరిచి పైనము సేయుచుండ, సు
శ్రాముఁడు దిగ్గజంబుపయి రంజిలునట్టుల నొప్పె రాఘవుం
డా, మహనీయు తమ్ముఁడనయంబు కుబేరుని యట్టులొప్పఁగ౯

చ॥ చెలఁగుచుఁ జెట్టు లెక్కి వడిఁ జెంగున దాఁటుచుఁ గేకవెట్టుచుం
బిలపిల నాకు నాక నెడువేఁడుకఁ బండ్లకు మూఁగి మెక్కుచు
న్మలయము, సహ్యభూధరము మాన్యమహేంద్రముఁ దాఁటి
యవ్వలం
జలనిధి తీరముం దరిసెఁ జయ్యన వానరవాహినీతతుల్. 6

ఉ॥ తేఱి రఘూద్వహుండు జలధిం బరికించుచుఁ జింతగూరి యీ
తీరున నుండఁగా ననుజ! దీనిఁ దరించు నుపాయ మెద్ది, రం
భోరువు జానకీరమణి బోరున నేడ్చుచుఁ బోవునప్పుడీ
వ్వారిధిఁ గాంచి చిత్తమున వందురి యెంతగ భీతిఁ జెందెనో?. 7

—: సముద్రముం గాంచి రాముఁడు చింతించుట. :—

ఉ॥ "ఈబహుళాట్టహాస ప్రకటీకృత లోక భయంకరాకృతి
ప్రాభవ దుర్నిరీక్ష్యబడబానల తాపిత సర్వసత్త్వసం
క్షోభ విఘూర్ణమానజల సూచిత ముస్తరమూర్తి కబ్ధికి౯
క్షోభముఁ జెంది వానరులు స్రుక్కక యెక్కరణిం దరింతురో?.

చ॥ తరుచరులీమహాబ్ధినిఁక దాఁటుటయెక్కడ? లంకఁజొచ్చి ము
ష్కరుఁడగు రావణుండునిమి జానకిఁ గాంచెదనంటయేడ? దు
ర్భరమగు జీవితాశ బలవంతము, ప్రాణములెంతతీపొకో?
పిఱికితనంబు పౌరుషమొ, బెట్టిదమా ధనువుండఁజేతిలోన్. 9

తే॥ కాని బహు యోజనాయత కలశరాశి
క్రూరసత్త్వాలయంబు గంభీరమగుటఁ
గపులు దాఁటంగఁగలిగినఁగాదెనాదు
పౌరుషంబును భాగ్యంబుఁ బండుజగతి"? 10

మ॥ అని చింతించుచునుండఁగాననుజుఁడ"న్నా! ధీరచిత్తంబులం
గనమెచ్చోటను బేదపల్కులను నీగాంభీర్యముం దేజముం
గనుచో నిజ్జడరాశియొక్కత్రుటిలో గాంభీర్యముంబాసి, చ
ప్పున నీవాహినులొక్క పెట్టనవలంబోవంగఁ దావీయదే"? 11

వ॥ అని వీర పురుషోచితంబుగఁ బల్కుచు, ధైర్యంబుఁ బురికొల్పు
చుండె. 12

ఉ॥ అంత హరీంద్రునింబిలిచి యాజ్ఞయొసంగఁగ వానరోత్తముల్
చెంతలఁగాననంబుల వసింపఁగఁ దెల్ప, వనాంతసీమలన్
సంతసమొప్పఁబౌరుషమొసంగ ఫలాదులనిత్య తృప్తులై
యెంతయువేఁడు కల్గనర నింపుగనుండఁగనందు లంకలోన్. 13

—: రావణుఁడు కొల్వున మంత్రులతో నాలోచించుట. :—

ఉ॥ చారముఖంబునన్విని విచారముతోఁ జఁగ రావణుండు బల్
ధీరులు మంత్రిపుంగవులు తీర్పరులొప్పఁగ నోలగంబునం
గూరిమిమీఱ నిల్లనియెఁ, "గోవిదులార! మహాబ్ధితీరముం

జేరిరి వానరుల్నరులు చెన్నగులంకను ముట్టడింపఁగన్. 14

ఉ॥ మున్నొకక్రోఁతివచ్చి తనపోఁడిమిమీఱఁ బ్రవర్తిలంగ మీ
కన్నులఁగాంచి నట్టిదియగాదె, కపీంద్రుని సైన్యముల్దగన్
గ్రిన్నన నొక్కవేళ నిటుకంధిని దాఁటఁగఁ జాలివచ్చెనేన్
సన్నుతిసేయ ముజ్జగము, చక్కడుపందగు యోజసేయుఁడీ. 15

ఉ॥ వచ్చినయప్డు చూచెదము, వానరులెంతటివారలంచుఁ బో
నిచ్చుట పాడిగాదు, ధరనెంతటివారికినేని శత్రువున్
గ్రిచ్చుఱ వెన్కముందులనుగాచి మెలంగుటలెస్స, గానిచోఁ
జిచ్చరగుల్కొనంగ మదిఁజింతిలి లాభమె, చుల్కనాఱునే?.16

చ॥ త్రిజగములందు నన్నెదిరి తేఁటికనుంగొన నిల్వలేక సా
మజములవంటి శూరులిల మ్రాన్పడి, దిక్కఱి, మ్రొక్కుచుండ, నీ
కుజనుఁడు రాముఁడన్నరుఁడు, కోఁతుల మూఁకలెదుర్చుటే, మహా
గజములు పాఱిపోవ మశకంబులు డీకొనునట్లులొప్పదే? 17

వ॥ అనుటయు మంత్రి సత్తములు రావణుమొగంబుఁగాంచి యొక్క
మాటగా నిట్లనిరి. 18

శా॥ దిక్కుల్వ్రిక్కలుసేసి పిండిసలుపంధీశక్తి నిండార, నీ
పక్కన్ లెక్కకుఁగొందుమే యధిప! నీవంతంబులందీర్పఁగాఁ
జెక్కల్ముక్కలుసేసి వారినిపుడే చెండాడిరాఁజాలమే
నిక్కంపుంబటువీరులుండఁదగునే నీవిట్లు యోజింపఁగన్. 19

ఉ॥ దేవతలంతవారు రణధీరులు మమ్మెదిరింపలేక నా

నా వసురాజిఁగాన్కయిడి నాకము సైతము వీడిపాఱ, సు
గ్రీవుని బంట్లు వానరులు లెక్కయె రావణ! రాముఁడెంత, నీ
భావమునందుఁ జింతిలుచు భామిని సీతను వీడఁజూచితే?. 20

చ॥ గిరగిరఁ గ్రైదు వుల్దిరుగ ఘీంకృతులొప్పఁగఁ జేరి యిప్పుడే
తరుచర కోటులందునిమి తాకొనువారము, పంపుమమ్ము, ని
ర్జరకుల కామినీతిలక చారువిలాస విశేష! నీవు వా
నరులఁదలంచి, యానరుని నాఁతిని సీతను వీడఁబాడియే?. 21

శా॥ మేనం బ్రాణము లుండునంతకు మముస్మీఅంగ నెవ్వాఁడు రం
గానన్నిల్వఁగలాఁడు, చూతమటులంగానిమ్ము, రానిమ్ము, దు
ర్మానంబుందొలఁగించు దుర్గమునకుం బంధింపమే రాముని౦
దీనుల్వానరులెంతవారు వినమే ధీరుండ! లంకాధిపా!. 22

ఉ॥ మున్ను విశిష్టకార్యములమున్గ కతంబున నొక్కవానరుం
డున్నటులుండి పైఁబడి కడుందుడుకు ల్వొనరింపఁగ ల్గె, లే
కున్న నతండు తప్పుకొని యుండునె? పోయిననేమియయ్యె, రా
కున్నె యతండు వెండియును నూపిరితీయక విడ్చువారమే?. 23

చ॥ అనుచునికుంభుఁడుంబరగనయ్యతి కాయుఁడు వజ్రదంష్ట్రుఁడుం
గొనకొని యగ్నికేతుఁడును గుత్సితుఁడింద్రజితుండు నాదియౌ
ఘన భుజులైన రక్కసులు కయ్యమె మేలని నిశ్చయింపఁగా
వినియది రావణుండు తన విక్రమముం గొనియాడుచుండఁగన్.

-: విభీషణుఁడన్నకు ధర్మముపదేశించి నిష్కాసితుండగుట. :-

చ॥ విని విసుఁగెత్తి నిల్చెను విభీషణుఁడన్నకుఁ గేలుమోడ్చి యి
ట్లనియెను "ధర్మమార్గమును నారయ రాముని యందుఁదప్పులే

దనఘుఁడరణ్యావాసమున నంచితుఁడై విధినీఁగుచుండ, భా
ర్యను గొనితెచ్చి యిప్పగిది రాజసనొప్పఁగఁ బల్కఁబాడియే?.

చ॥ అడవులనుండ శూర్పణఖ యక్కట కేగుట, సీతపైఁబడం
గడఁగుట, దానిమాటవిని కయ్యమునన్ ఖరదూషణాదులు
న్మడియుట, నీవుమోసమున మానినిఁదెచ్చుట, తప్పుగాదొకో,
వడినదలింప సింగమది వాని పయింబడకుండ నుండునే?. 26

ఉ॥ రాముఁడు సజ్జనుండు జనరంజకుఁ డాతనియందు దోషమే
రోమమునందు లేదు, భువిలోపల ధూర్తుల నుక్కడంచి, స్వ
ధామము నోమఁగాఁబొలిచె, ధార్మికుఁడాతని కెగ్గుసేసి, యా
భూమిజఁబట్టి తెచ్చితివి పోలునె? ధర్మము డాఁగియుండునే?.27

ఉ॥ వీరులపోలె పల్కెదరు వీరి యహంకృతి చెల్లునొక్కొ, బల్
శూరుఁడు రాఘవుండు, కడుశూరులయెల్లరు వానరుల్మహా
వీరులు, మొన్న మొన్న మన వీటికి వచ్చినవానిఁగానరో?
కూరితమాని జానకిని గొబ్బున రామునకప్పగింపుమా. 28

తే॥ చెడును బలములు, లంకయుఁజెడును, గులము
చెడును, యశమును సర్వంబుఁజెడును, గానఁ
జెడుతలంపుల విడుచుచుఁ జెడుగుఁదెలిసి
రామునతి నొప్పగించుము సేమమలర." 29

చ॥ విని విననట్టులప్పుడు విభీషణు పల్కులుపేక్షసేయుచుం
జనియెను రావణుండు మఱునాఁడుదయంబునఁ గొల్వులోపలన్
వినిచెఁబ్రసంగముందడవి "విశ్వజనీనుఁడు రామచంద్రుఁడ
వ్వనిత నొసంగుమం"చు విని భగ్గున మండుచు రావణుండనెఁ.

ఉ॥ "తమ్ముఁడవై తినాకు సరదారుఁడ వౌటకు మాఱుశతు్రిప
క్షమ్మున వాఁడవై యిటుల చప్పిడి పల్కులుపల్క నొప్పునో
యమ్మకచెల్ల! సింగముల యండనలంతి మెకంబు చెల్లునే?
నమ్మవునా పరాక్రమము నన్నదిరించెడి వారలుందురే? 31

చ॥ తపమొనరించితిన్నలువఁదన్నితిఁ గోరివరంబుఁగొంటి, నే
నుపలముపోలె శైలమును నొప్పఁగ నెత్తితి, దేవదానవుల్
కృపకయివేచియుండఁగను నెంతయుఁబేర్చితి ముజ్జగంబులం
జపలుఁడు రాముఁడన్నరుఁడు చంపఁగలాఁడన నవ్వుపుట్టదే?.

చ॥ మనసిజుఁడొప్పుకోర్కెలుప మానవకాంతను బట్టితెచ్చితి
న్నను వలదన్ననే విడువ న్యాయమే, నన్నొకరడ్డువారలే,
వినుము సురాసురులెగిన వీడను జానకి, రాముడెంత, న
న్ననయము నొవ్వబల్కఁదగునా, యిటు శతు్రివుమెచ్చి
తమ్ముఁడా!" 33

వ॥ అంతఁగుంభ కర్ణుఁడన్న యధర్మవాదంబును వినఁజాలక, తానేమి
యు ననలేక యాసనంబుననుండి లేచిపోవ, దశకంధరుని మో
ఱకుఁ దనంబునకు విసిఁగి విభీషణుండు తాపం బాపుకొనలేక
యిట్లనియె. 34

చ॥ "అరయఁగ ధర్మపద్ధతికి నన్నయునన్యులు నొక్కరూప, నీ
వరముస్మరించుకొమ్మ, నరవానరులందునడంగి యుందురో,
నరుఁడయి విష్ణుమూర్తి నరనాథుఁడు రాముఁడనంగనొప్పె, వా
నరులయి పెక్కుదేవతలనంత బలుల్భువిఁ బుట్టిరొప్పుగ౯. 35

చ॥ చతురతఁ దాటకందునిమి శంకరుచాపమగల్చి చుల్కఁగ౯

స్తుతమతిగాఁగ నిల్చి ఖరదూషణ రాక్షసులన్వధించి, నీ
బ్రతుకె స్మరింపఁగాఁదగిన వాలినిఁజంపిన రాముఁడెవ్వఁడో
మతిఁబరికింపవయ్య! హనుమంతుని తేజముచూడలేదొకో." 36

మ॥ అనఁగన్ రోషవిఘూర్ణమాననయనుండై రావణుండష్టు త
న్నను భ్రాంతిం "బొంగడంగ శత్రువును జన్నెనీవు నాముందఱం
జను మెచ్చోటికినేని, నిల్వఁదగదీసామ్రాజ్యమందం"చు నె
ట్టెను నెట్టించెను 'గొల్వు వీడిచను మిట్టీవం'చు దుష్టాత్ముఁడై.

ఉ॥ అంత విభీషణుండు తనయన్నఁగనుంగొని యిట్లువల్కె, "నీ
వెంతయుఁ జెప్పినన్వినవిదే విపరీతపు బుద్ధిగాఁగటా!
దొంతరలౌచు రాఘవుని ఘోరపుబాణము లొక్కపెట్టునన్
గొంతుకలూడఁదీయుతటిఁగుందెద వింతియ పోయివచ్చెదన్".

చ॥ అని తనమంత్రులంగలిసి యంతిపురంబునఁదల్లి చెంతకుం
జని, వినయంబుతో నచటసంగతులన్నియు విన్నవించి, దీ
వనఁగొని, లంకవీడి తలవంపునకై మదినొచ్చుకొంచు, ని..
గిని "శరణాగతుండఁ బరికింపుము రాఘవ"! యంచుఁబల్కు
చున్. 39

—: విభీషణ శరణాగతి. :—

ఉ॥ వచ్చుచునుండ నర్కజుఁడు వానర యూథముతోడఁగాంచుచుం
గ్రచ్చఱవచ్చు వారదిగొ రాక్షసులైదుగురంచుఁ జూప, వా
రచ్చటిచెట్లు గైకొనుచు, వ్రచ్చెద మిప్పుడవారినంచు, బల్
పెచ్చుగ గుంపుసేరఁగ విభీషణుఁడిట్లను వానరుల్వినన్. 40

చ॥ "శరణము రాఘవేంద్ర! ననుఁజయ్యనఁజేకొని కావవయ్య! న

స్నరయుము నీకు భక్తునిగ, నయ్యధముండగు రావణాసురుం
బరసతిపీడ వేయని సభన్వినుతింపఁ బరాభవించె, సా
దరముగఁ బ్రోవుమయ్య! ననుఁదమ్మునిఁబోలె, విభీషణుండనేన్

ఉ॥ వీరలు నాకు మంత్రులని వీనులు సోఁకఁగఁ బల్కునంత, న
వ్వీరులు నక్కజుండు రఘువీరుని చెంతకుఁబాఱిపోయి, "య
య్యా! రఘువీర! చూచితివె యాకసమందున వచ్చువాని, నీ
పేరుఁదలంచు వానిని విభీషణనాముని దుష్టరాక్షసున్. 42

ఉ॥ వేగులుచూడ రక్కసులు వేసములెన్నియొ వేయువారు, భూ
భాగమునందు నమ్మఁదగువారలె వీరలు రామచంద్ర! యీ
యాగమనంబు మాయయని యాత్మకుఁదోఁచెడు, వీఁడు చెం
తకున్
రాగ సహింపనా నెటులు రాఘవ! కార్యము నిర్ణయింపుమా"!

చ॥ అనుటయు రాఘవుండు విని యంగద జాంబవ దాంజనేయులం
గనుఁగొని తెల్పుమన్న "నిటుకైకొనఁగాద"ని వాలిసూనుఁడున్
"మనకిటఁగొత్త లేయసుర మాయలటం"చును జాంబవం
తుఁడున్
వినిచిన, నాంజనేయుఁడును విన్నవునిట్లు సయుక్తికంబుగన్. 44

ఉ॥ "వీఁడు విభీషణుండు రఘువీర! సునీతి పరుండు కొల్వులో
నాఁడు నిశాచరేంద్రుఁడు వినన్ననుఁజంపక విడ్చునట్లుగా
నాడిన ధర్మమూర్తి తగవా, పగవాఁడని నిర్ణయింపఁగ
న్వీఁడొకఁడెంతవాఁడు మనవీరుల కంజకగ్రాహ్యుఁడయ్యెఁడున్' 45

వ॥ అంత రామచంద్రుండు.

ఉ॥ మారుతి పల్కులొప్ప బహుమానముతోడను దోడితెమ్మనం
జేరువలక్ష్మణుండు నిరసింపఁగ "లక్ష్మణ! వీరధర్మమే?
భూరివిశుద్ధధర్ముఁడగుఁబోయితఁడూరక శంకయేల, యా
క్రూరుఁడు రావణుండు ననుఁగోరినఁగైకొన సిద్ధమేసుమీ! 47

చ॥ శరణనివచ్చువానిఁగని శత్రువు మిత్రుఁడనంగనేటికిం
ధర వినుతింపఁగైకొనుట ధర్మము గాదొకొ నాకు లక్ష్మణా!
పరుసఁదనంపువాఁడయిన పంక్తిముఖుండును జేరివేఁడినన్
శరణమొసంగి కాచెదఁ బ్రసన్నత నన్యులువేఁడ నేఁడుటే"?.48

వ॥ అని బహువిధంబుల ధర్మవాక్యంబు లుపన్యసించి తోడ్కొనిరమ్మని యనుప సుగ్రీవుండెదురేగి బహుమాన పురస్సరంబుగ విభీషణుం దోడ్కొనివచ్చి శ్రీరాము సన్నిధి జేర్చిన నాదర పూర్వకంబుగ నభినందింప నారామునకుఁ బ్రణామంబాచరించి కరంబులు ముకుళించి యవ్విభీషణుం డిట్లనియె. 49

ఉ॥ "నీవిభవంబుఁ జేకొనుచు "నిశ్చలచిత్తుఁడనౌచు జానకిం
బావని రాముఁజేర్పుమని" పల్కఁగ మూర్ఖుఁడు దుష్టచిత్తుఁడా
రావణుఁడాగ్రహంబుగదురంగనను న్వెడలించె లంక, నీ
సేవకవర్గమందొకఁడఁ జిత్తమునందిడి ప్రోవు రాఘవా"!. 50

చ॥ అనుటయు నాదరించి వినయాన్వితు లక్ష్మణుఁగాంచి పల్కె "నీ
వినతు విభీషణుం బరగ విజ్ఞుని లంకకుఁ బట్టభద్రుఁగా
నొనరుపు మిప్పుడే" యనఁగ నొప్పుగ సంబుధి వారిధారలం
గొని యభిషిక్తుఁజేసి కడుఁగూరిమి లంకకురాజుఁ జేసినన్. 51

చ॥ ముదమునఁ దేలి యాడి కడుఁబొంగుచు రావణువృత్తమంతయున్

విదితము సేయుచుండె ''నెరవెయ్యది యంబుధి దాటఁగా''
ననన్-

''సదయుఁడ! రామచంద్ర! బుధసన్నుత! నీవెఱుఁగంగరానిదే
యుదధి నుతింపుమయ్య! యతఁడొయ్యనదారి నొసంగునీక''నన్

—♦♦♦ శ్రీరాముని దర్భశయనము, సముద్రభంజనము. ♦♦♦—

వ॥ అంత లక్ష్మణుండుదధితీరంబున నొక్కరమణీయ ప్రదేశంబున దర్భశయనంబుఁ గల్పింప, నందు రామభద్రుండు ధ్యాన పరవశుండై మూఁడు రాత్రులు కడపినను సముద్రుండు ప్రసన్నుఁడు కాకుండుటకు నలిగి లక్ష్మణుంగాంచి యిట్లనియె. 53

శా॥ ''చూడం జూడఁగ నీమహాంబునిధి నాచొక్కంపు సాధుత్వముం
గ్రీడాభంగిగనెంచి గర్వరభ సోద్రేకంబుఁ జూపించెడున్
వీఁడా భీలతరంగ భంగములచే వేవేగనుప్పొంగఁగా
వీడన్ శక్యమె లక్ష్మణా! యితనిపెంపేదంగ సాధించెదన్''. 54

వ॥ అని ధనుర్బాణంబులంగొని యకాండంబులడంగ నానాకాండంబులంబఱపినఁ బెన్మంటలెగసి నానా విధ జంతు సంతానంబులంబొలియించుచుండ, జలధి నిర్జలంబుఁ గావింతునని బ్రహ్మాస్త్రంబుం బ్రయోగింప, భయభ్రాంతుండై వాహినీ నాథుండు ప్రత్యక్షంబగుచు, ననేక విధంబుల శ్రీరామచంద్రుని ప్రభావంబుఁ బొగడి, యయ్యమోఘాస్త్రంబునకు లక్ష్యంబుసూపి, ''దేవా ప్రసన్నుండవగుము. విశ్వకర్మ పుత్రుండగు నలుండతిసమర్థుండు. అతనిచేత సేతువుఁగట్టింపు''మని పలికె నయ్యవసరంబున. 52

ఉ॥ వేగులవాఁడువచ్చి వినిపింపఁగ, రావణుఁడంపఁగాశుకుం

డాగతుఁడౌచు నచ్చటికి నయ్యగచారులలోన భేదముల్
సాగునుపాయముల్వలుకఁ జయ్యనవానినిఁ బట్టిచావగఁ
న్వేగమథింప, వాఁడురఘువీరు కృపంజనెవిడ్చిపుచ్చఁగన్

ఉ॥ పోయిసముద్రతీరమునఁ బొంగెడు వానరవాహినీబలో
న్నేయములైన కార్యముల నిర్ణయమున్వివరించి "వాహినీ
నాయకుఁడొప్పు కోర్దెలిపినం, గపిసేనలు సేతుబంధముం
బాయక పూనిరింక ననుమానము లేటికి రాక్షసప్రభూ"! 57

క॥ అని తెలిపి శుకనిశాటుఁడు
చనఁగను రావణుఁడు పెక్కుశంకలు పొడమన్
"వనచరులు నరులెయివ్విధి
వననిధిఁ గడచనఁగవచ్చు వాగలుజగతిన్. 58

క॥ రానిమ్ము చూచుకొందము
గానిమ్ము పటుప్రతాప గరిమకు గురిగాఁ
బోనిచ్చువాఁడె యీతఁడు
వానరులను నరులు"ననుచు వదరుచునుండెన్. 59

=♦♦♦ సేతు బంధనము. ♦♦♦=

ఉ॥ దిట్టలు వానరోత్తములు దిక్కులనొప్పు మహాగిరీంద్రముల్
చెట్టులు గుట్టలున్వడిగఁజేర్చిన నన్నలుఁడంబురాశిపై
గట్టిగ సూత్రబద్ధమగు కట్టతెఱందున నొప్పునట్లుగాఁ
గట్టెను సేతువంతఁ గడఁకంగపి వాహిని కంధిఁదాఁటఁగన్. 60

వ॥ అప్పుడు రామచంద్రుండు శుభముహూర్తంబు నిర్ణయించి యి
ష్ట దేవతానమస్కార పూర్వకంబుగ సముద్రంబుదాఁట నిశ్చ

యించి. 61

ఉ॥ నీలునిఁబిల్చి యాజ్ఞ ధరణీశుఁడు రాముఁడొసంగ వాహినీ
జాలములెల్ల స్వేచ్ఛగను సంబరముల్ త్రొక్కు క్రొత్త సేతువుర్వీ
లీలఁదరించి వేలమును నేర్పులెసంగఁగఁ జేరియుండ, దు
శ్శీలుఁడు రావణుండు కపిసేనలఁగన్గొని యోలగంబునన్. 62

## —॰•॰ రావణుని కొలువు. •॰•—

సీ॥ మంత్రులఁ బిలిపించి మంతనంబులు సేయు
నొకనికంటె నొకండు నుట్టిపడఁగ
నింద్రజిత్తుఁడు తన్ను నెదురించు వారులే
రని బడాయితనంబు చినుకుచుండ
వేగులు చూడంగ నేగిన శుకసార
ణులువచ్చి సభలోనఁ దలఁకుచుండ
గిరి శృంగముల నెక్కి యరిబలంబులు సల్పు
ఘీంకారములఁ జెవుల్గ్రిగురింప.

తే॥ దశదిశలోగ్రిఁగనార్చుచు దశముఖుండు
సమరమున కాయితంబులు సలుపుఁడనుచుఁ
బలికి, శుకసారణులఁజీరి తెలుపుఁడనఁగ
వారు తమ పడ్డపాటులఁ బలికిరిట్లు. 63

ఉ॥ "దేవరయానతిం బడసి దేవ! కపిత్వముఁబూని మాయచే
నావనచారి వర్గముల నంజక తిర్గుచునున్న వేళ సు
గ్రీవునితో విభీషణుఁడు రీతులు తెల్పఁగ మమ్ముఁ బట్టియా
పావన రామచంద్రు కడ బాదుచు, మోదుచు ముందునిల్పఁగన్.

తే॥ దూతలను జంపఁ బాడియే నీతి పరుల
కనిన రాముఁడు మముఁ గాంచి యనియె నిట్లు
"దూతలయ్యును వధ్యుల నీతిపరులు
గాని యల్పులు మిముఁ జంపఁ గార్యమేది?. 65

తే॥ ఇచ్చవచ్చిన చొప్పునఁ జొచ్చి సేన
ముచ్చటలు తీర్చుకొని యేగి ముగ్ధుఁడైన
రావణునితోడ నాపల్కు భావములను
దెలుపుఁడ"ని పల్కె నిర్వ్యథఁ దెల్లముగను. 66

చ॥ "ఎఱుకపడఁ జేసి వేగఁ గవయి మాసిని జానకిఁ దెచ్చునాఁటి నీ
గఱువతనంబుఁ జూచెదను గట్టిగ నెల్లి పరాక్రమంబునం
దురమున నిల్చి దిట్టవయి దోర్బల ముప్పుఁగ నుక్కుమీఱునా
పఱపు శిలీముఖమ్ములకుఁ బాలక మాంపుము నీవుగంటి నిన్".

చ॥ అని విడిపింప వచ్చితిమి యంపలి వృత్తము తెల్పఁగంటిమా.
యినకుల సార్వభౌమునకు నీవు జగమ్మున లేఁదు మాఱుఁగ
న్వనచర వీరులోకర్కకర వార్యబలుల్పటు శౌర్యదర్పితు
ల్వినుము నిశాచరేంద్ర! యిఁక వీడుము జానకిఁ గయ్యమేటికిన్.

వ॥ రాక్షసేశ్వరా! రాముని తమ్ముండగు లక్ష్మణుండును రామునంతటి వాఁడె. నూఱామడ నిడివియుఁ, బదియామడ వెడల్పును గల సేతువు బంధించి సముద్రంబు దాఁటివచ్చిన యవ్వానరానీకంబు లసంఖ్యాకంబులు. అందొక్కొక్కఁ డొక్కఁడు ముల్లోకంబుల దిగమ్రింగఁజాలిన మహాశూరుండు. చూపు పురమ్మని మహాప్రాసాదంబునకుం గొనిపోయి, యొక్కొక్కనిఁ జూపి, పేరివాని

బలవీర్య పరాక్రమంబులు నిరూపించుచుండ నత్యంత రోషభీష
ణుండై మండిపడుచు రావణుండిట్లనియె. 69

శా॥ "ఔరా! యెంతటి దుర్భ్రమంబడితి రాహా! భీతినేర్పించుచే
వీరుండయ్యెనె మీకు రాముఁడనఁగా వీఁడెంత, నామ్ముందఱం
బోరంజాలక నిర్జరావళులు వాపోవంగ దుర్మానవుం
డీరాముంగని జానకిన్విడుచువాఁడే రావణుండెన్నఁడేన్. 70

ఉ॥ చారులఁగాఁగ మిమ్మనుప శత్రువులంగని భీతిఁజెంది మీ
నేరమిఁగప్పిపుచ్చుటకు నిర్భయులై పగవానిమెచ్చుచుం
దూఱఁగ నన్నుఁజూచెదరు, దుష్టులు నమ్మినఁ బాపమంటుని
వ్వీరుఁడు రావణుండు పృథివీసుతవీడఁగ వెఱ్ఱియయ్యెనేని?. 71

మ॥ అని ఛీకొట్టుచు సమ్ముఖంబుఁ దొలఁగఁగొండించు న్మహోదగ్రుఁడై
పనుపన్వారలు నేగ, వేగునడపం బ్రాజ్ఞావిశేషంబు గ
ల్గిన శార్దూలునిఁజీరి రాముఁకడకుం గర్తించి పంపంగ, వాఁ
డును నేతెంచెను సారణుండుబలెఁ గీడుంబొంది యగ్గించుచున్.

వ॥ వచ్చి యంగుఁదనకు జరిగిన పరాభవంబును, రామచంద్రుని సం
దేశంబును నివేదించి, యారాఘువేంద్రుని ప్రభావంబును, నంచలి
వారల పరాక్రమంబును వర్ణించి, సీతాదేవి నర్పించి కయ్యంబు
గాకుండం జూడుమని ప్రార్థింప రోషతామ్రాక్షుండగుచు, రా
ణుండు, "ఈసరవానరులకు సురలుతోడై వచ్చినను సంహరించి
యమపురంబున కనుపఁగలవాఁడనై యుండి చేతఁగాని వానివలె
సీత నర్పించుటే? యిట్టికొఱమాలిన మాటలుడుగుఁడు. యు
ద్ధంబునకు సకల సన్నాహంబులం గావించి మీ మీపనుల

యందు జాగరూకులరై యుండుఁడ''ని యాజ్ఞాపించి విద్యుజ్జిహ్వుంబిలిపించి, యతనికిఁ గొంత రహస్యంబుం దెలిపి పుచ్చిన నతండు. 73

—: సీతను వంచింపఁ జూచుట. :—

తే॥ చేత ధనువును శరమును శిరముఁబూని
సీతకడకేగి నీభర్త శిరముఁ ద్రుంచి
కొంటినిదిగో యటంచును గుమతియగుచు
ముందుపెట్టఁగ మాయాని, ముగుదసీత. 74

తే॥ కాంచి పరిపరి వెతలను గలఁగుచున్న
యవసరంబున రావణుఁ డచటికరిగి
"సీత! నీకేల భ్రమయింకఁ జెలువమారఁ
జేరి సుఖయింపఁ దలఁపుము చిత్తమ..." 75

తే॥ అనుచుఁబలికిన జానకి యాగ్రహించి
"ఛీ! దురాత్ముఁడ! నీనోరు చీలదయ్యెఁ,
గడఁగి యిట్టులఁ గుడువఁగఁ గఠినహృదయ
సీత బ్రదికియు నీచేతఁజిక్కునొర! 76

ఉ॥ రావణ! దుర్భ్రమందొఱఁగి రాముని దేహముతోడఁజేర్చి స
ద్భావముచేత నీతనువుఁ బాయఁగఁ బున్నెముఁగట్టుకొమ్ము,నీ
భావము శాంతినందు, నిరపాయతనుందువు, కాక తక్కిన
న్నీవు మదీయశాపమున నీల్గుట తప్పదు నిశ్చయంబుగన్". 77

చ॥ అని పురణించి పల్కుసమయంబున "వచ్చెఁ బ్రహస్తుఁడ"ంచుఁ జె
ల్పిన వడినేగె రావణుఁడు లేఁగిన కన్గవ నిప్పు గ్రక్కుచుం

దనమది వేవితంబులగు తాపముఁజెందెడు సీతచెంతకుం
జనవు తలిర్పఁగా సరమచయ్యన వచ్చెను సేద దేర్పఁగన్. 78

ఉ॥ వచ్చి ముదంబు చేకుఱఁగ "వారిజలోచన! చింతయేల యా
మచ్చరి పంక్తికంధరుని మాయనుఁగాఁదలపోయుమిద్ది, తా
నచ్చుగ రామచంద్రుఁడట హాయిగనుండెడు, నెల్లిరావణుం
గ్రిచ్చఱ యుద్ధరంగమున లాఘవమొప్ప జయించువాఁడుగాన్"

క॥ అని యాశ్వాసితురాలయి
మనమున జనకాత్మజాత మానిని తనలో
ఘనతర తేజుఁడు రాఘవుఁ
డనిమొన విజయంబు నందునట్లుగఁ దలఁచెన్. 80

వ॥ ఇచ్చట రావణుండు. 81

ఆ॥ వె॥ మంత్రి నర్యుఁడైన మాల్యవంతుఁడుబూని
హితవుఁగఱప నతని మతికినలిగి
కుమతియగుచు మిగులఁగ్రుద్ధుఁడై పలుకంగఁ
బలుకవెఱచి యతఁడు ప్రక్కకరిగె. 82

ఉ॥ యుద్ధమె నిశ్చయంబనుచు యోధులు తెల్పఁగ, దైవదుర్విపా
కోద్ధతుఁడైన పంక్తిముఖుఁడొప్పుగ నొక్కొక ద్వారమందు స
న్నద్ధులుగాఁగ నేర్పఱచి నాడెపుకోఁదుగ నుత్తరంబునం
దిద్ధశరాసనుండనయి యేడ్తెఱ ద్వారముఁగాచి యుండెదన్. 83

తే॥ అనుచుఁబనిచిన నేర్పాటు ననుసరించి
వీరులెల్లరు తమతమ ద్వారములను
జేరి యుద్యోగములు పొంగఁ గూరివచన

చతురులగుచును నిల్చిరి సంభ్రమించి. 84

## ===లంకను ముట్టడింప రాముని యేర్పాటులు.===

ఉ॥ కామిత రూపముల్వరగఁ గైకొని లంకనుఁ జొచ్చి వృత్తముల్
సేమముతో గ్రహించి విలసిల్లుచు వచ్చి రహస్యమున్మన
స్సీమల దాపకన్నియువచించు విభీషణు మంత్రివర్యులన్
రాముఁడు మెచ్చుకొంచుఁ దనరంగ రణంబునకుత్సహించుచున్

వ॥ లంకాపట్టణంబును ముట్టడింప నిశ్చయించి ప్రహస్త రక్షితంబైన తూర్పుద్వారంబును నీలుండును, మహోదర మహాపార్శ్వరక్షితంబైన దక్షిణద్వారంబును నంగదుండును, ఇంద్రజిత్పాలితంబైన పడమటి ద్వారంబును హనుమంతుండును, విరూపాక్ష సురక్షితంబైన వ్యూహంబును విభీషణ సుగ్రీవ జాంబవంతులును, సమరోన్ముఖుండగు దశకంఠునిచేఁ బాలింపఁబడు నుత్తరద్వారంబును ననుజసహితుండై సజ్యకార్ముకుండగు తానును, తమతమ బలంబులతో నుపరోధింప నిశ్చయించి కదలు నవసరంబున. 86

ఉ॥ చుట్టు సముద్రఘోషమును జొక్కనిశాచర దీర్ఘరావముల్
బిట్టుగ వానరార్భటులు పెల్లుగరేఁగఁగ, భూమియుఁ బ్రకంపనన్
జెట్టులు గుట్టలొక్కమొగిఁ జేరి సముద్రమునందు లంక ప
డ్డట్టులుగా వియచ్చరుల హా యని యచ్చెరు వందిరాత్మలన్.

ఉ॥ రావణ కింకరుల్తమ పురంబున కాకులపాట్లు పెక్కుపె
ల్లావహిలంగఁ దల్పులకు నర్గళబంధము సేయున త్తఱిన్
భావమునందు నంతకుని బంటులు దాపున కోటిదాక కా

దావలమంచు నెంచి తమతల్పులుబారుగఁ దెర్చిరత్తఱిన్. 88

సీ॥ వీరరాఘవుఁడప్డు వేలాచలంబెక్కి
లంకాపురంబడరంగఁ గాంచి
వివిధ విశేషముల్వివరింపుమని యడ్గ
వివరించు చోలి విభీషణుండు
కనుఁగొను రాఘవ! మునుకొని యుత్తర
ద్వారభాగంబునఁ దనరువానిఁ
బంక్తి కంధరు భుజాప్రౌఢి మైదీపించు
వానినంచును దెల్పఁగానె యొడలు.

తే॥ క్రోధ పరవశమగుటచేఁ గ్రూరుఁడగుచు
నర్కజుఁడువేగ నతనిపై కట్టెమొగిరి
దుమికి యొక తన్నుదన్నెను దొరలిపడఁగఁ
దల కిరీటంబు, రత్నముల్ధరణివ్రాల. 89

చ॥ పుడమితలంబు నన్నిలిచి ముష్టి విఘాతములొప్ప నిర్వురు
న్వడివడిఁ దన్నుకొంచుఁ దెగువన్వడి నార్చుచుఁబేర్చి, బెబ్బులు
ల్కడుకొని కయ్యమున్ సలుపుకై వడి తోఁపఁగ సంగరంబు,
పెం
దుడుకుతనంబులన్నలుప దుష్టులు రాక్షసులెల్ల మూఁగుచున్.

ఉ॥ మాయలుపన్ని యాతనిని మ్రింగఁగఁజేసిన వానరాధముల్
నాయకుఁబాసి చేడ్పడుచు నగ్గడఁబాఱక నిల్చువారె యం
చాయత యత్నముల్సలుపనయ్యది గన్గొని యర్కజుండు దు
ర్మాయలు వాయునింకనని రామునిసన్నిధిఁజేరె లీలమైన్. 91

వ॥ అంత రామచంద్రుండు తుదివఱకు సంధి ప్రయత్నంబు సేయుట రాజధర్మంబని నిశ్చయించి విభీషణ సుగ్రీవాదులతోఁగూడి మంతనంబు సలుపుచు, యుక్తాయుక్త విచారదక్షుండును, రాజనీతి కుశలుండును, నతిసమర్థుండు నగువాఁడెవ్వండని యాలోచించు నవసరంబున. 92

=♦♦♦ అంగద రాయబారము. ♦♦♦=

చ॥ అనువుగ రాయబారిగను నంగదుఁ బంపుట మేలుగా విభీషణుఁడు వచింప రాఘవుఁడు సమ్మతిఁజేకొని యెల్లవార్తల న్వినిచి ప్రసంగఁ బల్కుమని వీడ్కొలుపంగ నతండు సత్వరంబునఁజని కోటదాఁటి పదిమోముల వానినిఁజేరె ధీరుఁడై. 93

వ॥ చేరి కొలువుకూటంబున రాక్షసానీక పరివృతుండగు రావణుంగనుంగొని చూపఱులచ్చెరు వందునట్లుగా నిట్లనియె. 94

ఉ॥ "ఓరి! నిశాచరేంద్ర! వినుమొయ్యన మున్నునుఁజంకఁ బెట్టి ము న్నీరుఁ ద్రబదక్షిణించి కరుణించిన వాలిసుతుండ, నాతనిం గూర్రుని నొక్కబాణమునఁగూల్చిన రాముని దూతనైతి, నా శూరుఁడు పంప నిన్నిచటఁ జూడఁగ వచ్చిన యంగదుండనే .

ఉ॥ పోరొనరించెదోయడరి, భూమిజఁదెచ్చితి బుద్ధిలేక య చ్చారఘురాము పాదముల నంజలిఁజేరిచి యప్పగించి, యె వ్వారలెఱుంగకుండఁ జని ప్రాణములందగఁ గాచికొందో, సీ వారసి తెల్పు, లంకకిఁక నార్యవిభీషణుఁడయ్యె రాజుగన్. 96

ఉ॥ రాక్షసరాజ! మూఁడవది రాముని కన్ను కళత్రముంచుదు త్ప్రేక్షుఁగొనంగ నెంచెదు, మదింగదలపోయవొకింతయున్నిఁకూ

పాక్షుని కన్నుమూఁడవది పద్మముగా మదినెంచుచున్మహా
పేక్షఁగడంగి భృంగమది పేర్చుమదంబునఁ దాఁకు కైవడిన్ 97

చ॥ నలువ మొగంబొకండు మలినంబయివాఁడెను హైహయుండనిన్
జలమున బందిఁజేయఁగనె చయ్యననొక్కటి మ్లానమయ్యెనీ
తులువతనంబుచేత, జలధుల్వడిఁ ద్రిప్పెడు నాదుతండ్రిచేఁ
గలుషితమయ్యెనింకొకటి, కంటివెరావణ! నీచరిత్రమున్ 98

తే॥ మిగిలియున్నది యొక్కటి తగులు బాసి
దాని నిప్పుడు నొప్పింపఁ దలఁచు చుంటి
బ్రహ్మకులమునఁ బుట్టిన వాఁడ వౌర!
సీతనర్పించి రామునిఁజేరి బ్రతుకు. 99

చ॥ ధనపతి పుష్పకంబు భుజదర్పముచేహరియించి వెండికొం
డను బయికెత్తి, దిక్పతులడంగఁగఁ జేసితినంచు మాటికిం
బనవిన లాభమున్నె, మునిభంగి నరణ్యము సొచ్చి దొంగవై
వనజ దళాక్షి సీతఁ గొనివచ్చితి శూరుఁడవయ్య! రావణా? 100

ఉ॥ చిత్తము లేక తప్పిదము చేసితి, దానిని మార్చుకొమ్ము, లే
కిత్తెఱఁ గేను మాననని యెంచినచో రఘువీర చాపము
న్నొత్తుగఁ బ్రాణముల్గొనఁగ వీఁకశిలీముఖపంక్తి సర్వముం
దుత్తుము రొచు నేలఁబడి తూలఁగ నీవెటులోర్తురావణా! 101

చ॥ అని వినిపింప రాఘవునియాజ్ఞ, నిశాచర చక్రవర్తి భ
గ్గున హుతవహ్నియట్లడరి క్రోఁతిని బట్టుఁడు కట్టికొట్టుఁడం
చును దెలుపంగ రాకుసులు చుట్టఁగఁగొందఱుఁదోకఁజుట్టినిం
గినినెగఁబ్రాకి నేలపయి గిఱ్ఱునఁద్రిప్పుచు మోఁది చంపినన్. 102

ఉ॥ చూచుచు రావణుండు తనచుట్టును మూఁగిన రాక్షసౌఘము
న్వేచని యడ్డగింపుఁడన, వీఁక నెదుర్చిరి, వారినందఱిం
బీచమడంచి యంగదుఁడు పేర్చి రఘూద్వహుఁ జేరి "యింక నా
నీచుఁడు చావనుండె" నని నిర్ణయమెల్లను విన్నవించుచున్. 103

చ॥ విదితము సేయువృత్తము సవిస్తరమంగదుఁడప్పు రాఘవుం
డిది కడయత్నమింక వడినేఁడెఱఁబోరొనరించి రక్కసుల్
బ్రిదుకఁ దొరంగఁ జేయుఁడని ప్రౌఢిగ నెల్లర కానపెట్టఁగా
విధుల నెఱింగి యెల్లరును వేగమ పూనిరి పోరుసల్పఁగన్. 104

—: యుద్ధ ప్రారంభము. :—

ఉ॥ కొందఱు చెట్టులెత్తి, మఱి కొందఱు గుండులు గుట్టలెత్తి యుం
గ్రంబుగఁ గోటగోడలెగఁ బ్రాఁకుచు గోలమొనర్చునంత నా
సందడి విన్న రక్కసులు సత్వరమందఱు నందుఁ గూడఁగం
దుందుభి నాదములెల్లెలఁగ దొమ్మిగఁ గ్రమ్మిరి వీరువారునున్.

వ॥ అంత రాక్షస రాజు సేనాపతులం గనుంగొని "యుద్ధసన్నద్ధులై
ద్వారంబులం దెరచి రణంబునలిపి రణరంగంబున వానర వీరులం
బరిమార్చిరండు" నియాజ్ఞాపించిన, వారును దమతమ బలంబు
లంగూర్చుకొని ముసల ముద్గరగదా ఖడ్గతోమర పరశు పట్టిస పరి
ఘుచక్రకుంత భిండివాలాద్యాయుధంబులు మెఱయ, నార్భా
టంబులు చెలంగ, వెలువడి తగులుపడిన నాసంకుల సమరంబున
కంతరిక్షగాము లాశ్చర్య పరవశులై చూచుచుండి రయ్యవస
రంబున. 106

ఉ॥ బండారులం జయింపనగు నోజనుబోరుచుఁ బౌరుషంబునం

దండిమగంటిమిన్ సమరధారుణిఁగ్రిందులు మీఁదులౌచు వే
దండములట్లు డీకొనుచుఁ దద్దయుఘోరతరంపు వ్రేటులం
జండతఁబోరఁగానపుడు సంభ్రమమొప్పఁగ నింద్రజిత్తుడున్. 107

ఉ॥ రంగమునందునిల్చి సమరంబున నెవ్వరునిల్చువారు రం
డంగములెల్లఁ జీల్చియిఁక నంగడిఁబెట్టుచు నమ్మువాఁడ నం
చుంగరువంబునం బలుకుచున్ సమరోద్ధతుఁడౌచుఁ గ్రోధము
ప్పొంగఁగ బట్టివానరుల భూరిబలోన్నతిఁ జెండుచుండఁగన్.

ఉ॥ అంగదుఁ డంతలోదుమికి యార్చుచు, నింద్రుఁడు వజ్రధారచే
తంగిరిశృంగములునుము తంతుపొసంగఁగ వారువంబుల
న్నింగినినిల్చి వృక్షముల నీల్గఁగమోఁదుచు నాక్షణంబునం
బొంగుచు నింద్రజిత్తురథముం బడనేసె మనోరథమ్మునన్. 109

శా॥ సాయంకాలముగాఁగ రాక్షసులకున్ సంరంభముప్పొంగ బ
ల్మాయల్పన్నుదురంచు నెమ్మదిని సంభావించి రాముండు ధౌ
రేయుండై వడిఁదాఁకి ఘోరసమరక్రీడా పరాయత్తుఁడై
సాయంబెవ్వరు చూతమంచు శరముల్సంధించి చామోఁదఁగన్

శా॥ ఘోరంబయ్యెడు శౌర్యవహ్నియనఘం గ్రోధంబుదీపింపఁగాఁ
బోరంజొచ్చిరి సారణుండు శుకుఁడున్మ్మధాతి కాయుండునే
పారన్నిచు మహోదరుండును మహాపార్శ్వుండు కూరాత్ముఁ
డుం
ధీరుండయ్యెడు వజ్రదంష్ట్రుఁడు దిశ ల్వీండ్రింప గాండ్రించుచున్.

శా॥ అంతన్ రాఘవుఁడాటు బాణముల నాయార్వ్యర్థరం గూలఁగాఁ
బంతంబొప్పునె యంచువేయఁ, గపులున్ బాషాణఘాతంబుచే

నెంతేనొవ్వఁగఁజేసి, ముష్టిహతులన్ వృక్షంబులన్మ్రోఁదిరా,
వింతల్ సూచి వియచ్చరుల్మనముల న్వేడ్కల్కడుంబొందఁగన్.

ఉ॥ ఇంటికిఁబోయి వేల్చికొని యింద్రజితుండొక పైఁడి తేరునం
దంట తనంబునన్మెఱసి తార్కొనికయ్యము సేయువాఁడునై
మింటికిఁబ్రాఁకి కన్పడక మిక్కిలి మాయలుపన్నుచుంగడుం
దుంటరి, యేచురాఘవులతోరణమందునఁగ్రీడసల్పుచున్. 113

శా॥ బాణంబుల్బహుభంగులం గపివరప్రాణంబులన్నొంప, గీ
ర్వాణుల్డెందములం దలంక శరముల్వ్రాటించినాటంగ, బల్
నాణెంబొప్పఁగ రాఘవుల్కులుకులన్నాటంగ వేపోయి యా
బాణంబుల్గనుఁగోక వానిమరలన్ భాసిల్లుచున్వచ్చినన్. 114

ఉ॥ ఒక్కటనిల్చి కేకయిడు, నొక్కటనిల్చుచుఁ బేరుఁజెప్పుఁదా
నొక్కటనిల్చినవ్వు, మఱియొక్కటనిల్చి శరంబులేయు, నా
చక్కియెఱుంగరాకడరు సంగరరంగములోనివారికిం
జిక్కక పెక్కుమాయలను జేయుచునుండెను నింద్రజిత్తుఁడున్.

శా॥ అన్నా! రాఘవ! వీనిమాయలకునయ్యా! యంతులేదయ్యొ, ని
ట్లున్నన్వానరవీరులెల్ల ధరపై డుల్లంగఁ గాలంబుగా
కున్నే వీనినడంచునవ్వొరవులేదో! యోజసేయంగదే
యన్నన్ లక్ష్మణ! తొందఱపడకుమయ్యా! యంచు రాముండ
నన్. 116

చ॥ వినియదియింద్రజిత్తు ఘటువీరుల వీరినుపేక్ష సేయరా
దనితలపోసి వేగభయదంబగు నాగశరాళినేయ, మూ
ర్ఛనుమునుఁగంగ రాఘవులు, రావణుచెంతకునేఁగి రాముల

క్ష్మణులవధించి వచ్చితిని గంటిజయంబని యుబ్బంబల్కఁగ౯.

ఆ॥ వె॥ తండ్రిసంతసించి తనయునిఁ గీర్తించి
యనుప నతఁడు సదనమునకుఁ జనియెఁ
బటుజయంబుఁ గొన్నభంగిని ముదమంది
రావణుండు త్రిజటరాఁగఁ జేరె. 118

క॥ "ఇప్పుడు జానకియేమనుఁ
జెప్పుము నావిజయవార్తఁ, జేరికొలువఁగ
న్మెప్పుఁగొనంగను బలుకుము
చప్పిడిజీవితముఁ గడపఁ జానకుఁదగునే?" 119

వ॥ అని ప్రోత్సహించి యనుపనా త్రిజటయు సీతకడకుంజని వృత్తాంతం
బు నివేదింప రాక్షసమాయఁగా ననుమానించుచున్న యాయ
మను బుష్పకవిమానంబునంగొని చని సంగరరంగపతితులగు రా
మలక్ష్మణులం జూపిన నమ్మానిని దుఃఖంబాపఁజాలక వెక్కివెక్కి
యేడ్చుచుఁ ద్రిజటచే నాశ్వాసింపఁబడుచుండు నవసరంబున,
రామలక్ష్మణుల సన్నిధికి నారదుండరుగుదెంచి, రామచంద్రుని
యమేయమహిమంబును గొనియాడి గరుత్మంతుం దలంపుమని
యంతర్హితుండగునంతన పక్షిరాజు సాక్షాత్కరించుచుండ నన్నా
గంబులు బంధంబులువీడి యోడిపఱచెనంత. 120

క॥ రాముఁడుకనుఁగొని గరుడుని
"నీమహిమము పొగడఁదరమె నిర్మలతేజా!
సేమముఁగూర్చితి మాకీవు
డీ మహినినుఁబోలువార లెందునుగలరే?" 121

చ॥ అనుటయు భక్తిపూర్ణవినయంబున రామునితోడఁబల్కు "నీ
వనయముఁగూర్చుభక్తుఁడను, నార్యరఘూద్వహ! లెమ్ము సంగర
మ్మునఁబడఁగూల్చి రావణునిఁ, బొందెదుజానకిచింతయేల, యి
మ్మునజయమౌనునీక"నుచుఁ బోయెనువీడ్కొని వైనతేయుఁ
డుగ్ర. 122

వ॥ అంత వైదేహీసంతుష్టాంతరంగయై యా రాఘవునకు మంగళంబు
లాసించుచుండెనియె. 123

సీ॥ అపుడిరుపక్షమ్ము లడరిపోరొనరింప
మారుతి ధూమ్రాక్షు మృతిఁదజేయ,
నంగదుఁడతిరౌద్రుఁడయి వజ్రదంష్ట్రుని
నచలంబుఁబై గూల్చి హతునొనర్ప
నీలుండు శైలంబు నిగిడిని త్రినద్రొబ్బి
పంచత్వమొందింప బలిఁబ్రహస్తుఁ
జానఁగమిగిలిన రావణుబలములు
వడినేఁగినడచిన వార్తఁదెలుపఁ.

తే॥ చండకోపనుఁడై నిశాచర విభుండు
భండనంబున కరుగనుద్దండుఁడగుచు
భూరిసేనాసమేతుఁడై తేరినెక్కి
పురముకదలిన వడువునఁదరలెనంత. 124

=: రావణుని మొదటి యుద్ధము. :=

తే॥ దశదిశాపాలకులజేత దశముఖుండు
కదలి శ్రీరామచంద్రుని కంటఁబడఁగ

శిరముపంకించె శ్లాఘించి చిత్తమందుఁ
గుడిభుజంబును జలియించె గుటిగొనంగ. 125

మ॥ పటుదీప్తుల్మెఱయంగ సంగరమునన్ భాసిల్లుచున్నిల్చి ది
క్తటులున్ మ్రోయఁగ, నార్భటుల్చెలఁగ, నాకాశంబు వ్రీలంగ, బ
ల్పటు కాండంబులవీడ, వానరపతుల్భంగంబు శంకింప, త
త్కుటిలుండాఁకెను నాంజనేయుఁడు మహాకోపంబు రేకెత్తఁగన్

మ॥ పలికెన్ రాక్షస చక్రవర్తి వపురా! భాగ్యంబు నీకబ్బె, నీ
చలముందీర్చెదనంచు గ్రుద్ధాకటివక్షంబందు సారింప "భేష్
బలుధీరుండవు క్రోఁతి! నీదు బలముం బాటింపఁగాఁబోలు" నం
చలుకం గ్రుద్దెను రావణుండు పెలుచన్ సామీరిమూర్ఛిల్లఁగన్

శా॥ అంతంబొంగుచు నంగదుండు కపియన్ హర్షించి బల్తూపులం
జెంతంజేర్పక నొవ్వఁజేయ నతఁడుంజేపట్టి పెన్గొండ బల్
వంతంగూర్పఁగనేయ, దాని నడుమన్ భంజించి పేరుక్కునం
బంతంబేలర! రావణుండుగనవే, బంధించి భంజించెదన్. 128

మ॥ అనఁగా మారుతి మూర్ఛదేఱి వడిగా నయ్యంగదుంజేరి "యీ
తనికిప్పట్టునఁ జావుతప్పె, మనకుం ధర్మంబుగాదీతనిం
జనుమన్ రాముని పాలికార్యమదిగాదో, రమ్ము" నావేగ నీ
లునిపైఁదూఁకెను రావణుండు శరముల్ రూపించి వర్షించుచున్

శా॥ నీలుండంతట శైలవర్షమున వానింగూలుమంచేయ, నా
భీలప్రోజ్జ్వల పుంఖపంక్తిఁ బెలుచన్ భేదించి దుర్భేద్యుఁడై
లీలంగ్రాలుచు రంగమెల్లఁగలఁగన్ రేఁగన్ సుసూక్ష్మాకృతిం

బోలనార్వని శిరంబుపైఁ బడఁగ్రుచ్చెఁ బూన్కి న్వసింద్రదోషక్కుచున్.

ఉ॥ కంటికిఁ జిక్కకుండఁ గడఁకంగడు చిత్రగతిం జరింపఁ, బె
న్మంటలు గ్రక్కునట్టి దహనాస్త్రము నేసిన, వానిఁ జుట్టి యా
మంటల రోమముల్ గమరె మాయను పాత్రిణము హేతు వేమొకో
మింటఁ జరించువారలును, మేదిని వారలు నక్కజంపడన్. 131

ఉ॥ అంతట లక్ష్మణుం గదిసి యార్చుచు "నోరి! నరాధమా! యిఁకం
బంతము దీర్చుకొందు, ననుఁ బట్టిచి నిల్వఁగ నీకు శక్యమే!
గంతులు సెల్లునే, ప్రళయకాలుఁడు నావుడు నాకు నెగ్గొరో
యింతిని గావ వచ్చితివి, యేటికిఁ జచ్చెదు పొమ్ము" నావుడున్.

వ॥ అప్పుడు లక్ష్మణుఁడు. 133

ఉ॥ ఓరి! నిశాచరాధముఁడ! యూరక ప్రేలుట పెద్దగాదు, పల్
శూరుఁడనైతి వేని తగఁ జూపుము శౌర్యము పెక్కుప్రేల, నీ
భూరి పరాక్రమంబు నిట మున్నె కనుంగొని యున్నవాఁడఁ గా
నీ రణమందుఁ జూపుమది, నీవ నినున్నుతియింప మెత్తురే?. 134

చ॥ అనుటయు భూరి కోపమున నద్దశకంఠసుతుండు గ్రమ్మఱ న్మొ
కొనకొని యేడుబాణములఁ గొట్టిన లక్ష్మణుఁ డొక్కు తుంట్లు
తనరఁగఁ గొట్టి, వాని యెడఁదం గుఱిసేయుచు సుతీక్ష్ణ పుంఖముల్
ఘనముగ వేసినన్నదియు ఖండనసేయుచు నిస్త్రిశాస్త్రముల్. 135

ఉ॥ అగ్నికణంబులం జినుకు నస్త్రము వాలమునాఁటనేయు, ని
ర్మగ్నుఁడు పోలె దుఃఖజలరాశిని నించుక, క్రోధదీప్తుఁడై
యగ్ని సముండు లక్ష్మణుఁడ వార్యబలోన్నతి మూఁడు తూఁ
పుల

భగ్నముగాను అమ్మునడఁపంగ నతండును మూర్ఛమున్గుచున్.

ఉ॥ తేటి విని శ్వసించి కడిఁదిన్వడి శక్తి నినేయ. నద్దియుం
గూరఁగ లక్ష్మణుండు ధరఁగూలెను మూర్ఛమునింగి, యంతనా
క్రూరుఁడు రావణుండతనిఁ గొంచుఁ జనన్గమకించుచుండఁగ
న్మారుతివేగవచ్చి విడుమంచునుఅమ్మున గ్రుద్దె రావణున్. 137

తే॥ లక్ష్మణుని వీపుపైఁ జేర్చి రయముతోడ
రాము సన్నిధిఁజేర్చెను సేమముగను
శక్తి యాతని విడిపాఱె సత్వరముగ
నది గనుంగొని రావణుండలిగి చెలఁగి. 138

మ॥ ఇనవంశాగ్రణి వంకకుందిరుగనేదీరమ్ము రమ్మంచుఁబె
ల్చను ముల్కుల్ప్రయోగించి వారువములంజక్రంబులం డెక్కెమున్
రణశూరుండగు సూతుఁగూల్చి, యిఁక నీరంగంబుఁగన్గొందు,నేఁ
డవి చాలింపుము రేపు రమ్ము వెడఁగా! యాయాసముం జెందితో.

ఉ॥ నేఁటికిఁ దొందఱపడఁగ నేటికి, నిన్నిఁక వీడువాఁడె, యే
నాటికి నేఁగినందఱిమి నాశమొనర్పఁడె రాఘవుండు, నీ
పాటవముంగుదుర్చుకొని భండన భూమికిరమ్ము, పొమ్ము, బల్
మేటి వటంచుమెచ్చు పరమేష్ఠియొ, యెవ్వఁడొ, దిక్కు చూచె
దర్. 140

వ॥ అని తూలనాడుటయు. 141

ఆ॥ వె॥ చనియె రావణుండు చయ్యనఁబురమున
కమిత పరిభవాగ్ని కధికతప్త
హృదయుఁడగుచునేఁగి వ్రీడాపరీతుఁడై

కోరి నిదురలేపెఁ గుంభకర్ణు. 142

క॥ నిదురించువాని లేపఁగ
మదిఁగలఁగుచు లేచి యతఁడు మానితుఁడగుచున్
గదిలెను భండనభూమికిఁ
దుది మొదలునులేని నిద్రతో ముదమారన్. 143

—♦♦♦ కుంభకర్ణుని యుద్ధము. ♦♦♦—

ఉ॥ కాటుకకొండవంటి ఘనకాయము భీతినిఁగొల్పుచుండఁ, బెన్
గూటువతోఁ ద్రిశూలమును గొంచు వడింజను కుంభకర్ణునిం
బాటిత భూతలుంగనుచుఁ బాఱఁగఁజూచెడు వానరావళిన్
దీటుగ నంగదుండుగని త్రిప్పెను ధైర్యముపోసి యిట్టులన్. 144

ఉ॥ "కైకసి పుత్రులందొకటిగాదె బిభీషిక, దీనిఁగాంచి మీ
పోకడ లొప్పునే, నిలుఁడు, భూరి బలోన్నతులై నవారికి
స్వీకఁ దొఱంగఁబాడియగు, నిశ్చలచిత్తత నిల్చిపోరుఁడీ,
యాకులపాటుఁజెందఁ దగునా, పగవారలు గేలిసేయఁగన్ ".

వ॥ అంత నత్తరుచర వీరులంగదానునయవచనాతిప్రహృష్టాంత రంగులై సమర సన్నాహంబుంబూని దిగ్గజంబులవలె వెనుదిరిగి ప్రమత్తంబగునై రావణుంబోలు రావణానుజుంగాంచి సత్వరంబునఁ బ్రళయానిలంబుల పగిది నానా దిశావ్యాప్తగిరి తరుబృందంబుల వర్షించి రయ్యవసరంబున. 146

ఉ॥ పువ్వులనొప్పు వృక్షములు పొల్చుగుడారపు ముల్లెలట్లు, తొల్
రువ్వినఁదాఁకి వెందిరిగి రువ్విన వానినె వచ్చితాఁకు, వీఁ
డెవ్వఁడొ కుంభకర్ణుఁడట, యెవ్విధిఁజచ్చునొ యంచువానరుల్

చివ్వకు నోడువారివలెఁ జింతిలఁజొచ్చి రొకింత యత్తఱిన్.147

ఉ॥ శూలముపై వయిందిరుగఁజూడ్కికి దుర్భరిమూర్తి రీతియ్యఁడై
యూలము సేయువాఁ డగుచునార్చినదందఱునార్తి మున్గఁగాఁ
గోలలు పెక్కు రాఘవుఁడు గూరఁగ నేసిన నించు కేనియుం
దూలక పల్కెనిట్టుల మదోద్ధతిఁ బెన్గదఁ ద్రిప్పుచొప్పుగన్. 148

ఉ॥ "ఎవ్వఁడవీవు మానవుఁడ వెందుకుఁ జచ్చెద, వింతదాఁక నా
చివ్వకునిల్చి పోరఁగలజెట్టి మగండిలఁబుట్టెనొక్కొ, నిన్
గవ్వకు లెక్కపెట్టుదునె, గర్వము వీడుము, కుంభకర్ణుఁడన్
బువ్వుల క్రీడగాదు, రణభూమిని నిల్వఁగ నీకుఁజెల్లునే?". 149

మ॥ అను నయ్యంతన వానర ప్రముఖు "లయ్యా! వీఁడు సుగ్రీవునిన్
ఘనమౌ పర్వతమెత్తి వేయనతఁడుంగాసిల్లి మూర్ఛిల్లుచున్
రణరంగంబునఁగూలె వీని విడువన్ రాదం"చు ఘోషింపఁగాఁ
గొనియెన్ రాఘవుఁడర్ధచంద్రముఖమౌ కోలన్ విజృంభించు
చున్. 150

చ॥ "పలుకులు సెల్లునే యిచట భండన భూమినిఁ గుంభకర్ణ! యీ
ములుకుల కేమి సెప్పెదువు, ముజ్జగమందునఁ గాచికొమ్ము, నీ
చలము పటుత్వమున్నెఱపు సంగరరంగము, నిద్రకొట్టె," యం
చలిగి కరమ్ములుం బదములన్భుతపద్ధతి నర్కివేయుచున్. 151

ఉ॥ అంతటఁబోక యొక్కటను నాతని శీర్షముఁ జెండివేయ, నా
చెంతల వానరుల్బొంగిజేయని కేకలువెట్ట రాక్షసుల్
క్రంతలదాటి వేగఁజని రావణునితో వినుపించఁగానె, వాఁ
డెంతయుఁ దమ్మునిందలఁచియేడ్చి వరించినెదన్ స్మరించుచున్.

ఉ॥ "పూని విభీషణుండు తగు బుద్ధినిఁదెల్పఁ దిరస్కరించుచు
న్నేను మదాంధతన్వినక నిర్మలచిత్తునిఁ బాఱఁదోలితిం
గాన సమస్తముంజెడియెఁ గామమదాంధత చెల్లునే యిలన్
భూనుత నీతికోవిదుల బుద్ధులె పూజ్యములౌను నెల్లెడన్. 153

ఉ॥ జానకి యేలయింక వడిసంగరభూమిని గూలిచత్తు నా
మానిని ప్రీతిఁజెందుతను, మానవమాత్రుఁడె గెల్పుఁగాంచుతన్
వానరులున్న రుల్కడఁగి వత్తురె వారిధి దాఁటియంచు సు
ర్మానముతోడ నిక్కతిని మాయనుజిక్కితి నాంసెపోవఁగన్. 154

ఉ॥ వీరుఁడనై జగంబులు తపింపఁగఁ దేజము నుక్కమీఱ, దు
ర్వార పరాక్రమంబడర రావణుఁడంచుఁ బ్రసిద్ధినంది, యి
ప్పోరితముంఘటింపఁ దగుపోడిమిఁజూపక యుంటపాడియే,
మేరు ధరాధరంపుఁ గడిమింబగవారల నుక్కడంపనో". 155

వ॥ అని యనేక విధంబుల వితర్కించుచు, విధి విధానంబు మీఱుట యేరికి శక్యంబు గాదని మనంబు పదిలపఱచుకొని రావణుండు, సహోదరులగు మహోదర మహాపార్శ్వులను సహాయులంగా వించి నరాంతక దేవాంతకాతికాయ త్రిశిరసులను కుమారుల ప్రోత్సహించి యనుపఁ దండ్రి యానతి శిరసావహించి వారు పితృపతి నివేశనదృశంబగు పొలికలని ప్రవేశించి రయ్యవసరంబున. 156

తే॥ రెండు బలములకయ్యెను భండనంబు
చండతర రోష భీకరోద్దండభుజము
ఆశయా పూర్తి కరమమరాంగనలకు

దేవమునిచూచి మెఱుఁగని భావభరము. 157

ఆ॥ వె॥ వాలినందనుండు వనచరవాహినీ
హంతకుండు సౌనరాంతకునిని
హతమొనర్చె శైలపతనంబుచే, నంత
హనుమచంపె నాసురాంతకునిని. 158

వ॥ అనంతరమసమసమరశీలుండగు నీలుండు మహోదరుం బరిమార్పఁ, దిత్రిశిరసుండును, మహాపార్శ్వుండు మున్నగు వాహినీపతులును మారుతి నిహతులుగాఁగ, నిశాచరాకారంబైన తమోనికాయం బుంబోలె నతికాయుండు సన్నద్ధుండై వృత్రాసురుండు సుత్రాముతోడంబోలె సుమిత్రాసుతునితో విచిత్రంబుగ నాయోధనంబు సలుపుచుండ. 159

ఉ॥ పోరి చిరంబు లక్ష్మణుఁడు "భూరిబలుం డతికాయుఁడీతఁడ
వ్వారిజసూతి సత్కృపనవధ్యుఁడటం" చనిలుండు తెల్ప, న
వ్వారిజసూనునస్త్రమున వానిశిరంబెగఁజిమ్మెనింగికిం
ధారుణి నెల్లవారు కలఁతంగొన రాహువటంచు భీతులై. 160

చ॥ తనయుల చావుకై కలఁగు తండ్రికి నెమ్మదిఁగూర్చ యింద్రజి
త్తనయుఁడు రామలక్ష్మణులవాడి యడంచెదనంచు సత్వరం
బున శరముల్ శరాసనముఁబూని ససైన్యుఁడు సంగరార్భటిం
జనియె రథంబుపై విజయసంభ్రమముందనుఁ బ్రోత్సహింపఁగన్.

—♦♦ ఇంద్రజిత్తు రెండవయుద్ధము. ♦♦—

చ॥ చని రథగుప్తికై యచటఁజాలిన రాక్షస సంఘముంచి, తా
ననల ముఖంబునన్వివిధ మస్త్రచయంబునుఁబొంది, యంబరం

బున నిలుచుండి కన్పడక భూరిశిలీముఖ వృష్టిచేరణాం
గణమున నున్నవానరుల కాయములంగడు నొవ్వఁజేయుచున్.

తే॥ కఠినతరమైన వేసవికమలసరసి
చందమున రాములక్ష్మణసహితునప్పుడు
విధురసత్త్వుని వికలాత్ము వేగఁజేసి
యేఁగెఁదనమందిరంబున కింద్రజిత్తు. 163

చ॥ తరుచర సేనయెల్ల వసుధంబడి మూర్ఛ మునింగియుండ, న
త్తరణికులుండు రాఘవుఁడు తమ్మునితోఁ బడియుండఁగాంచి, స
త్వరుఁడయి జాంబవంతుఁడును బావనికిందగఁజెప్పి పంపఁగా
నరిగె నతండు వేగమున నౌషధ పర్వతముందలంచుచున్. 164

ఉ॥ పావనియేఁగి యందు బహుభంగులవేఁడిన నొప్పకున్న సం
జీవని పర్వతంబుఁగొని చీఁకటి వాయకమున్నవచ్చి సం
జీవితులై తలిర్పఁగను జేసిన వానరవీరులెల్లరుం
దేవతలుల్లసిల్లవడిఁదెప్పిటి నిల్చిరి సంగరార్థులై. 165

—: వానరులు లంకను గాల్చుట. :—

సీ॥ దావాగ్ని వడువునఁ దరుచరవీరులు
దరి జేరంగున లంకఁ దవిలికాల్పఁ
బ్రకటకోపోద్దీప్త రావణుపంపున
నదివీడి సింగంబులట్లు మొఱసి
లోక ప్రకంపన రూఘుఁడకంపనుఁ
డాహత వనచరుండగు ప్రజంఘుఁ
డంగదు శౌర్యాగ్ని కాహుతి యగుటయు,

విని, యట్టె మైందునిద్వివిదుఁడాఁకి.

తే॥ వారిచేఁ జంపఁబడు విరూపాక్షు, శోణి
తాక్షుఁగుంభనికుంభులు సాక్షులగుచు
నెఱిఁగి సుగ్రీవు హనుమంతు గఱిగఁదాఁకి
పోరఁదొడఁగిరి సంగ్రామ వీరులగుచు. 166

చ॥ కొనకొని యర్కజుండడరి కుంభునిఁ గుంభినిఁ గూలనేయఁ, బా
వనియు, నికుంభునింగడఁగిపట్టి ధరాస్థలిఁ గూలనేసి, యా
తని యురమందునెక్కి భయదార్భటిఁ గుత్తుకనుల్మిచంపఁగాఁ
జని బెగడొంది రాక్షసులు చయ్యన రావణుతోడఁదెల్పిరన్.

చ॥ విని మకరాక్షునింబిలిచి "వేగమ యేగుము దర్పమేర్పడ
న్వనచర వాహినీ పతులవారక చంపుము, రామ లక్ష్మణుల్
తనువులు వీడునట్లడరి తన్నుము నాముదినం"చుఁ బంపఁగాఁ
జనియెఁ బతంగమట్లతఁడు సంగర భూమికి నల్కఁజూపుచున్.

తే॥ ఘనతరాటోపములవేగఁ గడఁగుచుండ
రాముఁడడరించె నొకయమ్ముఁరమ్ముగాఁడఁ
గూలె మకరాక్షుఁడుద్ధతిఁ దూలియవని
రావణుని భావమందున్న చేవతూల. 169

వ॥ అంత విదిత వృత్తాంతుండై పలుతెఱంగుల విచారించుచు. 170

ఉ॥ శోకము కోపముం బెనఁగఁజూచి నిశాచరరాజు "వానరా
నీకము లెంతసేసె, నగునే, మనకొప్పరికింపఁ దండ్రి! య
స్తోక పరాక్రమంబుగల శూరుఁడ వొక్కఁడవీవ" యంచునా
నాకపటంబులం దెలిపినంగడునుబ్బుచు నింద్రజిత్తుఁడున్. 171

చ॥ శిరమునఁ దండ్రియానతినిఁ జేర్చి రణస్థలి కేఁగి యందు, భా
సురముగ నగ్ని వేల్చి బలుచోద్య పుటస్త్రములం భజించి, వా
నరబలమెల్లఁ గాంచి, గగనంబున నిల్చుచు మాయచేఁ జమూ
త్కరము బడల్పడంగ శరకాండము లేసెను నుక్కు మీఱఁగన్.

చ॥ తరుచరులెల్లఁ గీడ్పడి యతంత్రత నుక్కిరి బిక్కిరౌటకం
బరమెగఁ జూచి రాఘవుఁడు వానరవీరుల హెచ్చరించి, దు
ర్భర పటుకాండముల్వఱపి రావణిఁ గూల్పఁగ దుర్నిరీక్ష్యభా
స్కర శతకోటి తేజమున సజ్యధనుష్కుఁడు సంభ్రమింపఁగన్.

చ॥ ఇది సమయంబు గాదనుచు, నిచ్చట నిల్వఁగ రాదటంచుఁ, దా
సదనముఁ జేరి సంగరపుఁ జందములెల్ల నుతించుకొంచు, నె
మ్మదిఁ బలుకంగ రావణుఁడు మండుచు "నిద్దియ నీప్రతాపమౌఁ
గద, సమరస్థలిం గడఁకఁ గయ్యము సేసితె, శత్రుఁ జంపితే? 174

ఉ॥ ముందుకు వెన్కకుం బఱచి మూర్ఛను ముంచితిఁ గన్పుగొట్టితి
జిందఱవందఱై పఱవఁ జేసితినంచు వచింపఁ జూడ నీ
చందము సంశయాస్పదము, సంగర రంగముఁ జేరి శత్రువుల్
మ్రిందఁగఁ జేయుటెంత, యసమాన బలోన్నతి నింద్ర[illegible]నే.

ఉ॥ పొమ్ము రణోద్ధతిం గడఁగి పోరుము, వానరకోటి చావఁగం
జిమ్ము శరమ్ములన్, సురలఁ జెండినవానికిఁ గొడ్కువెంత, తే
లెమ్ము కుమార! లోకులరరే! బలుశూరుఁడనంగఁ గీర్తిఁ గై
కొమ్ము, మదీయ శౌర్యమున కుందగు పుత్రుఁడవంచు నెన్నఁగన్.

మ॥ అనుచున్ రోష పరీత చిత్తుఁడయి యత్యంతార్భటింబంప న
త్తన యుం డెక్కుడు శౌర్యదీప్తుఁడగుచున్ దండ్రీ! నమస్తే యటం

చు నిలింపుల్భయ మందఁగానడరి యీసుంబూని పోరంగఁదాఁ
జనియెన్వాఁడియుసంగరస్థలికిఁ జంచద్దర్ప దుర్దాంతుఁడై. 177

ఇంద్రజిత్తు మూఁడవ యుద్ధము, లక్ష్మణునిచే మరణము.

ఉ॥ ఏఁగుచు మధ్యమార్గమున "నెవ్విధి వీరలఁజంపఁగా దురు
ద్యోగము సేయనౌను, రణధుర్యునిఁ జంపిరి కుంభకర్ణునిం
సాగదు వీరిముందు పటుసంగరచాతురి, రామలక్ష్మణుల్
వేఁగఁగఁజేసి మాయలను వేగమ కూల్పఁగ నాకుయుక్తమా.

మ॥ అనుచుండెందమునందలంచి వడి మాయాసీతఁగల్పించి, తే
రునఁగొంచుంజన, నంజనీ తనయుఁడుగ్రుండౌచు నేతేరఁగాఁ
"జననౌ నెచ్చటికింక నీకుఁదులువా! సంగ్రామరంగంబు చ
య్యన శాంతింపఁగ జానకింబలిగఁ జేయంజూతురా రమ్మిటుల్".

చ॥ అని కరవాలముంబెఱికి యార్వఁగజానకిఁ గ్రిందికీడ్చి గ్ర
క్కునఁ దెగఁవేయఁగంతమును, గ్రుద్ధుఁడు మారుతి వానితోడని
ట్లను "దనుజుండ వైనఁగనరాదొకో ధర్మపథంబునీచ! యి
జ్జనకజ సాధ్వినిప్పగిదిఁ జంపఁగ నీకెటు చేతులాడెరా! 180

ఉ॥ ఓరి దురాత్మ! నిన్నిపుడ యూపిరిదీసి తొలంతుఁగాని, ని
ర్ధారణలేక చిక్కితిని, రాముని యానతి లేకపోయె, నీ
పౌరుష మెంతపాటి, యిలఁబండునె దుష్కృతి, చత్తువం"చు "మీ
పోరులు మాని వానరులుపోయి రఘూత్తముతోడఁదెల్పుఁడీ".

వ॥ అని యొక్కపెట్టునఁ బెద్ద కేకవైచి, శ్రీరాము సన్నిధికిం బఱచి,
యింద్రజిత్సంహృత జానకీవృత్తాంతంబు సత్యంబు కావగచి, శో

కానలదందహ్యా మానమానసుండై నిలువంజాలక శ్రీరామునకు నివేదించిన నతండు కొండవిరిగి మీఁదఁబడిన యట్లు నేలంగూలి నానా ప్రకారంబుల జానకిందలంచి విలపించుచుండె నయ్యవసరంబున. 182

=♦ ఇంద్రజిత్తు, నికుంభిలను మారణహోమంబు సేయుట. ♦=

ఉ॥ కోరిక నింద్రశత్రువు, నికుంభిలకేఁగెను శత్రుమారణ
క్రూరముహోమముల్ సలుప రూఢిగనందు హవిస్సమర్పణం
బారఁగ నగ్నికేల్పఁదగు పన్నుగడందలపోసి వ్రేల్మిడిం
ధీరత రక్తమాంసములఁ దీవ్రతరంబుగ వేల్చుచుండఁగన్. 183

ఉ॥ ఇచ్చట లక్ష్మణుండనునయింపుచునుండ విభీషణుండు తాఁ
గ్రచ్చుఅనేఁగుదెంచి "రఘురామ! యిదేమిటి సంభ్రమంబు, నీ
యిచ్చఁగలంగఁ బాడియకొ, యియ్యది సత్యమె, మాయఁ
గూర్చినా
మచ్చరి యింద్రజిత్తు తనమారణహోమము పూర్తిసేఁతకై. 184

చ॥ కలఁగుట పాడిగాదు కడఁకన్వడి బంపుము లక్ష్మణానుజుం
దలపడి హోమముంజెఱిచి తద్దయు వానిని సంహారింప, నా
తులువ కడింది హోమమదితోడన పూర్తియొనర్చునేని ని
య్యల నతనింజయింపనగునే త్రిగజంబుల శూరకోటికిన్". 185

చ॥ అని వినిపింప లక్ష్మణున కార్యుఁడు రాముఁడు దీనవత్సలం
గను గృపనేసి, శూరుఁడవు కయ్యమునంజయమంది రమ్మటం
చును బనుపంగ విల్లు గొనుచుందగనన్నకుఁ కేలుమోడ్చియేఁ
గెను వనచారి సైన్యములు కేకలువేయుచు వెంబడింపఁగన్.

చ॥ ఎదురుగఁ దాఁకు రక్కసులనేడ్తెఱఁ గుప్పలు కుప్పలై పడం
జదుముచు వానరుల్దవిలిచెంత విజృంభణముల్దలిర్పఁగా
నదుముదు మింద్రజిత్తు వడినాతని హోమము పాడుసేతుమం
చుదిత ప్రహర్ష పూర్ణ హృదయోజ్జ్వల మూర్తులు ప్రోత్సహింపు
చుఁ. 187

ఉ॥ కూఁతలబొబ్బరింతల నికుంభిల దూఱఁగ నింద్రజిత్తుఁ, డా
క్రోఁతుల గంద్రగోళములకుందుది యాహుతినుజ్జగించి యు
ద్భూత మహోగ్రకోపుఁడయి ఘోరశరంబులఁ బూనినిల్చెబల్
ఘాతకుఁడౌచు నత్తఱిజగంబులకెల్లను దుర్నిరీక్ష్యుఁడై. 188

వ॥ అంత సమీరసూనుండొక భూరుహంబు పెఱికికొని యెదురింప న
తనితో సురపతివైరి పోరంగమకించుచుండ, విభీషణుండు వాని
సేయుహోమవిధానంబు సవిస్తరంబుగ వివరించు నవసరంబున
నయ్యింద్రజిత్తు విభీషణుంగాంచి యిట్లనియె. 189

ఉ॥ ధర్మమువీడి మానవులఁ దార్కొనియన్నకుఁ గీడుసేయ దు
ష్కర్మపరుండవౌ నినుజగంబున మెత్తురె? పిన్నతండ్రివే?
చర్మమునూడఁదీసి పెలుచన్ శమనాంతికమంపువాఁడ, మీ
కర్మముమంచిదైన వడిఁగాలికిబుద్ధినిఁ జెప్పుటొప్పగున్. 190

చ॥ అనుటయు "నేదిధర్మమగు, నన్యులభార్యలఁ గొంచువచ్చి దు
ర్జనతఁ బ్రవర్తిలంగనది సంగతధర్మమొ, యుక్కుమీఱి స
జ్జనులకు మానివర్యులకసహ్యపుఁ గార్యముసేఁత ధర్మమో,
యినకులు రామచంద్రుఁ బరమేశ్వరుఁ జేరుట ధర్మమయ్యెనో."

వ॥ అని యతండు పలుకుచుండనది పెడచెవింబెట్టి లక్ష్మణు నుపల

క్షించి యిట్లనియె. 192

ఉ॥ వచ్చితె లక్ష్మణా! మరల వాసిచెడంగఁ దలంతువేల నీ
యిచ్చకువచ్చినట్టిదగునె ప్రాప్తికై నను నేఁగరావొకో.
గ్రచ్చుఅనాగపాశములఁ గట్టుటయెర్గవొ బాలిశుండ! పో
మ్మిచ్చటనిల్వఁజాలుదె నిజేచ్ఛఁజరింపమనుష్యబాలకా!. 193

వ॥ అని తిరస్కరించిపలుక రామానుజుం డిట్లనియె. 194

ఉ॥ "దొంగతనంపుఁబోటరివి దొడ్డఁగఁ జెప్పుకొనంగ నీకుచె
ల్లెంగద, నీచ! మాయలు ఫలించునె? నిక్కపు శౌర్యమున్నదునే
నింగయికొంచుఁ జాప మవనింబొగడొందఁగఁ బోరు సల్పిపే
రుంగల శూరుఁడై మనుట లోకము పాడి మదిందలంతువే?.

వ॥ అని యివ్విధంబున నొండొరులు తమ తమ పౌరుషంబులు పుర
స్కరించుకొని తూలనాడి వాదించుకొనుచుండ. 196

ఉ॥ మాటకు మాటపైకొనఁగ మైకొనఁగోపము జ్యానినాదముల్
మేటి విజృంభణంబనుచు మించి జగంబునఁ జాటుచుండఁగం
బోటది ఘోరమైపరగె ముల్కులవానను మున్గి తేలుచు
న్మాటికిఁ బోటుమాటలను మండుచు నొండొరు మీఱిరిద్వరుఁ

ఉ॥ ఒక్కఁడు తూపులన్విడువ నొక్కఁడు ద్రుంచుచు నుక్కుమీ
ఱుచుఁ
జిక్కక మూఁడునాళ్లిటులఁజేసిరి కయ్యముఁగాని గెలుపొక్కఁడున్
నిక్కఁడు బీటువోఁడు తన చొక్కపు శౌర్యము ముజ్జగంబున
న్వెక్కసమైకనంబడఁగ నిక్కుచుఁ బోరఁగ నిద్రజిన్నుఁడుఁ .

చ॥ "గెలిచితి ముజ్జగంబులను, గెల్చితి నింద్రునిఁ జుల్క.. నిన్నరు

గెలువ నసాధ్యమంచు మదికింబొడకట్టెడు నేమిహేతువో,
విలయ కృశానుఁడోయనఁగ వీఁడు విజృంభితుఁడయ్యె నక్కటా!
తలఁప విధాతృకల్పనలఁదప్పఁ గొనందరమానె యేరికిన్". 199

చ॥ అని తలపోసి శౌర్యసముదంచితుఁడై సురరాజువైరి నె
మ్మన మెరియంగ శక్తిఁగొని మానవుఁడీల్గుతమంచు వేయఁగ్ర
క్కున నది తుంటలై పడఁగఁగొట్టి విభీషణుఁడింక నీతనిం
గొనకొని చంపు మిప్పుడిదిఁగూడ దుపేక్షయటంచుఁ బల్కినన్.

ఉ॥ అంతట లక్ష్మణుండు మఘవాస్త్రముఁగైకొని చిత్తమందుఁ దా
నెంతయు రాముని దలఁచి "యిప్పనిలోకహితంబయేని, నా
యింతివిదేహరాజసుతయెన్నఁ బతివ్రతయేని, ధర్మ్యమి
ప్పంతముఁ దీర్పనీతులువ ప్రాణముఁదీయుమటంచు" వేసినన్.

ఉ॥ చయ్యనబోయి యస్త్రమది చప్పునఁ గంఠమునుత్తరింప, వాఁ
డయ్యెడఁగూలి ప్రాణములనార్చుచు వీడిన రాక్షసౌఘముఁన్
వ్రయ్యఁగజేయు వానరులువచ్చి ఘనంబునసంతసించి, మా
యయ్యకుఁ జెప్పువారమని యప్పుడపాఱిరి రాముచెంతకున్.202

చ॥ సురపతి వైరిచచ్చుటను జూచి ముదంబునఁ బూలవానలం
గురిసిరి దేవత, లతనదుకోర్కె ఫలించుట రాఘవుండు సా
దరముగఁగౌఁగలించి తనతమ్మునిఁ బెల్లునుతించెనంతటం
దరుచరులుల్లసంబడరఁ దాండవమాడిరి నిర్భయంబుగన్. 203

తే॥ వార్తఁదెలుపంగ రక్కసుల్వంక్తిముఖుఁడు
మొదలునఱికిన తరువట్లుపుడమిఁగూలి
"హా! కుమారక! నీశౌర్యమంతరించె

నయ్యో! యింకనాకుగతియెద్ది యనుచునేడ్చె. 204

ఉ॥ పాసితెయింద్రజిత్త! నను, భాగ్యము, శౌర్యముఁ, బ్రాణమొ
క్కటా
హాసుత! దేవతాగణములార్వఁగఁ బాఱఁగఁదోలుశౌర్య సం
భాసిత మూర్తికీర్తిఁ గని మాననమాతృనిచేతఁజానె, హా
భూసుత! యెంతసేసితివి పోయెనుసర్వము దిక్కుబాసితిం. 205

వ॥ అక్కటా! విధివిలాసం బెంతవిపరీతంబయ్యె. లోకంబులతలో నింత మార్పుచెందునని కలలోనైన నెఱుంగనైతిఁగా. కటా! తానొకటిఁదలంచిన దైవమొక్కటిఁదలఁచుననుట యిట్టిదకాఁబోలు. ముల్లోకంబులకజేయులును, మహాశూరులునగు నింద్రజిత్ప్రముఖులగు కుమారులుమడిసిరి. కుంభకర్ణాదిసోదరులు చంపఁబడిరి. విరూపాక్షుండాదిగాఁగల సేనాపతులు పొలియింపఁబడిరి. లంకాపురంబెందుఁగాంచినను గరుణాపరిపూరిత పౌరవధూజనపరిదేవనోత్తరంగమై యొప్పుచున్నయది. హా! హతవిధీ! యెంతపనిసేసితివి." అనివిచారించు, నంతలోనన శౌర్యరసాపూరతరంగితాంతరంగుడై "ఔరా! యెంతమాట. త్రిపురాంతక భయదాట్టహాస పరాక్రమాభిశోభితుండే రావణుండు. బందీకృతసుర సుందరీవిలాస విభూషిత విలాసుండే లంకాపతి. యొక్కండిట్లు సనేమి? ఈ నరవానరుల నొక్కత్రుటిలోఁ బరిమార్పక బెండువడియుందునే?. చూచెదఁగాక. మున్నీదురభిమానపూరిత సీతఁగొనితెచ్చినగాని చిత్తంబు నుత్తలంబడంగదు. ఏదిచంద్రహాసంబు" అని రౌద్రాకారుండై చంద్రహాసంబుంబూని కాలినడకన జానకి యున్నెడకుంజనుచుండ," వలదువలదు. మహాఘోరము. దుష్కరము.

స్త్రీవధ మహాపాతకంబు. శౌర్యశాలికపయశస్సంపాదకంబు. పుల స్త్యబ్రహ్మకు మనుమఁడవై, విశ్రవోబ్రహ్మకుఁ బుత్రుడవై వేదవేదాంగపారంగతుండవై, ధర్మశాస్త్రవిశారదుండవైననీకు నెలఁతను వధించుట నీతియగునే? నీతివిదూరునకుఁ గీడుపుట్టదే? శౌర్యసంపన్నుండు శత్రువునెదురించి పోరఁబరిమార్చి విజయలక్ష్మి వెలసినుండగుట యుక్తంబుగాదె?" అని దాపుననున్న పెద్దగడని వారింపఁ దత్క్షణంబయరదంబెక్కి శ్రీరామునెదుర్కొన సమరోన్ముఖుండయ్యె నంత. 206

## —: రామరావణుల యుద్ధము :—

సీ॥ మూలబలంబులు మునుకొనితలపడఁ
గడఁగిరాముఁడువాని గండడంప,
వాసరులిటునటు వైరిమూఁకలఁదాఁకఁ
బోరుఘోరంబుగాఁ, బుడమియదర,
నర్కజుచేఁబడి యతులవిరూపాక్షుఁ
డున్మత్తుఁడసురుల నుజ్జగింపఁ
గుమతిసుపార్శ్వుండు ఘోరంబుగాఁబోరి
యంగదుచేఁజచ్చి యవనిఁబడఁగ.

తే॥ నరసి సర్వంబు రావణుండతిరయమునఁ
దేరుఁదోలించుకొనివచ్చి దిక్తటంబు
లదరు నట్టుల భీకరుఁడగుచుఁజూపు
లగ్నికణములఁ జిందంగ నార్భటించి. 207

తే॥ వచ్చి రామునిఁగనలింప వదరి పదరి

వాఁడి కోలల నడరింప భండనమున
దండి మగఁటిమిఁ జూపంగ ధరణినాథ
సుతుఁడు శరముల నడరించె నతులగతుల. 208

శా॥ ఆగ్నేయంబును నానిలంబు మొదలౌనస్త్రంబులంబూని యు
ద్విగ్నుల్గాకను రామరావణులు హృద్వేగంబు పొంగారఁగా
నగ్నిజ్వాలలు చీఁకటుల్వాఱపి యత్యంతోగ్రరూపంబులం
భగ్నంబు ల్పొనరించుచున్ శరములంబాటించి పోరన్వెసన్. 209

ఉ॥ అత్తఱి లక్ష్మణుండడరి యన్నకు నష్టము సొచ్చి రావణో
న్మత్తతఁగూల్చు వాఁడితఁడనన్ శరమొక్కటివేసి, సారథిన్
మొత్తి, మఱొక్కముల్కున నభోమణిఁ దాఁకెడు కేతనంబును
దుత్తుమురై ధరంబడఁగఁ ద్రూల్చి నిశాచర రాజు నొంపఁగన్.

చ॥ పెనుగదనెత్తి వైవఁగ విభీషణుఁడప్పుడు వారువంబులుం
ఘనమగు తేరు భూస్థలిని ఖండితమైపడ రావణుండు చ
ప్పున విరథుండు కోపమున భూమిపయిం, డిగనుక్కుశక్తి నా
తని పయిఁబంప లక్ష్మణుఁడు దానిని తుంటలుసేసెఁ జయ్యనన్.

వ॥ అదిగని రావణుండు "మనుజాధమ! నీవొక పోటుబంటువే,
తుదిఁగనునేఁడు నీబ్రదుకు తుళ్లైదవేలకొ బాలిశా! యటం
చెదను స్మరించి శక్తిఁగొని యాతనిఁ జంపుమటంచు వైచిన
య్యదిజని వక్షముం జొరఁగనప్పుడ లక్ష్మణుఁడుర్విఁగూలెన్. 212

## —)♦♦♦ లక్ష్మణుని మూర్ఛ. ♦♦♦(—

తే॥ తరుచరుల్ సూచి మనములఁ దల్లడిల్లఁ
దనరి రాముఁడు చంపరాదనుచుఁ దలఁచు

చుండఁగా వైనతేయుండు చూచివేగ
వచ్చి దానిని బెకలించి వ్రచ్చిచనియె. 213

వ॥ అప్పుడు రామచంద్రుండు తమ్ముని దురవస్థంగాంచి శోకావిల చిత్తుండై పరిపరి విధంబుల వెతలు చుట్టు ముట్టమనంబును చిక్కఁబట్టె. 214

చ॥ సమయముగాదు కీడ్పడఁగ, సంగర ధర్మముగాదుక్రుంగ, దు
ర్దముఁడగు శత్రునిందునుము రాముఁడ, చూడుఁడ మర్త్య
మానవుల్
తమతమ కోర్కెమైనలర, దైత్యుల బాధలడంగ, సౌఖ్యముల్
తమి భజియింప, మీఁదిచటఁదమ్మునిఁ గావుఁడి మోసపోకుఁడీ!.

మ॥ అని రోషంబడరంగ నేఁడవని రాజ్యంబేల రాముండో, రా
వణుఁడో తేలెడుదాఁక వీడనని బల్వంతంబుఁ బాటించి, "నా
జననంబిద్ధరఁగావ, ధర్మముచిరస్థాయిత్వముం జెందఁగాఁ
జనునే న్వీడిన బాణముల్పగతునిన్ సాధించి నన్నోమెడున్. 216

మ॥ ఇల భారంబుఁదొలంచి సౌఖ్యములనెంతే వృద్ధిఁగావింప నా
తలపైనుండుట నిక్కమేని, ధరణిం దౌష్ట్యంబులన్మాన్పి, ని
శ్చల ధర్మస్థితి నిల్పుచే నృపునకున్ సద్ధర్మమై యొప్పునేఁ
బ్రళయాగ్ని జ్వాలనంబులం బఱుపుచున్ బాధింపుఁడీ రావణున్"

వ॥ అని ప్రళయకాలరుద్రుండు బలె విజృంభించి. 218

మ॥ పరగన్మర్మ విభేదకంబులగు బల్బాణంబులన్వీడ, నా
శరముల్ రావణు శౌర్యసారమగలన్ సంక్షోభముంగూర్పఁ, గా
తరతన్ సంగరముం దొలంగి గృహముం దాఁజేరి నిర్విణ్ణుఁడై

పరిచింతించుచు వేగభార్యఁబిలువంబంపించె దౌవారికుఁ. 219

—: లక్ష్మణునిగూర్చి రాముని విలాపము. :—

ఉ॥ ఇక్కడ రాఘవుండు తనయిక్కనుజేరి ప్రియానుజుండు పెం
పుక్కడొలంగి దిక్కఱిన పొల్పున నేలను వ్రాలియుండ, న
ల్దిక్కులుసూచి, "రక్షకులులేరె? ప్రియానుజ! నన్ను నాపదం
జిక్కఁగఁజేసి పోయితివె, చెప్పుము నాయపరాధమేమిటో. 220

ఉ॥ ఇంటనె యుండుమంచనునయించితి, నాఁడొకపట్టువట్టి నా
వెంట నరణ్యవాసమున వేఁగితి రాత్రిపవళ్లు నిద్రలే
కుంటఁగృశించి, నిన్నిచటఁగోల్పడి యెవ్విధి రాజధానికే
నొంటిగనేఁగి యేమనుచు నొప్పఁగఁ బల్కుదుఁ దల్లిచెంగటన్.

తే॥ ధరణిఁ బ్రతిదేశమునఁ గళత్రంబుగలదు
రవణనుప్పొంగు పెక్కు బాంధవులుగలరు
గాని యట్టిది దేశంబుగలదె జగతి
నెందునినుఁబోలు తమ్మునిఁ గందుఁబ్రియుని. 222

వ॥ అని యనేక ప్రకారంబులఁ దమ్మునిందలంచి విలపించుచున్న రా
మునోదార్చి సుషేణుండు ,,రామచంద్ర! నీతమ్ముండసువులఁ
బాసిన లక్షణంబులు గానరావు, చూడుము, ముఖము వికసిత
కమల ప్రభాతరంగితమై యొప్పుచున్నయది, హృదయంబుస్పం
దించుచున్నయది. చింతింపకు'' మని హనుమంతుంజూచి, ,,ప్ర
భంజనాత్మజ! మున్ను జాంబవంతుండు నీకెఱింగించిన విధంబున
ద్రోణాద్రికరిగి, సావర్ణ్యకరణి, సంజీవకరణి, సంధానకరణి, విశల్య
కరణి, యనంబరగు నౌషధరాజంబుల సూర్యుఁడుదయింపక ము

న్న తెచ్చి లక్ష్మణుఁబునర్జీవితుఁ గావింపుము. నీకార్యంబున కనేక వి ఘ్నంబులుదోఁచరు. 'శ్రేయాంసి బహువిఘ్నాని' యందురుగదా. జాగరూకుండవై కడచి కార్యంబు సాధింపుము" అని వంచిన న తండు నాశీర్వాద పురస్సరంబుగా రామునాజ్ఞంగొని యరుగుచు మధ్యేమార్గంబున మారీచసుతుండగు కాలనేమి రావణ చోది తుండై యాంజనేయునకు విఘ్నంబాచరింప మాయాతపస్వియై యొక్క యాశ్రమంబుననుండి నమ్మించి, వంచన నాతనికి జలం బులంగ్రోల నొక్క కొలనింజూపిన నాతఁడందు నీరుఁగ్రోలుచు మకరిచేతంజిక్కి యుపాయంబున దాని మడియించి, శాపవిము క్తయైన యాధాన్యమాలిని చేత విదిత సకల వృత్తాంతుండై కా లనేమింజంపి, వేగద్రోణాద్రికరిగి యందుఁగాఁపున్న గంధర్వు ల డ్డుపడ వారింజయించి, యౌషధంబులతోడద్రోణగిరింగొని వ చ్చుచుండ, రావణుపంపున మాల్యవంతుండును, రాక్షస బలం బు లడ్డగింప వారినిర్జించి, యరుగుదెంచుచుండ, నగ్గిరి ప్రభావిశే షంబుంగాంచి సూర్యోదయంబగుచుండెనని శంకించి, కడుం గడుఁ గ్రుద్ధుండై విజృంభించుచున్న శ్రీరామునకు సుగ్రీవాదులు సమాధానంబులు సెప్పుచుండ, నంతలోనన హనుమంతుండరు దెరంగాంచి' సుషేణుండు పర్వతంబెక్కి యౌషధంబుల సంగ్ర హించి ప్రయోగింప లక్ష్మణుండు సుఖనిద్రంజెంది మేల్కనిన వాని తెఱంగున లేచి నిలుచుండె, నంత రామభద్రుండు తమ్మునిం గాఁగలించుకొని యానందాబ్ధి నోలలాడుచు, హనుమంతు నగ్గిం చి, సుషేణుంబొగడి నెమ్మదినుండె' వానరవీరులును బరమ హ ర్షంబున రామ లక్ష్మణ సుగ్రీవానుమతులై పర్వతంబారోహించి

నానావిధ ఫలరసాస్వాద సంజాత బలాతిరేకులై యపగత శల్య క్షత వేదనులై యుండ, రామచంద్రు నియోగంబున నంజనీ తన యుండు ద్రోణగిరిని యథాస్థానంబునఁ జేర్చివచ్చుట కరుగుచు న్న యవసరంబున. 223

తే॥ స్థూల జంఘాది రాక్షసుల్దోర్బలంబు
లడర మారుతి త్రోవను నడ్డగింప
వాలమునుబెంచి యందఱ్రవచ్చినేగ
ద్రోణగిరిఁజేర్చి వచ్చెను దొలిపదంబు. 224

తే॥ అటనయోధ్యను భరతుఁడత్యంత దుఃఖ
జనక దుఃస్వప్నమునఁ దూలివనటఁబొంది
సీతతోఁగూడ రాఘవుల్ శ్రేయమంద
శాంతికర్మలఁజేయించి భ్రాంతిబాసె. 225

చ॥ జరిగిన వృత్తమెల్ల వరుసందన తమ్మున కెన్గఁజెప్పి, ని
ర్జర పటుదీప్తి మెఱెుఅసి రాముఁడు "నేఁడు నిశాచరేంద్రు భా
స్కరుఁడదెగ్రుంకు లోపలనె చంపుదు" నంచుఁబ్రతిజ్ఞచేసి, ని
ర్భరతరశౌర్యసార పరవశ్యుఁడుగాఁగ వెలింగె నత్తఱిన్. 226

—♦♦♦ రావణుని విచారము. ♦♦♦—

ఉ॥ ఇంటను గూరుచుండి తనయింతినిఁ జీరఁగఁబంపి రావణుం
డొంటరి వాఁడనై తినని యూర్పులు పుచ్చుచు "రాఘవుండు బల్
దంట యనంగఁదోఁచెడిని, ధైర్యము చాలకపోవుచుండె, నే
మంటకు నోరురాదిపుడహావిధి చెయ్యము నిశ్చయింపఁగదే?. 227

చ॥ నరుఁడని మోసపోతి దిననాథుని వంశమునందుఁ బుట్టు శ్రీ
హారియగు నిక్కమీతఁడదియట్టులె, చిత్రము, ముజ్జగంబులన్
సురగరుడోరగ ప్రముఖ శూరులకెన్నఁగ దుర్గముండనై
వరలెడునన్ను మానవులు బాణపరంపర నొంపశక్తులే?   228

ఉ॥ చెప్పె విభీషణుండు మనసిచ్చి నయంబు భయంబుఁజూపి, నే
నొప్పరికించి యాతనిని నోర్వఁగఁజాలక హీనబుద్ధినై
ముప్పును మూటగట్టుకొని మునితిఁ గోపదవానలంబునన్
దెప్పరమైన పాపము వధింపక వీడునె యెంతవారినేన్.   229

మ॥ పటుకోదండముఁబూని దివ్య శరముల్పాటించి నాఁటంగ, నం
దెటుచూడం దనుదానయై మెఱయు నాధీరుండు రాముండు నా
కుటిలోద్వృత్తి నడంపకున్నె యకటా! క్రూరుండు దుర్మార్గుఁడే
న్నఁటికేనిన్ సుఖమందునే జగతిపై న్యాయంబె శ్రేయంబగున్

శా॥ చింతిల్లంగలదే ప్రయోజనమిఁకన్ శ్రీకంఠు సేవించి, నా
వంతం బాపుకొనంగఁ జూచెదను, నాభర్గుండమేయుండు, నా
పంతంబుం దుదిముట్టఁజేయు నతనింభావించి సేవింప, న
త్యంత ప్రేమభరంబునం దలఁచు నాకాయుష్యమున్ శ్రేయ
మున్.   231

ఉ॥ మున్నొకనాఁడు నేను దనముందఱఁ గోకిల సుస్వరంబునం
దిన్నఁగఁ బంచమస్వరముఁ దీరిచి రాగము నాలపింప, నన్
సన్నుతిసేసి శంకరుఁడు సత్కృతితో నొక్కటి సెప్పియుండె దా
నిన్నరు పద్రవంబుగను నేనెఱవేర్ప జయంబు నిక్కమౌ''.   232

సీ॥ అని నిశ్చయించి చయ్యన స్నాన మొనరించి

రంజిత వసన ముల్దాల్చి, దేవ
గృహములోపలంజొచ్చి గిరిజాపతింగూర్చి
ధ్యాన సమాధి విధానుండగుచు
నర్చ నల్పచరించి యర్ఘ్యమాత్రక్రియం
గ్రతు విధానముందీర్పం గడంగుచుండ
నంత మండోదరీకాంత చప్పునవచ్చి
వేష భాషలు మార్చుప్రియునిం గాంచి.

తే॥ "యకట! భువనైక వీరున కర్హమగునె
యిట్టి మునివృత్తి, సంగర వృత్తి వీడి
యిల్లుసేరిన శత్రువుల్వెల్లునగరె
నీదు చిత్తంబునను భీతి పొడుకొనెనె. 233

ఉ॥ దూరపుం జూపులేక ఖరదూషణ రాక్షస సంహరణక్రియా
ఘోర పరాక్రమోల్ల సదకుంఠిత తేజుని రామభద్రు నీ
వారయలేక భూమిసుత నంధుండవై కొనివచ్చి యిప్పుడి
ల్దూఱంగం జెల్లునే యకట! దూఱరె లోకులు పందవంచునిన్.

ఉ॥ సంగర రంగమందు సురసంఘము నిన్నెదురింప, నేన్గుపై
సింగము దూఁకునట్లడరిచెండఁగ దిక్కుఱి, యుక్కుదూలి, పా
ఱంగను జేయుశౌర్యమది, ప్రౌఢతశంకర శైలమెత్తి వే
యం, గమకించు నీపటిమ యంతయు నింతన మాయమయ్యెనే?

ఉ॥ పొమ్మసురద్దలంక రణభూమినరాతిని గెల్చి కీర్తిం గై
కొమ్మ, నిజప్రతాపమునకుంబలి యీయకడాంగి యున్ననిన్
న్నెమ్మెయి రాజ్యలక్ష్మివరియించు, జయాపజయమ్ములెల్లదై

పమ్మెఱుఁగంగఁబోలుఁబగ వారిని వీడుట శూరధర్మమే?.

మ॥ అని మండోదరి వీరపత్నికను వౌనట్లాడి రోషంబు పో
సిన నా రావణుఁడట్టులేచి, గురువుల్ సేవించి శుక్రుం, దదా
జ్ఞను బాతాళ గృహంబుఁజేరి యచటం దంత్రజ్ఞుఁడై శత్రుమా
రణ హోమంబును జేయఁబూనె నతులప్రాజ్యాహుతి ప్రౌఢిమన్.

♦♦♦ రావణుని పాతాళ హోమమును భంగపఱుచుట. ♦♦♦

ఉ॥ మాతలితోడ నింద్రుఁడసమాన హయోజ్జ్వలమౌ రథంబున
త్యాతతమస్త్రజాలము ముదంబునఁ బంపఁగ రామచంద్రుఁడు
ద్భూత పరాక్రమోద్ధురతఁ బొల్చెను నందు, జగత్తమోపహుం
డై తెలివొందు సూర్యుఁడుదయాచలమందునఁ బొల్చు
నట్లుగన్. 238

ఉ॥ ఆకసమంటు పెన్ బొగలనారసి, యంత విభీషణుండు బల్
దూఁకునవచ్చి రాఘవునితోఁ బలికెం "గనుమయ్య! రామ! య
స్తోకపుటాహుతుల్వ్యాఅపి ధూర్తుఁడు రాక్షసచక్రవర్తి, ని
ర్భీకత భూగృహంబునను వేల్చుచునుండె జయంబుఁగోరుచున్.

శా॥ నిర్విఘ్నంబుగ సాగునేని నది వానింగెల్చు వాఁడున్నె, దో
ర్గర్వం బెక్కుడు హెచ్చుఁగాక రఘువీరా! సేమమేయుర్వికిం
దుర్వారోద్ధత రాక్షస ప్రకరముం ద్రుంగించి హోమక్రియన్
సర్వంబుం బడఁద్రోయ వేగఁగపులన్ సన్నద్ధులం బంపుమా!.

చ॥ అనుటయు రామచంద్రుఁడపు డంగదుఁగన్గొని హెచ్చరింప, న
వ్వనచరయూథముల్గదలివచ్చెను లంకకుఁగాని, రావణుం
గనుఁగొను త్రోవలేక వెదుకంగ, విభీషణుపత్ని సైగసే

సిన వడిద్వార దేశమునుజేరి పగుల్చిరిమూఁత బిగడలన్. 241

ఉ॥ అంగదుఁడేఁగి లోపలికి నచ్చట రావణుఁగాంచి, యాలవే
యంగనెదూఱె వానరభయంకర యోధచయంబు. హోమముం
భంగమొనర్పఁ బెల్లడరి, పంక్తిముఖుండును ఱిచ్చవోయి చూ
డంగఁ, బదార్థముల్గొని కడంగెను జేయఁగ ఛిన్నభిన్నముల్.

ఉ॥ అంతట నంగదుండు వడి నంతిపురంబున కేఁగి రాక్షసా
క్రాంతను రావణాసురుని కాంతను గొప్పునఁబట్టి లాఁగుచు
న్మంతనముల్మ్మగించెదను మానిని రమ్మని, రావణుండు బల్
వింతఁ గొనంగఁ బల్కెనిటు "వీరుఁడ! చూడుము పట్టించు
నుగ్రుఁడై. 243

ఉ॥ నీచుఁడవౌచు రామధరణీశుని పత్నినిఁగోరుచు రాఁగమా
రీచునిపొందుఁగోరి, యెదురింపఁగఁ జాలక మోసపుచ్చితే
గోచులవాఁడవౌచు, నిదిగో, యిటుచూడుము రాముఁడిటుల నేఁ
జూచెద నీప్రతాపమిఁకఁజూపుము రావణ! శౌర్యభూషణా! 244

చ॥ అనుటయుఁ బాలిఁజూచి తనయంగన యార్పఁగఁ గ్రోధదీప్తుఁడై
గొనకొని యగ్నియందిడఁగఁ గొన్నహవిస్సును బాలిఁద్రోచి చ
ప్పునఁ గరవాలముంబలిప మూర్ఛితుఁడై పడె నంగదుండు. న
ద్దనుజ పురంధ్రియేఁగె నిజధామము గొబ్బున సిగ్గుపెంపునన్.

ఉ॥ అంగదు మూర్ఛితుంగనుచు నయ్యనిలాత్మజుఁడట్టకేఁగి యు
ప్పొంగుచు మూర్ధముల్పగుల ముష్టిహతింబడమోఁదె. నొప్పుట
బుఱింగ శరీరమంతయును రోషదవానల దహ్యమానుఁడై
పొంగి నిశాచరాధిపుఁడు మోదెను ఖడ్గముచేత మారుతిన్.

తే॥ అంతలో నంగదుఁడు లేచి యదరివేయ
రక్కసులు పెక్కు చెలరేఁగి కక్కసింప
ముక్కముక్కలుగాఁజేసి చక్కడంచి
యలరి రాముని చెంతకు నరిగిరపుడు. 247

తే॥ విదిత వృత్తాంతుఁడై రామ విభుఁడు కపుల
సాహసమునకు నాశ్చర్య చకితుఁడగుచు
బరమసంతుష్ట చిత్తుఁడై పలికెనిట్లు
"కార్యశేషంబునకు నింకఁగడఁగుఁ డ"నుచు. 248

మ॥ క్రతుభంగంబున శీర్షముల్ తెగినట్లై రావణుండేఁగె దు
ర్మతి మండోదరి నెమ్మనమ్ము కలఁకన్మాన్పన్మది న్నిల్పి, యా
సతి దుష్టోరగమట్లు బుస్సుననవజ్ఞాశీర్ణ చిత్తాబ్జయై
పతి మోముం దిలకించి పల్కె నిటులం బ్రస్ఫీతకోపోద్ధతిన్. 249

చ॥ "ఎఱుఁగఁగలేక రామునతి నీనునఁ దెచ్చితి వింతపుట్టె, నీ
గఱువతనంబు లెక్కఁగొనకయ్యగచారి పరాభవించినం
దెరలఁగఁ జూచుచుంటి పటుధీరుఁడవౌట ఫలించె నేఁడుగా,
పరువము నిల్చునే పరుల భామలనంటినమంద బుద్ధికిన్. 250

ఉ॥ శ్రీరఘురాము గెల్చునని చిత్తమునందుఁ దలంతుగాని, నీ
నేరమిఁగాంచలేవకట! నిర్జర సేవ్యుఁడు, ధార్మికుండు, భూ
భారమడంచి ధర్మగతిఁ బాలన సేయఁదలిర్చు శ్రీశునా
శూరునిగెల్వ నీకగునె, చూచెదె రామునిఁ జుల్కచూపునన్.

ఉ॥ మానుముకయ్య మింక నభిమానము వీడుము, నేమమందునా
మానిని జానకీరమణి మాన్యరఘూద్వహుఁ జేర్చి వేఁడుమ

యూ్యాన తరక్షకుండు నిను నాదర మొప్పఁగఁగాచు, లేనిచో
సానుజుఁడై రఘూద్వహుఁడు చంపక వీడఁడు నిన్ను నాజిలోన్

చ॥ అనుటయు నెంతమాట సతి! యాఁడెదు రాముఁడె చంపువాఁడు, న
న్ననదగ నెంచితే యబల! యా రఘురాము నెఱుంగకుందునే?
గానకొని యింత సేసి తుదకుం బగవానికి లొంగఁ బాడియే,
పనవిన లాభమేమి విధిపంచిన యట్టులె గాక తప్పునే?. 253

చ॥ దురమున రామునిందవిలి త్రుంచుటొ, త్రుంగుటొ మేలుగాని, సం
గరమున నెల్లవారలు విఘాతమునందిన మీఁద నొక్కఁడం
బరగ సుఖింపఁగోరుటది భావ్యమె, భామిని! శూరధర్మమే,
యరిగెద నిప్పుడే యనికి నా రఘురాముని తేజుఁగాంచెదన్. 254

ఉ॥ శత్రునొ లేకొ నేన్మరల వారిజలోచన! భద్రముంచుఁ, బో
కొత్తఁగ రాక్షసౌఘముల నేడ్తెఱ రేఁపుచు, యుద్ధమున్ సుభుల్
మొత్తము లొత్తుచు మింటిపయి మ్రోఁగఁగ రావణుఁడేఁగెఁ జిత్రమం
దత్తిన వేడ్కఁ దాను జతురంగ బలంబులతోడ నాజికిన్. 255

మ॥ గిరులన్ వృక్షములన్ మహాశిలల నాశీశాగ్ని, రక్షఃపరం
పరలం దున్మఁగ, రామ రావణులకుం బాటిల్లె నాయోధనం
బరుదై మింటను దేవతానికర మాహా యంచు ఘోషింప, న
య్యిరువుర్ దివ్యశర ప్రయోగముల యందిద్ధ ప్రభావోన్నతుల్.

మ॥ స్ఫురద భ్రంకష దీప్తులన్ వెలుఁగుచున్ సూర్యప్రతాపోద్ధతా
త్మలయం దివ్యశరంబులన్ విడుచుచు న్రేకంబు గేకెత్త, ది
క్కరులుం బెన్గిరులట్లు పోరు నలుపంగా ఘోరమై మ్రోఁచె, ని

ద్ధరణిఁ బోటియె రామ రావణుల యుద్ధం బెందు నెవ్వారికిన్.

ఉ॥ ఒక్కటఁబెక్కు కోలలను నుద్ధతిఁ గుప్పలుకుప్పలై పడం
జిక్కఁగ నాఁటుకొంద్రు వడిఁజీల్తురు నడ్మనె తుంటలై పడన్
వెక్కసమై కనంబడఁగ వేయుచు నొప్పిరి రామ రావణుల్
తక్కక నారదుండు మదిరంజిలి నింగిని నాట్యమాడఁగన్. 258

ఆ॥ వె॥ వడిగ దైవతాస్త్రమడరింప నయ్యది
మింటమంటలెగచు చుంటఁగాంచి
ప్రతిశరంబునేసి ప్రభలడఁగించుచు
రామభద్రుఁడడరె భూమియదర. 259

వ॥ ఇవ్విధంబున రామ రావణులు భూనభోంతరంబు లదర, దేవదానవులు బెదర, విస్ఫులింగంబులుచెదర, నిముస నిముసంబునకు శౌర్యోద్రేకంబులు గదుర, నొండొరులు గాంధర్వంబును, రాక్షసంబును, వైష్ణవంబును, నాగంబును, గరుడంబును, నాగ్నేయంబును, వారుణంబును, వాయవ్యంబును, వారణాపత్యంబును, నారసింహంబును, నున్నగు నస్త్రంబులఁ బ్రయోగించు కొనుచు, నొకరి కొకరు తీసిపోక మహాదారుణంబుగఁ బ్రవిదారణంబు సలుపుచున్న యవసరంబున రామచంద్రుఁడు తనమనంబున నిట్లని వితర్కించె. 260

ఉ॥ "ఏడు దినంబులిప్పగిది నేకవిజృంభణఁ బోరిపోరి, మేన్
గాఁడఁగ నేసియేసి, విసుగందితిఁగాని నిశాచరేంద్రుఁ డే
కీడుమదిందలంపఁ డనికిన్విసుఁగందడి దేమిచోద్యమో
చూడజయంబు చేకొనఁగఁ జొప్పడు తీరది యెట్టిదోగదే." 261

వ॥ అనివితర్కించుచుండ భగవానుండగు నయ్యగస్త్యమునీంద్రుండు శ్రీరామచంద్రు సన్నిధికేతెంచి "అయ్యా! రామభద్ర! వేద వేదాంత వేద్యుండవు. యోగిమానసగోచరుండవు. జగదుద్భవ స్థితి లయకరుండవు. విశ్వమయుండవు. విశ్వాత్మకుండవు. విశ్వ విభుఁడవు. విష్ణుమూర్తివి. విశ్వంభరాభార నివారకుండవై న రుండవైతి వింతయకాని నీవెఱుంగని యర్థంబుగలదే. మానవ రూపంబున నెఱుంగమినటించుట నీకు లీలయై యున్నయది. నీకిది యదియని యుపదేశింప నేనెంతవాఁడ. అయినను వినుము పరమభక్తి నాదిత్యహృదయంబను స్తోత్రరత్నంబును బఠియించి మాకులమూల పురుషుండగు నాదిత్యునారాధింపుము. నీకు వి జయంబు తథ్యంబు"ని నివేదించి యరిగిన నారామచంద్రుండా దిత్య హృదయంబును బఠియించి యాజగత్సాక్షి నారాధించి యపరిమితతేజో విరాజమానుండై విజృంభించి పంచభూతంబులు "దుష్టుండగు రావణుం బరిమార్చి పుడమికి శుభంబుఁ జేకూర్చు మింక నాలస్యంబు వలద"ని ప్రోత్సహింప, విజయ సూచకంబు లగు శుభ శకునంబులు వీర విహారంబునకుఁ గురికొల్ప, ననేకా పశకున దోదూయ మాన మానసుఁడగు రావణుం గనుంగొని నిరుత్సాహ జనకంబులగు వాక్యంబులఁ బరిభవించుచు. 262

చ॥ వడి వడి నర్ధచంద్రముఖ బాణములందల లుత్తరింప, న
ప్పుడ యవి భూరితేజమునఁ బొల్చుచు, మొల్చుచు నుంటఁ
జూచి, రా
ముఁడు విజయాశ చేడ్పడఁగ ముగ్ధుఁడుపోలె విచారగ్రస్తుఁడై
తడఁబడ రావణాసురుని తమ్ముఁడు గన్గొని పల్కెనిట్లులన్. 263

ఉ॥ "రాఘవ! చింతయేల చతురానను మెప్పున రావణుండుమున్
శ్లాఘకుఁ బాత్రుఁడౌచుఁ దననాభిని నయ్యమృతంబుఁ గొంటచే
మోఘములౌచునుండె శరముల్, విడుమగ్ని శరంబునార్పఁగన్
నీఘనతేజమున్నె అవు నీల్గును నాతఁడు నిశ్చయంబుగన్". 264

మ॥ అనుచుం దెల్పిన నగ్నిబాణమున నాయాసంబునన్ వేసి, నా
భినిరూఢంబౌ నమృతంబుఁ బాపి, యవలన్ భీమప్రకోపంబునన్
దనరం దొంటి తెఱంగునన్ శరములం దర్పంబునన్ వేసి, గొ
బ్బున శీర్షంబులఁ జేతులం దునుమఁగా బ్రోగించె జ్యానాదమున్

తే॥ నూట తొమ్మిదిమాఱులు సూటిగొనుచు
వేగ మడరంగ నస్త్రముల్ విడిచి విడిచి
తలలు చేతులు ఖండించె ధరనుబడఁగ
గాని యొక్కటి మిగిలినఁ గడఁగి యతఁడు. 266

శా॥ ఓరీ! నీచుఁడ! యెంతసేసితివి, నీవోరోరి శూరుండవే,
రారా, చూచెదనంచుఁ బెల్లడర నారాముండు బ్రహ్మాస్త్రమున్
ఘోరంబై తనరంగవీడి శిరముం గూల్చెంధరన్ వ్రాలఁగా
దారిద్ర్యాన్విత భారతావనికి బాధంగూల్చు వాఁడై వెసన్.

ఉ॥ నింగిని దేవదుందుభులు నిర్జరకోటులు నాట్యమాడఁగాఁ
బొంగెను, సిద్ధచారణులు బ్రుంగిర మేయపు హర్షవారిధిన్
మంగళవాద్యముల్ మ్రొఱసె, మానులుపొంగిరి, పుష్పవర్షముల్
మంగళధామమై విజయమంగళ శోభితుఁ గప్పె రామునిన్. 268

ఉ॥ భారతభూమి రంజిలెను పావనమూర్తి రఘూద్వహుండు బల్
ధీరుఁడు దుష్టరాక్షసులఁ దీర్చెను శిష్టజనాళిఁ బ్రోవఁగన్

గోరిక మీఱంగా సుజనకోటులు సౌఖ్యము లుల్లసిల్లనే
పారఁగ ధర్మతత్పరత నందితు లౌదురటంచు నెమ్మదిన్. 269

వ॥ అప్పుడు మహాభూధరంబుంబోలె రామబాణహతుండై నేలంగూలియున్న రావణుంగాంచి విభీషణుండు దుఃఖపరవశుండై యనేక విధంబుల విలపించుచు నిట్లనియె. 270

శా॥ అన్నా! రావణ! సోదరా! యరిగితే, హా! శూరలోకాగ్రణీ!
విన్నాణంబును, బ్రజ్ఞయుంగలిగియున్వీతెండివై జానకిం
గొన్నం గూడదటంచుఁ దెల్పఁగ ననుంగోపించి దుష్టుండవై
కన్నుంగానక రాముఁడాఁకి చెడితే, కామంబు నిన్ గూల్చెనే?.

తే॥ బంధువర్గంబు నన్ననుఁబాసి పరునిఁ
జేరి యన్ననుఁ జంపించెఁ గోరియనెడు
నపయశంబును మిగిలెనే యకట! నాకు
నన్న! దీనుండనైతి మేలున్నె జగతి. 272

వ॥ అని విలపించుచుండ విదితవృత్తాంతయై మండోదరి యంతఃపుర కాంతాజన పరివృతయై యరుగుదెంచి పోలికలని నడుమంబడి యున్న మగనింగాంచి సొమ్మసిల్లుచు, బహుప్రకారంబుల విలపించుచు, “హానాథ! ఇంక నాకు దిక్కెవ్వరు? దనువంశనాయకుండగు మయునకుఁ బ్రియపుత్రికనై, ముజ్జగంబులను జయించి శాసింపఁగల రాక్షసచక్రవర్తికిఁ బ్రియపత్నినై, సురపతింజయించిన మేఘనాదునకు వీరమాతనై, విఱ్ఱవీఁగుచున్న నాకు నింతలోన నెంతటి విధివైపరీత్యంబు సంభవించె, హా! దైవమా! నీ సంకల్పంబుల నెఱుంగఁజాలినవారు ముల్లోకంబుల లేరుగదా!”

అని పనవిపనవి యేడ్చుచుండె నయ్యవసరంబున. 273

చ॥ పరమదయాకరుండయిన భానుకులాగ్రణి రాఘవుండు స
త్వరముగ నగ్నిసంస్క్రియలు భ్రాతకు సల్పుమటన్న వైదికో
త్తర క్రతుసంవిధాన పరతం బితృయజ్ఞము పూర్తిసేసి, య
త్తరణి కులాగ్రగణ్యుసవిధంబునఁజేరె విభీషణుండుతాన్. 274

ఉ॥ వారిధితోయముల్గొనఁగ వానరవీరులఁ బ్రోత్సహించి, యా
శ్రీరఘురామమూర్తి తనచిత్త మెలర్పఁగఁ జేతులార స
ద్వీర! విభీషణా! యనుచు విజ్ఞులు మెచ్చఁగ సింహపీఠికం
జేరిచి పట్టభద్రునిఁగఁ జేయనొనర్చె శుభాభిషేకమున్. 275

ఉ॥ పంకజసూతి యన్వయము భాసిల ధర్మము నుద్ధరించి ని
శ్శంకత ధారుణీస్థలికి సంకటముల్గొనఁగంగనీక, యే
యంకిలికిక్కగాక ముదమారఁదలిర్పు మనంత కాలమున్
లంకకు రాజువై ప్రజలు రంజిల నేలుమటంచుఁ బల్కుచున్.

ఆ॥ వె॥ హనుమయేఁగి సీత హర్షమందఁగ రాము
విజయవార్తఁదెలిపి వేడ్కఁబలికె
"నమ్మ! యెల్లవారలరయంగ నెమ్మది
నున్నవార చింతనుడుగు" మనుచు. 277

వ॥ అట్టి యవసరంబున. 278

చ॥ పరగ విభీషణుండతులవైభవ మొప్పఁగ జానకీ సతీ
చరణ సరోరుహంబులకుఁ జాగిలి రామునిఁ జేరిపల్కె "నో
పరమకృపాపరా! కొనుము పావని భూసుతసాధ్వి భక్తిత
త్వరమతి" నన్నదాశరథిబాష్పవిలోల విశాలనేత్రుఁడై. 279

—◆◆◆ సీతను బరీక్షించి రాముఁడు పరిగ్రహించుట. ◆◆◆—

ఉ॥ "పంతముతీఱె నింక బలవంతుఁడు దుష్టుఁడు శత్రువీల్గె, నా
వంతతొలంగెఁగాని, పెఱవారలు ముట్టిన పత్నిఁ జేకొనన్
సంతసమానెనాకు, బుధసంతతి మెచ్చునె, లోకనింద్య యీ
యింతి విభీషణా! ప్రజకు నెవ్విధినోళులు మూయసాధ్యమా.

ఉ॥ ధర్మనిరూపక ప్రకట తంత్రపరత్వముచేత రాజు స
త్కర్మ పటిష్ఠచిత్తుఁడయి ధారుణినేలఁగఁ జెల్లుఁగాని, దు
ష్కర్మమునందుఁ బొల్గొనినఁ జావదె ధర్మము, ధారుణీప్రజల్
దుర్మతులౌచు నిచ్చమెయి లోకపుఁబోకడఁ బాడొనర్పరే"!.

చ॥ అనఁగ విదేహరాజసుత "హా! విధి మెచ్చితె యింతసేసి, యి
జ్జన పతి సూనుచిత్తమున జానకి దుష్టచరిత్రయయ్యె, నే
మనుకొని లాభమేమి? విధియట్టిది, దైవమెసాక్షి, నాదుపా
వనచరితంబుఁ జాటుటకుఁ బావకుఁడొక్కఁడ దిక్కు నాకగున్.

మ॥ అని గుండంబురగుల్చి పావకు మదింధ్యానించి, యాదిత్యుల
న్వినయంబొప్పనుతించి "నేను ధరలోనిర్దుష్ట చారిత్రనౌ
దున యేనిన్, రఘురాముఁదప్ప నొరులందోఁబుట్టు భావంబునం
గని వర్తింతున యేనిఁబావక! ననుంగాపాడుమా మ్రొక్కెదన్".

వ॥ అని యగ్నిప్రవేశంబు సేసిన జానకి యించుక యేనింగాలక, కం
దక, మెఱుఁగు వెట్టిన బంగారు ప్రతిమయుంబోలె మెఱయుచుండ
బావకుండు ప్రత్యక్షంబై "శ్రీరామచంద్ర! సీత నిష్కళంక, యు
వి గీతచరిత్ర, పరిగ్రహింపు" మని యంతర్హితుండుగా, నత్తరి
క్షంబున నింద్రాది దిక్పాలకులును, నంభోజ సంభవుండును,

త్రిపురాంతకుండును, నాకలోకగతుండై సురసమూహంబుతోం బుష్పకంబున నరుదెంచిన దశరథుండును, "రామభద్ర! హుతాశనువచనంబు సత్యంబు, శంకింపకు"మని నానా విధంబుల నుతియింప సంతుష్టాంతరంగుండై సర్వజన సమక్షంబున సీతం బరిగ్రహించి పుష్పక విమానంబున నయోధ్యకుం బయనంబు సాగింప నిశ్చయించె, మృతవానరులెల్లరు నింద్రునివరంబునం బునర్జీవితులై రి, రామానుజ్ఞాతులై యంగద సుగ్రీవాంజనేయాది వానరులును, జాంబవత్సుషేణ గంధమాదనాది భల్లూక నాథులును, విభీషణాది దానవులును, శ్రీరామ పట్టాభిషేక మహోత్సవంబుం దిలకింప నయోధ్యకుందరలిరి. శ్రీరామచంద్రుండు విమానంబుననుండి జానకీదేవికయ్యె ప్రదేశంబులంగల విశేషంబులం దెలుపుచుం బ్రయాణంబు సాగించుచు భరద్వాజాశ్రమంబుం బ్రవేశించె.

తే॥ తేజమున మించు శ్రీభరద్వాజమునికి
నెరగి వివరించి యడవుల వృత్తమెల్ల
దీవనలు పొందియరుగుచుం బావమాని
భరతుకడ కంపెం దనరాకం బరగం దెలుప. 285

తే॥ హనుమగంగా తటంబున కరిగి యందు
శృంగి బేరంబునందు వసించు గుహుని
కెఱుంగం జెప్పుచు వృత్తంబు నరసి త్రోవ
నంది గ్రామంబుం జేరెసానందుం డగుచు. 286

చ॥ సరసనుమంత్రి పుంగవులు జానుగం గార్యములొప్పం జెప్ప, సంబరమున వించు, రాఘవుని పావల పూజ యొనర్చునట్టి యా

భరతు, జటోర్ధ్వపుండ్ర పరిభాసితు, వల్కలధారి, సంజసీ
వరతనయుండు గాంచెను శుభంకర మూర్తిని శంకరుంబలెన్

మ॥ పదునాల్గేండ్లునుదాటె, రాఘవుండు నాపై భారమున్మోపి, తా
నుదిగుల్చేందక యుండె, రాదడసి నన్నుంజూడ లేడంచుఁదా
మదిఁజింతించుచు నుండఁగాఁగలయటుల్మానుష్యరూపంబునన్
గదిసెన్మారుతి, ముందునిల్చె భరతుంగ్రమోడ్చి పేక్షించుచున్.

ఉ॥ "ఎవ్వఁడవయ్య! యయ్యోడకు నేమికతంబున వచ్చితీవు, ని
న్నెవ్వఁడు వంపెఁదెల్పుమ"న నేరఘురాముని బంట భక్తిమై
నివ్వ సుధాస్థలిం బిలువ నెంతయు నొప్పదు నాంజనేయుఁడం
చవ్వసుధావరాత్మజుఁడయంపఁగ వచ్చితి నిన్నుఁ గొల్వగన్. 289

చ॥ అనుటయుఁ గౌఁగిలించుకొని యార్యుఁడు రాముఁడు పంపె నయ్య! యే
వనముననున్నవాఁడో తెలుపందగు నేనట కేఁగువాఁడ, న
మ్మిన ననుఁబాసిపోయె నెలమిందగ వేగమ వత్తునంచు, నె
మ్మనము తపించుచుండె హనుమా! వివరింపుము రామువృత్త
మున్. 290

సీ॥ అని వేఁడఁగా వాయుతనయుండు వివరించె
"దండకాటవిఁ జేరియుండు నపుడు,
చుప్పనాతికి భంగమొప్పఁగఁ జేయుట
ఖరదూషణాది రాక్షస వధంబు,
మారీచుమాయ, దుర్మార్గుఁడౌ రావణ
వంచనంబును, రామపత్ని హరణ

మున్వాల సుగ్రీవ హనుమదాదుల స్నేహ
మవ్వాలి హనన, మయ్యాతుధాన

తే॥ పురమునందున సీతను నరయుటయును
లవణవారిధి బంధించి లంకఁజొచ్చి
రావణునితోడ యుద్ధంబు, రాముజయము,
నవ్విభీషణు పట్టంబు నాదిగాఁగ. 291

తే॥ వృత్తమెల్లను దెలిపి యయ్యుత్తముండు
రామచంద్రుఁడు వచ్చెను ప్రేమమీఱ
నలభరద్వాజునాశ్రమ స్థలినిఁజేరె
ననుచుఁ దెలుపంగ హర్షాబ్ధిమునిఁగియతఁడు. 292

తే॥ అంత శత్రుఘ్నుఁ గనుఁగొని యనియె నిట్టు
లయ్య! మనయన్న శ్రీరాముఁ డరుగుదెంచె
సంబరంబు నయోధ్యనుజాటఁ బంపు
మలుకు ముగ్గు లలంకారములు చెలంగ. 293

తే॥ వేగ నెదురేఁగి కొనితేరరాగదయ్య!
యనఁగ శత్రుఘ్నుఁడ వ్వార్త కలరి పురము
నంతటను జాటఁ బంచెను నతిరయమునఁ
బౌరులానంద మెసఁగ నవ్వారిగాఁగ. 294

సీ॥ మేడలనెత్తిరి వాడ వాడల యందుఁ
బడగలు దెలుప సుస్వాగతంబు
నారికేడములు ఖర్జూరికారంభముల్
ద్వార భూముల నిల్పి పర్వమనుచు

గుమ్మముల్కస వూడ్చి దుమ్ము లడంగమే
ల్పన్నీరు సల్లి పూల్పఱచి వేడ్క
లెసఁగఁగఁ దోరణాల్పొసఁగించి యంతట
నుత్సవంబులు సేయ నుత్సహించి

తే॥ ప్రేమమీఱఁగ రంగవల్లికలు దీర్చి
పౌరు లెల్లరు శ్రీరామభద్రుఁ గాంచు
భాగ్య మబ్బెనటంచు సంబరము తోడ
రాజవీథులఁ జేరిరి భ్రాజితముగ. 295

సీ॥ తూర్యనినాదముల్ప్రోంగలించుచు మ్రోఁగఁ
చతురంగ బలసముచ్చయముగదల
మంత్రిపురోహిత మంత్రతత్త్వజ్ఞులు
ముచ్చటల్ సలుపుచు మురిసినడువఁ
బౌరవర్గములిరుపార్శ్వంబులను గొల్వ
మొనసిపట్టపుటేన్గు మున్నుకొనుచు
భరత శత్రుఘ్నులు పాదచారులుగాఁగ
నాంజనేయుఁడు వారిననుగమింప. 296

తే॥ రామచంద్రున కెదురుకోల్సలుపఁ బురము
కదలినట్లైన, సంతోష కలకలంబు
నింగిఁ బ్రాఁకెను దేవతానికరములను
వేఁడు కలుసూడ రమ్మని పిలుచునట్లు. 297

వ॥ ఎల్లరు పురంబు వెలువడి కొంతదూరంబు నడువనప్పు డాంజనే
యుండు భరతుంగాంచి హర్షోత్కర్ష ప్రసంగంబులఁ దనుపుచు.

మ॥ అదిగోచూడుము రామచంద్రుఁడు విమానారూఢుఁడై భాస్కరుం
డుదితుండై యుదయాద్రిపైఁ బొలుచు నట్లొప్పారుచుండఁ దమ్ముఁ
డున్
సదయుండైన విభీషణుండు, సతియుఁ దానర్కసూనుండు, పెం
పొదవం గొల్వఁగ వచ్చువాఁడని మరుత్పుత్రుండు చూ
పింపఁగన్. 298

తే॥ మోముపై కెత్తి భరతుండు మ్రొక్క నంతఁ
బుష్పకంబట్టె రివ్వనఁ బుడమిడిగియె
రామచంద్రుండు తమ్మునిఁ బ్రేమమీఱఁ
గౌఁగిలించుచు సంతోష కలితుఁజేసె. 299

శా॥ ఆనందాశ్రువులొల్కఁగా భరతుఁడన్నా! రాఘవా! యంచు స
మానంబొప్పఁగఁ గాళ్లపైఁబడిన, లెమ్మా! తమ్ముడా! యంచునె
మ్మేనున్మేనును జేర్చి హర్షపులకల్మీఱంగ ముమ్మాటిక
త్యానందమ్మునఁ గౌఁగిలించుకొనుచుం ధన్యాత్ములై రిర్వురున్.

వ॥ అనంతరంబు భరతుండు సీతాదేవికి భక్తిపూర్వక ప్రణామంబాచ
రించి, ప్రణతుండైన లక్ష్మణునాలింగనాదులనాదరించి, యాం
జనేయుండెఱుక పఱుప సుగ్రీవ విభీషణాదులనత్యంత గౌరవంబున
నాదరించిన, రామచంద్రుండు సాష్టాంగంబుగం బ్రణమిల్లినశత్రు
ఘ్నుఁ గౌఁగిలించుకొని ముదంబుఁగలిగించి, పత్నీసహితుండై
పురోహితుండగు వసిష్ఠునకును, పండితోత్తములగు భూసురశ్రే
ష్ఠులకును బ్రణమిల్లి, తల్లులకుఁబ్రీతి పూర్వకంబుగ వందనంబాచ
రించి, నమ్మానన పురస్సరంబుగ నమాత్యులు మున్నగువారినిఁ

బలుకరించుచు, నిష్టసల్లాపంబుల నందిగ్రామంబుసేరి విశ్రమిం
చుచు, ననేకపౌరవర్గంబులం గూడి యిష్టాగోష్ఠినున్న యవసరం
బున భరతుండు రామచంద్రునకు నమస్కరించి యిట్లనియె.

శా॥ "నీయాజ్ఞ న్శిరసావహించి పదముల్నిత్యంబు సేవించుచున్
ఛాయామాత్రుఁడనౌచు రాజ్యరమణిన్ సద్వృత్తిఁగాపాడితిన్-
భూయోరాజ్యరమాధురంధరుఁడవై పొంకంబుగా నేలుచున్
శ్రేయస్సాధకమాయశంబుఁగనుమా, శ్రీరామచంద్రప్రభూ! 302

ఉ॥ రాజ్యమునీది నీప్రజలురాఘవ! నేనునిమిత్తమై సుభో
భోజ్యముగాఁగభూజనులుపొంది పొసంగఁగ నేలుచుంటినీ
పూజ్యపద ద్వయంబునకుఁ బూనికనిచ్చలు నప్పగించుచుం
బూజ్యుఁడ! న్యాసమిద్ది పరిపూర్ణము కొమ్మిఁక నీవురాజ్యమున్.

ఉ॥ రాముఁడె మంగళప్రదుఁడు రంజిలు నిత్యము రామరాజ్యమం
చీమహి యెల్లవేళలఁ బ్రతీక్షణసేయును నిన్నుఁ గాన శ్రీ
రామ! కృపారసంబుగదురంధరనేలఁగఁ జిత్తగించు, నీ
నామమహత్త్వమెన్నఁగఁఘృణామయ! శక్యమెమాదృశాళికిన్.

తే॥ అనుచుఁ బ్రార్థించి పాదుకల్గొనుచు వచ్చి
భక్తిమీఱంగ మంగళ వాద్యఘోష
ములు చెలంగఁగ రాముని పూజ్యపాద
ములకుఁ దొడిగెను గై మోడ్చిముదితుఁడయ్యె.

క॥ అంగీకరింప రాముఁడు
రంగుగ భరతుండు రామరాజ్యంబనుచున్
బొంగుచు శత్రుఘ్నుంగని

సింగారములలరఁ బురినిఁ జేయుమయనియెన్. 306

ఆ॥ వె॥ అతనియాజ్ఞమేర కప్పురంబంతట
నినుమడించు సొగసులెలమిఁదీర్చి
రాముపట్టమంచు రంజిల్లఁబౌరులు
సంబరములు మించెఁ జత్వరముల. 307

సీ॥ రాముఁడు భరతుండు లక్ష్మణ శత్రుఘ్ను
లోలిఁ గాషాయంబులూడ్చి, జడలు
విడిచి యాయుష్కర్మ విధిని సుస్నాతులై
పీతాంబరాదులఁ బేర్మిఁదాల్చి,
రహిమించు భూషణరాజి మేనులనొప్ప
నలువురు శృంగారకలితులైరి,
పడఁతి సీతాసతి పరిచారికల్దీర్ప
నలరె సాక్షాల్లక్ష్మి యట్టులపుడు.

తే॥ అర్కజ విభీషణాదు లత్యంత గరిమఁ
బత్నులను గూడి స్నాతులై భక్తి మెఱయ
నందఱప్పు డయోధ్య కానంద మెసఁగ
నరదముల నెక్కి కదలిరి మెఱయు వేడ్క. 308

చ॥ భరతుఁడు శ్వేతఛత్రమునుబట్ట, సుమిత్రకుమారు లిర్వురున్
సరసలనిల్చి చామరలసత్కర శోభితులౌచు వీవ, మే
దురనవ శోభచే నవవిధోజ్జ్వల రత్న ప్రభావిశేష భా
సుర రథమందు రాఘవుఁడు చూడఁగ నొప్పెసురేంద్రుఁడో
యనన్. 309

ఆ॥ వె॥ ఒకరివెనుక నొక్కరొగి రథంబులనెక్కి
కదలిరపుడు వేడ్క కడలు కొనఁగ
సూర్యపుత్రుఁడంత శుభకర శత్రుంజ
యంబుననెడు నేన్గునధివసించె. 310

వ॥ అంగ దాంజనేయులు గజారూఢులై యిరుపార్శ్వంబుల నడచు చుండఁ, బురోహిత మంత్రి మిత్రి పౌరవర్గంబులు ముందునడువ, ననేక విప్రాశీర్వాదంబులును, వంది మాగధస్తుతి వచనంబులును జెలంగ, బహువిధపటహ, కాహళ, భేరీ, మృదంగాది మంగళ వాద్యనినాదంబులు మిన్నుముట్ట, నామ్రపల్లవాశ్వత్థకిసలయాలం కృతనువర్ణ కలశంబులంబూని వృద్ధసువాసినులు మంగళగీతికలు పాడుచుండ రామచంద్రుం డయోధ్యాపుర ప్రవేశంబు సేయు నవసరంబున. 311

తే॥ రామ! శ్రీరామ! దశరథ రామయనెడు
పలుకులను గూడిమంగళ వాద్యనినద,
ములు చెలంగ వికస్వర పుండరీక
నయనుఁ డయ్యెను రాముండు జయరవముల. 312

చ॥ పురమున రాజవీధి రఘుపుంగవుఁ డేఁగుచు నుండునంత, మం
దిరముల నెక్కిసుందరులు తేరుపయిం "జయరాఘవా" యటం
చురుకుచకుంభముల్గదల నుల్లము రంజిలఁ జల్లి సేసలం
దరుణి విదేహరాజసుత ధన్యయటంచుఁ దలంచి రిచ్చలన్.

ఉ॥ పౌరులు "రామ! రామ! కులపావన!" యంచుఁజరిత్ర మొప్పగం
బౌరులు దీరిచెప్పుకొన భవ్యచరిత్రుఁ డయోధ్యఁ జేరెఁ దా

దూరిత దుర్జనుండగుచు దోర్బల మొప్పధరాభరంబు, దై
వాఱఁగ సౌఖ్యముల్ప్రజకపార ముదంబునఁ బూనువాఁడునై.

చ॥ ఇరవుల కేఁగి రెల్లరును నెంతయుఁ బ్రీతితలిర్ప, రాముఁడుం
దరుచర రాక్షసాధిపులఁదన్వనియోగము సేయ వారికిం
బురమున విడ్దులేర్పఱచి, పొందికఁ దృప్తి పొనర్చువాఁడునై
బరగెను గైక నందనుఁడు భాగ్యముపండిన కౌతుకంబునన్. 315

## శ్రీరాముని పట్టాభిషేకము.

వ॥ మఱుదినంబు సూర్యోదయంబగు నప్పటికి సుగ్రీవనియోగంబున జాంబవత్సుషేణ గవాక్ష, ఋషభ, నల, హనుమదాదులు పుణ్యానదీనద తీర్థంబులను, చతురంభోధి జలంబులను, స్వర్ణకలశంబులంగొనితేర, శుభముహూర్తం బాసన్నంబగుడుఁ బురోహితుండగు వసిష్ఠుండు బ్రాహ్మణోత్తములంగూడి నానావిధాలంకార పరిశోభితంబైన పట్టాభిషేక మంటపంబున కరుగుదెంచి, యనేకవిధ ఫల పుష్ప తాంబూలాద్యుపకరణ విరాజితంబును, సమస్త నదీనదోదధి పుణ్యతీర్థ పరిపూర్ణ సువర్ణకలశ సంశోభితంబును నగు నభిషేకమంటపంబున భద్రపీఠంబుపై సీతా సహితుండగు రామచంద్రునిఁ గూర్చుండఁబెట్టి, ఋషీంద్రులును, సుగ్రీవాది వానరవర్గంబును, విభీషణాది రాక్షస గణంబును, బంధుమిత్రపౌరజానపదకోటియుఁ, దార్కిక, వైయాకరణ, మీమాంసక, వేదాంత్యాది పండిత ప్రకాండులును, సాహిత్యపరులును, కవి, గాయక, నటక, వందిమాగధ బృందంబులును ఉత్తమప్రకృతి వర్గంబును, పౌర నారీసమూహంబును, గన్యకాజ

నంబును, దమ తమ నిర్ణీతస్థానంబులనుండి కొలువ, దిక్పాలుర తోడంగూడ దేవతాబృందంబులు శ్రీరామ పట్టాభిషేక దర్శనకుతూహలంబున విమానంబులలో నాకసంబున నిలిచి యుల్లసింప వసిష్ఠ, వామదేవ, జాబాలి, కాశ్యప, కాత్యాయన, సుయజ్ఞ గౌతమ, విజయులను మహర్షులు నిర్మలంబైన సుగంధి సలిలంబున వసువులు వాసవునింబలె వేదమంత్రంబులు పఠియించుచుఁ, బురుష సూక్త విధానంబున నభిషేకింప, ననంతరంబు ఋత్విజులు బ్రాహ్మణులు, కన్యకలు, మంత్రులు, యోధులు, నైగములు గ్రమముగ నభిషేకించి సంతుష్టులైరంత. 316

ఉ॥ సేమముఁ గూర్పఁగా ధరకుఁ జిత్తము తెల్పఁగ బ్రహ్మ నిర్మితం
బై మను వంశభూపతుల కంచిత పద్ధతి సంక్రమించుచుం
బ్రేమ వసిష్ఠమౌనివరనిష్ఠితమై, వరసింహ పీఠికన్
రాముని యుత్తమాంగమున రత్నకిరీటము పొల్చె దీప్తమై. 317

చ॥ జయ జయ రామచంద్ర! యనుశబ్దములాసభ మిన్నుముట్టె, ది
గ్జయము పొసంగ దుష్టజన సంహరణం బొనరించితీవు, ని
శ్చయముగ మానవాళికిఁక సౌఖ్యసమృద్ధి ఫలించె రాఘవా!
జయము జయంబటంచు సురసంఘము మింటవచించె వేడుకన్

తే॥ మునులు దీవింపఁ బౌరులు మోదమందఁ
బట్టె శత్రుఘ్నుఁడవ్వేళ పట్టుగొడుగు
మర్కట నిశాట పతులు చామరలువీవఁ
జెలఁగె రాముఁడు సీతయు సింహాపీఠి. 319

ఆ॥ వె॥ వాయుదేవుడంత వాసవచోదితుఁ

డగుచు రాముమెడను నందమైన
మాల నూఱు పుష్కరాల వెలింగెడు
దాని స్వర్ణమయముఁ బూనివేసె. 320

తే॥ శక్రచోదితుఁడై వేయ సొంపుగులుకు
రత్న రంజితమై మణిరత్నశోభి
తంబు ముత్యాలహారంబు కంబుకంఠ
మందు వెలుఁగొంద రాఘవుఁడలరె మిగుల. 321

ఉ॥ గోవులు వేయినూఱులను, గుఱ్ఱములన్నియు, నూఱునెద్దులన్
శ్రీవిలసిల్లు వాఁడగుచు శ్రీరఘురాముఁడు విప్రకోటికిన్
భావము రంజిలంగ బహువస్త్రము లాభరణాళి, రత్నముల్
భూవిభవంబుతోఁగరము పొంగుచు దానమొసంగె నత్తఱిన్.

ఉ॥ వేడుక నర్కసూతి మెడవేసె మణీమయహారమంగదం
బోడనె వజ్రరత్నములతో వెలుఁగొందెడు నంగదంబులం
బొ్రిడవటంచుఁ దృప్తిఁగనుమోయి యటంచు నలంకరించె, మే
నూఁడిచి ముత్తెపున్ సరము నొప్పుగ సీతకు నప్పగించినన్.

చ॥ పరమ కృపాపరుండయిన భర్త మొగంబును వాయుపుత్రిమో
మరయుచుఁజూచి చూచి వసుధాత్మజ వేగమ కంఠహారమున్
బిరబిరనూడఁదీసి తమిపెల్లిదమొప్పఁగ వాయుసూనుకం
ధరమునవేయ రాఘవుఁడు తద్దయు విస్మితుఁడై కనుంగొనెన్.

తే॥ అల విభీషణునకు రాముఁడలరి తనదు
కులధనంబు నొసంగినఁ జెలువుమించెఁ,
దక్క వానరకోటికిఁ దగినవసన

భూషణంబులొసంగినం బొంగె మిగుల. 325

ఆ॥ వె॥ విందులారగించి వివిధమౌ వేడుకల్
క్రందుకొనంగం జూచి గారవమున
వీడుకొలుపందిరిగి వెడలిరి తమతమ
పురములకు నితాంతముదితులగుచు. 326

తే॥ రామచంద్రుండు లక్ష్మణుం బ్రేమమీఱ
వేడుకొనంగాని యాతండు వినకయున్న
రామరాజ్య ధురంధర ప్రభుతనెఱప
భరతునకుం గట్టెయువరాజ పట్టమపుడు. 327

—♦♦♦ రామరాజ్య పాలనము, ♦♦♦—

ఉ॥ పౌరులుమెచ్చమంత్రిలను బ్రాజ్ఞులం గార్యధురీణులన్సదా
దూరవిచారులన్నిలిపి, దుర్జనబాధలరూపుమాపి, ని
స్సారపుం జింతలందొలంచి, సంతతధర్మధురీణబుద్ధి యే
పారంగ, రాముండేలె భువినంతట సౌఖ్యములుల్లసిల్లంగన్. 328

చ॥ దుడుకులడంచి, క్రూరులగు దుష్టజనంబులంగీటడంచి, రా
ముండు జనతాభిరాముండయి, మోదముతోభువినేలుచుండ, నె
వ్యెడరుపొసంగకుండెం, బరికింపంగ సస్యసమృద్ధిచేంబ్రజల్
వెడందలు సౌఖ్యముల్గలిగి వీతవిచారులు గాంగనత్తఱిన్. 329

ఉ॥ రాముండు రాజ్యమేలుతఱిం బ్రాజ్యసుఖంబులు పెల్లుమీఱె, నా
నామహనీయసంపదలు న్యాయపథంబున వృద్ధిం జెందె, శ్రీ
ధామముభూమి, ధర్మపరతన్నగరంబులు పల్లెలొప్పె, సు
త్రామసురక్షితంబు సుఖధామము స్వర్గమునట్లుభాసిలెన్. 330

ఉ॥ ఆకలి యొక్కనాఁడు తనచాకితతోఁగలహించి "నిందితం
జేసిన రాముఁడంచు నపరాజిత మునందల పోయుదేమొ'' యన్
వాకు వినంగ నాక్షణమ పావని జానకి వీడినట్టి యి
క్ష్వాకుకులుండు రాఘవుఁడు పాలనసేయఁగ లోపముండునే? 331

సీ॥ షట్కర్మనియతిమై సద్ద్విజుల్లనరుచు
వర్ణాశ్రమాచార పరతనుండ
ద్విజులను సేవించి సుజనత యడరంగ
శూద్రజాతియుఁ గర్మశూరమగుచు,
లోభంబు విడనాడి లోకశాంతినిఁగోరి
యన్యోన్య సహకార మరసి బ్రదుకఁ
దమ తమ పనుల సంతత తృప్తులై జనుల్
ధర్మ పరాయణుల్కర్మపరులు

తే॥ గాఁగ, నిత్యంబుతులలేని భోగపూజ్య
మగుచురంజిల్లె రామ రాజ్యంబు పుడమిఁ
బ్రభువె ప్రజలయి, ప్రజలె సత్ప్రభువుగాఁగ
రాజ్యమొప్పదె దినదిన భ్రాజితముగ. 332

ఉ॥ రచ్చలనెందుఁ గన్న రఘురామ చరిత్రమతప్ప నిచ్చల
న్మచ్చుకునైనఁ జూతమనమాయల మాటలు, హింససేయుట
లుచ్చితమా తలంపులును, లోభగుణంబులుగాంచ మెచ్చుట
స్మచ్చట దీఱ రాఘవుఁడు భూమిని నేలుచునుండు నత్తఱిన్.

ఉ॥ వానలులేకపోయె నిఁకఁ బైరులు పండుట కేది సాధనం
బౌనని రామ రాజ్యమున నాడెడు మాటలకున్న హేతువ

మ్మానవనాథు సత్కృపను మాసము మాసము మూఁడువానలు
న్మానక వచ్చుచుండ, నసమాన మహాత్ములు ధార్మికవ్రజల్.

చ॥ విధవలరోదనధ్వనులు విన్నదిలేదు, విషోరగంబులు
న్మెదలఁగఁ జూడలేదు, ధరణింగడుఁ గ్రూరమృగాళి బాధలుం
గదురఁగఁ గాంచలేదు, కుజనంబులు నిండ్లను, గడ్డివాముల
న్వెదకుచు నగ్గిపెట్టి పడిసీటొనరించుట చూడమెన్నఁడున్. 335

చ॥ తనయులఁబాసి యత్తఱినిఁ దండ్రులు దుఃఖితులైన వార్తల
న్వినమ, యనర్థముల్దవిలి వేఁచుట గానము. వ్యాధిబాధలం
గనమ, విశుద్ధధార్మికులుగావునఁ గయ్యము లొల్లరెవ్వరుం
ఘనుఁడగు రామ చంద్రుఁడు సుఖంబుగ రాజ్యమునేలునత్తఱిన్.

ఉ॥ దొంగతనంపు వార్తలను, దోపిడివార్తల నెందునేనిఁగా
నంగలవారలే ప్రజలు, న్యాయసమంచిత మార్గులౌటచే
సంగత సచ్చరిత్రులయి సాధుజనావళిఁబ్రోచువారునై
పొంగుచు నుండ్రుగాని, రఘుపుంగవుఁడేలిన కాలమందునన్.

ఉ॥ జాతుల నెన్నుకొంచుఁ దమసత్త్వమెఱుంగక స్వార్థబుద్ధిచే
నీతిఁదొఱంగి నిత్యమగు నిర్మల కర్మమునుజ్జగించి ప్ర
ఖ్యాత పవిత్ర సద్గతికిఁబాసి కుయుక్తులు పన్నువారలై
గోతను గూలువారగుచుఁ గుందుచు నుందురె రామపాలనన్.

ఉ॥ పండిన ధాన్యమంతయును పాతరఁబోయుచుఁ బ్రక్కయింటివా
రెండుచునుండఁజూచి మనకేమని యుందురె రామ రాజ్యమం
దొండొరులైకమత్యమున నుండుటె వారికి నిత్యధర్మమై
యుండెను, దిండిలేని తన మొక్కటనేనియుఁ గాంచఁగల్గెనే?

చ॥ ప్రజలు ప్రభుత్వముంజెలుచు భావములొల్ల రహర్నిశంబునుం
ప్రజకె హితంబుఁగోరి ప్రభువర్గము పాలనసేయుఁగాని, సా
ధు జనులు పోలెనుండి కడుదుర్మతి స్వార్థపరీత చిత్తులై
ప్రజలనుఁబీల్చి లంచముల లాఁగఁగుయుక్తులు పన్నువారలే?,

చ॥ పురుషులు ధీరులై పరగఁ బుత్రుల వీరులఁగన్న తల్లులుం
బరముముదంబు సంధిలఁగ భారత వీరులసచ్చరిత్రముల్
ధరణికి సేవసేసి యడరంగవినిర్మల ధర్మతత్త్వముల్
గలపుదురంతెగాని, కడఁకం గపటాత్ములఁ జేయనెంతురే?. 341

ఉ॥ అన్నలు తమ్ములన్న మరియాదలు సత్క్రియలందె, ధర్మము
త్సన్నము సేయుపట్టులఁ గుతంత్రముఁ బన్నెదు పట్టులందు సం
పన్నులు పేదవారనెడు భావముఁజూపక, పక్షపాతసం
ఛన్నులుగాక పాలకులు సల్పుదు రుత్తమ పాలనంబులన్. 342

ఉ॥ తమ్ములతోడ రాఘవుఁడు ధారుణి నేలిన యన్నినాళ్లు ని
త్యమ్ముగ సౌఖ్యసంపదలు హాయిఁగఁ బౌరులకబ్బెఁగాని, రా
జ్యమ్మున నీతిబాధలకుఁజాలక కంట్రోలు బాధలేర్పడం
గ్రిమ్మరి కూడుగుడ్డలకు గోషలఁజెందుట విన్నవారమే? 343

ఉ॥ పెక్కులు జన్నముల్సలిపి పేదలపాలిటి కల్పవృక్షమై
చక్కని పాలనంబెసఁగ సౌఖ్యముఁ గూర్చుచునుండెఁగాని, నాఁ
డెక్కడనేని రాజ్యమునవెంతయు దుర్గతినంది చిక్కులం
జిక్కినవారిపై మరల చిక్కులుపెట్టఁగ విన్నవారమే?. 344

ఉ॥ సేమముఁగూర్పఁగా ఋషులుచేసిన ధార్మిక శాసనంబులన్
రాముఁడు, పౌరవర్గములు రంజిలఁ బాలన సేయుచుండ, శ్రీ

రాము కటాక్షించు నెదలండలపోయుచు నుందురిగాని, యే
మేమియొ తప్పుల న్వెదకి యీర్ష్యలఁ బెంచుట విన్నవారమే?.

ఉ॥ పల్లెలఁ బట్టణంబులను బాలురు వృద్ధులు రామ రాజ్యమం
చుల్ల మెలర్ప సద్విధుల నొప్పుచునుందురు, క్రిందినుండి పై
కెల్ల ప్రభుత్వశాఖలవి యేమిసుఖంబని యెంచువారలుం
గల్ల ప్రభుత్వమంచుఁ బలుకన్ సమకట్టెడు వారలుందురే?.

ఉ॥ నీతి విశారదుల్ దృఢవినిర్మలచిత్తులు, కార్యదక్షుల
త్యాతత సాహితీపరులు తంత్రసమర్థులు శాస్త్రకోవిదుల్
ప్రీతిగ స్వార్థదూరులగు వారలె యత్తఱి మంత్రులై ధరం
ఖ్యాతిగ నేలుచుందురటుగా కొరులిప్పని కర్హులౌదురే?. 347

ఉ॥ యోగ్యుల నుద్ధరించి, సమయోచిత కార్యధురీణులై ప్రజా
భాగ్యముఁ బెంపుసేయఁ దగువారినె మెచ్చెదరంతెగాని, ని
ర్భాగ్యుల, లంచగొండ్లఁ, దమపక్షమువారలఁ, దిండిపోతులన్
యోగ్యతలేని మూఢులనియుక్తులఁజేయఁగ రాముఁడొప్పునే?.

ఉ॥ ఎవ్వఁడుగాని పౌరులకు నేడ్తెఱ ద్రోహముసేయనున్న నా
సవ్వడి పట్టి రాఘవుఁడు చారముఖంబున నిశ్చయించి, తా
నవ్విధినున్నవారి హితమార్చుచు ధర్మముఁ గావఁజూచు, నిం
కెవ్వరు నట్టికార్యములకెన్నఁడు బుద్ధిమరల్పకుండఁగన్. 349

చ॥ ప్రజలనుబ్రోచుటే పరమపావనమౌ విధి యంచునెంచి, తా
విజయముసేసి యెల్లెడల విజ్ఞుల విన్నపమాలకించి, ని
త్యజయశుభంబు భద్రతల నారయు రాముఁడు, స్వార్థబుద్ధిచేఁ
బ్రజలను మెప్పఁగోరి పరిపాటిగఁ జూడఁడు కార్యశూరుఁడై.

ఉ॥ దేశమునిండ పండితులు దిట్టలు కోవిదకర్షకోత్తముల్
భాసుర వీరవారములు, పౌరులు నిర్మలనీతి పారగుల్
భాసిల, నిత్యసౌఖ్యముల భాస్కరతేజుఁడు రామచంద్రుఁడు
ల్లాసముతోడనేలె, ధరరంజిలె నిత్యము రామ రాజ్యముల్. 351

చ॥ కలకలలాడు సస్యములు క్రమపురోపవనంపు సొంపులుం
గలిగి, శుభావహంబయి, సుఖంబుల కాకరమాచునొప్పె, ని
ర్మలమగు రామ రాజ్యమది మానవనాథుఁడు రాముఁడొటచే
నిలను సుభిక్షమై పరగెనెల్లెఁడ ధర్మము తాండవింపఁగన్. 352

## —ఆశ్వాసాంతము.—

శా॥ శ్రీరంజిల్లఁ బ్రజాప్రభుత్వములు సచ్ఛ్రీయంబుఁ జేకూర్పఁగం
భీరుల్మెచ్చఁగఁ బాలనంబు సలుపందీవించి పాలించు, మీ
వారాధ్యుండవు భారతావనికి, నీవాధారమా దుర్వికిన్
శ్రీరామా! నినునమ్మువార మవనింజింతింపుమాం! కావఁగన్. 353

మాలిని:—పరమముని నిధానా! భక్త సంసేవ్యమానా!
గురుతర సుఖధామా! కోవిదజ్ఞేయనామా!
పరమ విమలమూర్తీ! భక్త సంస్తుత్యకీర్తీ!
నిరుపమ గుణధామా! నెమ్మినన్ బ్రోవురామా! 354

గద్యము:—ఇది శ్రీ భారద్వాజ గోత్ర పవిత్ర, ఆపస్తంబసూత్ర, రాఘవాచార్య ద్వితీయతనూజ, శ్రీరామచంద్ర కరుణాకటాక్షలబ్ధ కవితావిస్ఫురణ, కొండూరు నరసింహాచార్య ప్రణీతంబైన రామ రాజ్యంబను మహా ప్రబంధంబునందు షష్ఠాశ్వాసము. సంపూర్ణము.

# సవరణలు.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 12 | 1 | రేమీఅందఱు | రామీరందఱు |
| 16 | 12 | తఱివేచి | విలుదాల్చి |
| 19 | 17 | సగరు సంతతి | సగరునన్వయు |
| 29 | 15 | యిపుడ | యపుడ |
| 30 | 22 | యికనెటుచూచినం | యింకను నెమ్మోయిం |
| 32 | 13 | ప్రియిాంగనా | ప్రియాంగనా |
| ,, | 17 | నీప్రియుల | నీప్రియుల |
| 36 | 8 | పావమంచు | పాపమంచు |
| 49 | 22 | జాడను | జాడలు |
| 65 | 5 | దీక్షార్చి | దీక్ష్ణార్చి |
| 69 | 1 | చూడ్కకి | చూడ్కికి |
| ,, | 3 | బలియ | బలీయ |
| 94 | 22 | యేగుచు | యేగెను |
| 152 | 15 | సల్పి | సల్పు |
| 196 | 19 | తెఱందున | తెఱంగున |
| 199 | 10 | యయ్యోనేని | యయ్యోనే |
| ,, | 12 | బా్రజ్ఞావిశేషంబు | బ్రజ్ఞావిశేషంబు |
| ,, | 15 | యంగు | యందు |
| 215 | 21 | రావణునితో | రావణుతో |
| 229 | 19 | ప్రళకాల | ప్రళయకాల |
| ,, | 20 | బల్పాణంబుల | బల్బాణంబులు |
| 234 | 9 | యిట్ట | యిట్టి |